శ్రీః

# వివాహ సంస్కారము

## మంత్రార్థ తాత్పర్య సహితము



ప్రకాశకులు


శ్రీ అరుళానంద ట్రస్ట్

**శ్రీ లలితానందాశ్రమము**

**వాడరేవు - చీరాల - 523 157.**

శ్రీః

**'వివాహ సంస్కారము' -** అనే గ్రంథానికి మంత్రార్థతాత్పర్యములు **శ్రీ రాచకొండ వేంకటేశ్వర్లుగారు** అందించగా **శ్రీ విష్ణుభట్ల శ్రీరామమూర్తి అవధాని గారిచే** సంశోధితముకాగా **దువ్వూరి రామకృష్ణారావు ట్రస్ట్‌బోర్డ్‌వారు** గతంలో ప్రజోపయోగార్థంగా ప్రకటించటం జరిగినది. వివాహప్రాశస్త్యము పై చక్కని అవగాహన కలిగించే అద్దానిని నేడు **శ్రీశ్రీశ్రీ స్వామి అరుళానంద శ్రీ లలితానందాశ్రమము** తరఫున వెలువరించడం చాలా ముదావహము.

**- రామోరా, సంపాదకుడు.**

శ్రీః

## వివాహ శబ్ద నిర్వచనము

వివాహ శబ్దములో 'వి' అనియు, 'వాహః' అనియు రెండు భాగములున్నవి. 'వి' అనుదానికి విశిష్టత అని యర్థము. 'వాహః' అనుదానికి పొందించుట అని యర్థము.

ఈ విషయము వీరమిత్రోదయము – సంస్కారకాండలో ఇటుల విస్తరించి చెప్పబడినది.

"వివాహః । వహ ప్రాపణే ఇత్యస్మాద్ధాతోః, భావే ఘఞి కృతే వహనం వాహః । విశిష్టో వాహః వివాహః । వైశిష్ట్యం చ ప్రతిగ్రహాద్యష్టవిధో పాయాన్యతమోపాయేన హోమాది సప్తపద నయనాంత కర్మాభి సంస్కృతత్వమ్ । తథా చ వివాహ పదార్థో (ద్విదల) ద్విఫల స్సిద్ధ్యతి । (1) స్వత్వోత్పాదనం (2) సంస్కారాధానం చేతి । తదేతత్ స్పష్టీకృతం పారస్కరేణ । పిత్రా ప్రత్తా మాదాయ గృహీత్వా నిష్క్రామతి (1-4-15) వరం దదాతీ (1-8-14) త్యంతేన ।

అనువఱకు ప్రతిగ్రహము మొదలుకొని చెప్పబడిన బ్రాహ్మాది పైశాచాన్త వివాహము లెనిమిదింటిలో నేవిధముగానైనను స్వీకరించిన కన్యతో హోమము మొదలుకొని సప్తపదివఱకు గల సంస్కారములచే సంస్కరింపబడుట అని వివాహశబ్దమున కర్థము. ఇది వివాహములో ప్రధానమని తాత్పర్యము.

వివాహము స్త్రీ పురుషులలోని అపూర్ణత్వమును తొలగించి, వారికి పూర్ణత్వ మొసగజాలిన యొక పవిత్ర సంస్కారము, స్త్రీపురుషులిర్వురు దానికి రెండు పక్షములు. ఈ రెంటిని కలిపి – అనగా ఈ యుభయ శక్తులను సమన్విత మొనర్చి, ఈ సమన్వితశక్తిని ఏకలక్ష్యోన్ముఖము సేయుటయే ఈ సంస్కారముయొక్క ముఖ్యోద్దేశ్యము. ఈ సంస్కారప్రయోజనము కేవలము ఇహలోకమునకే పరిమితముకాక, పరలోకమునకు గూడ ప్రాప్తమై యున్నది. కేవలము శారీర – ఇంద్రియ పరితోషము మాత్రము వివాహమునకు గమ్యముగాక, కర్తవ్యపాలనము, దైవారాధనము, అతిథిపూజ, సంతానప్రాప్తి, అధ్యాత్మికోన్నతి, పారివారిక, సామాజిక శ్రేయము నిశ్శ్రేయము దీనికి గమ్యములు (Goals) కావుననే ఇది సర్వసంస్కారములలో నుత్తమ మయినదిగాను పవిత్రమయినదిగాను ఋషులు ప్రతిపాదించినారు.

"**విశేషణ వాహయతీతి వివాహః**" అనగా వివాహితులయిన దంపతులకు విశేషముగా గృహస్థ ధర్మములను వహింపఁజేయు సంస్కార విశేషమునకు **వివాహము** అని పేరు (చెప్పినారు). దీనికి పాణిగ్రహణమని వ్యవహారము గలదు. ఈ సంస్కారవిశేషము ప్రత్యక్షప్రయోజనము, పరోక్ష ప్రయోజనము ఉభయప్రయోజనము నయి యున్నది. ఇట్టి ప్రయోజనములతోగూడిన సంస్కార జనక క్రియా కలాపము **వివాహము**ని సారాంశము.

"విశేషణ వహనం వివాహః, వహ – ప్రాపణే" విశేషముగా పొందించుట అని వివాహశబ్దము యొక్క వ్యుత్పత్త్యర్థము. కన్యాదానానంతరమున వరుడు ఆ నూత్నవధువును ఆమె దృష్టిలోని దోషమును

పరిహరించుటకై మొదట ఆమెను చూడవలెనని ఆపస్తంబ సూత్రము చాటుచున్నది. ఈ సందర్భములోని మంత్రభావమిది – ఈమెయొక్క చూపు ప్రసన్నమై మానసికప్రసన్నతకు కారణమగుచు పతిజీవిత సౌభాగ్యమునకు, తద్వారా దాంపత్యజీవితశ్రేయస్సునకు మూలమగుగాక అని యిచ్చటి –

"అఘోరచక్షురపతిఘ్నేధి శివాపతిభ్యస్సుమనాః" అని వరుడు చెప్పు మంత్రార్థము తెలుపు చున్నది. ఈ భావములో నూత్నవధువు చూపులోనికి గాఢముగా చూచిన వరునిచూపు ఆమెచూపును దోషరహితము చేయుచు సుప్రసన్నమై, ప్రేమార్ద్రమైన ఆమెచూపులో ఐకమత్యమును సంపాదించుకొను చున్నది. ఇక వధువుకూడ ప్రేమతరళములైన తనప్రియ వీక్షణములతో వరునిచూచి, అతని చూపులతో తనచూపులను కలుపుట కూడ మన వివాహసంప్రదాయమే. ఈ రీతిగా ఇప్పటి వీరి ప్రవిమల ప్రథమావలోకనముల సరస సమ్మేళనము వీరి మనస్సులను ఐక్యము చేయుటకు నాంది అగును.

పైన చెప్పిన విధముగా బాగుగా పొందించుట అను వివాహశబ్దవ్యుత్పత్తియొక్క అర్థము నూతనదంపతుల మనస్సులను పవిత్ర ప్రేమ సూత్రముతో సుదృఢముగా బంధించుచు వారి జీవితము లను, (ఇట్టి భారతీయ దంపతీ ప్రచురమైన భారతీయ సామాజిక జీవితమును గూడ క్రమముగా) సర్వానంద సంధాయకముగా దిద్ది తీర్చుటద్వారా ఆ భారతీయ వివాహ శబ్దార్థము సఫలత్వము నొందు చున్నది.

## వివిధ వివాహములు – వాని ప్రయోజనములు

శ్లో॥ బ్రాహ్మో దైవస్తథైవార్షః ప్రాజాపత్యస్తథాఽఽసురః ।
గాంధర్వో రాక్షసశ్చైవ పైశాచశ్చాష్టమోఽధమః ॥" మనుస్మృతి – 3-21

యాజ్ఞవల్క్య స్మృతి 1-3-58, ఆపస్తంబ సూత్రము 2-11-17

బోధాయనధర్మసూత్రము 1-11-1

ఈ మొదలగు స్మృతులలో అష్టవిధ వివాహములు వాని లక్షణములు చెప్పబడినవి.

**1) బ్రాహ్మవివాహము :–**

ఆచ్ఛాద్య చార్చయిత్వా చ శ్రుతిశీలవతే స్వయమ్ ।
ఆహూయ దానం కన్యాయా బ్రాహ్మో ధర్మః ప్రకీర్తితః ॥ మను – 3-27

వేదశాస్త్ర సదాచారములు కల వరుని స్వయముగా ఆహ్వానముచేసి, వస్త్రాదులచే అలంకరించి, మధుపర్కాదులచే పూజించి, కన్యాదానము చేసినచో అది **బ్రాహ్మవివాహ** మనబడును.

**2) దైవవివాహము :–**

యజ్ఞే తు వితతే సమ్యగృత్విజే కర్మ కుర్వతే ।
అలంకృత్య సుతాదానం దైవం ధర్మం ప్రచక్షతే ॥ మను– 3-28

అగ్నిష్టోమాది యజ్ఞమును చేయుచుండగా తనకు ఋత్విక్కుగా నున్న వరునకు అలంకరించి తన కుమార్తె నిచ్చినచో దానిని దైవ వివాహమని చెప్పుదురు.

3) **ఆర్షవివాహము :-**

ఏకం గోమిథునం ద్వే వా వరాదాదాయ ధర్మతః ।
కన్యాప్రదానం విధివదార్షో ధర్మస్స ఉచ్యతే ॥ మను - 3-29

ఒక ఆవు ఒక వృషభము ఒక గోమిథునమగును. ఇట్టి మిథునమును ఒకటిగాని రెంటినిగాని, యాగార్థముగాని తిరిగి కన్యకు ఇచ్చు నిమిత్తము గాని వరుని వద్దనించి తీసికొని కన్యాదానము చేయుట ఆర్షమనెడి వివాహము. ఇచ్చట ధర్మతః అనుటచే శుల్కముగా స్వీకరించుట కాదు - (అట్లుకాక శుల్కముగా గ్రహించుట దోషమని భావము.)

4) **ప్రాజాపత్యవివాహము :-**

సహోభౌ చరతాం ధర్మమితి వాచానుభాష్య చ ।
కన్యాప్రదానమభ్యర్చ్య ప్రాజాపత్యో విధిః స్మృతః ॥ మను - 3-30

ఓ వధూవరులారా! మీరిద్దరు కలిసి ధర్మము నాచరింపుడు అని ముందు పలికి పూజించి కన్యాదానము చేయుటను ప్రాజాపత్య వివాహ మందురు.

4 ప్రాజాపత్య వివాహము - సహోభౌ ... స్మృతః ॥

సహధర్మాచరణ బ్రాహ్మ్యాది వివాహములందు కూడ కలదు. కాన జీవితాంతము ఏకపత్నీత్వము ఇందు ప్రతిపాదించి కన్యాదానము చేయుట ప్రాజాపత్య వివాహ లక్ష్యము. + (ఆశ్రమాంతరమును ప్రవేశించరాదని నియమము చేయుట.)

5) **ఆసురవివాహము :-**

జ్ఞాతిభ్యో ద్రవిణం దత్వా కన్యాయై చైవ శక్తితః ।
కన్యాప్రదానం స్వాచ్ఛంద్యాదాసురో ధర్మ ఉచ్యతే ॥ మను - 3-31

కన్యయొక్క పిత్రాదులకును కన్యకును శక్తిననుసరించి ద్రవ్యము నిచ్చి కన్యను తీసికొనుటను ఆసుర వివాహమందురు.

6) **గాంధర్వవివాహః :-**

ఇచ్ఛయాఽన్యోన్యసంయోగః కన్యాయాశ్చ వరస్య చ ।
గాంధర్వస్స తు విజ్ఞేయో మైథున్యః కామసంభవః ॥ మను - 3-32

కన్య తల్లిదండ్రుల సంబంధము లేకుండగనే స్త్రీపురుషుల అనగా వధూవరుల ఆలింగనాది సంయోగము కాని, మైథునరూప సంయోగము కాని యుండుటను గాంధర్వ వివాహమందురు.

7) **రాక్షసవివాహము :-**

హత్వా ఛిత్వా చ భిత్వా చ క్రోశంతీం రుదతీం గృహాత్ ।
ప్రసహ్య కన్యాహరణం రాక్షసో విధిరుచ్యతే ॥ మను - 3-33

కన్యకిష్టములేకున్నను బలాత్కారముగా కన్యను హరించుచు, కన్య బంధువులడ్డము వచ్చినచో వారిని హింసించి, ఛేదించి, భేదించియు కన్య యేడ్చుచున్నను, నిందించుచున్నను తనతో తీసికొని పోవుటను రాక్షస వివాహమందురు.

8) **పైశాచవివాహము :-**

సుప్తాం మత్తాం ప్రమత్తాం వా రహో యత్రోపగచ్ఛతి ।
స పాపిష్ఠో వివాహానాం పైశాచః ప్రథితోఽధమః ॥ మను - 3-34

నిద్రించుచున్నదానినిగాని, మద్యపానము చేసి పరుండిన దానిని గాని, మద్యపానమును అధికముగా చేసి వస్త్రమునుగూడ సరిగా ధరించని స్త్రీని పరులు లేని సమయములో మైథునము చేయుటను పైశాచవివాహ మందురు.

**ఈ వివాహముల వలని ప్రయోజనములు అచటనే చెప్పఁబడినవి :-**

"అద్భిరేవ ద్విజాగ్ర్యాణాం కన్యాదానం విశిష్యతే -
ఇతరేషాం తు వర్ణానామితరేతరకామ్యయా ॥ మను - 3-35

తల్లిదండ్రుల ఇష్టము మీద తండ్రి ఉదకముతోఁగూడ దానము చేయుటయే బ్రాహ్మణులకు ముఖ్యము.

క్షత్రియాదులకు పరస్పరానురాగమే ప్రధానము. అక్కడే బ్రాహ్మవివాహమును చేసికొన్న వాని పుత్రుడు తనను, ఇరువదిమంది పూర్వాపరులను తరింపఁజేయుననియు,

దైవవివాహము చేసికొన్నవాని పుత్రుడు తనతో పదునైదు మందిని తరింపఁజేయుననియు,

ఆర్షవివాహము చేసికొన్నవాని సంతానము తనతో ఏడుగురిని తరింపఁజేయుననియు.

ప్రాజాపత్యవివాహము చేసికొన్నవాని పుత్రుడు తనతో పదముగ్గురిని తరింపఁజేయుననియు చెప్పఁబడినది. - మను 3-37,38

ఈ మొదటి నాలుగువివాహములలో ఏ యొక్క వివాహమునందు జనించినను బ్రహ్మవర్చస్సు (వేదశాస్త్రాధ్యయనసంపత్తి), శిష్టులకు సమ్మతమైన వారు, రూపము, సత్త్వగుణము, ధనము, యశస్సు, కావలసిన భోగములు, ధర్మాచరణయందాసక్తి కలవారు, శతసంవత్సరములు జీవించువారును జనింతురు.

మిగిలిన అనగా చివరి నాల్గు వివాహములను చేసికొన్నవారికి జనించినవారు క్రూరకర్మలను చేయువారు, అసత్యము పల్కువారు, వేదములను, అందు చెప్పబడిన ధర్మములను ద్వేషించువారును జనింతురు అని చెప్పబడినది.

**గాంధర్వవివాహము (ప్రేమవివాహము Love marriage) :**

ఇచ్ఛయాన్యోన్య సంయోగః కన్యాయాశ్చ వరస్య చ ।
గాంధర్వస్స తు విజ్ఞేయో మైథున్యః కామసంభవః ॥ మను - 3-32

కన్య తల్లిదండ్రుల సంబంధము లేకనే స్త్రీపురుషుల (వధూవరుల) ఆలింగనాది సంయోగము కాని, మైథునరూప సంయోగము కాని గాంధర్వవివాహమనఁబడును.

గాంధర్వవివాహమును చేసికొన్నచో క్రూరకర్మలను చేయువారు, అనృతమాడువారు, వేదములను వేదోక్తధర్మములను ద్వేషించువారును జనింతురు అని చెప్పఁబడినది.

షడానుపూర్వ్యా విప్రస్య క్షత్రస్య చతురోఽ వరాన్ ।
విట్ఛూద్రయోస్తు తానేవ విద్యాద్ధర్మ్యాన్న రాక్షసాన్ ॥ మను - 3-23

బ్రాహ్మణునకు మొదటి ఆరు అనగా బ్రాహ్మదైవార్షప్రాజాపత్యాసురగాంధర్వములు, క్షత్రియునకు ఆసురము మొదలగు నాలుగును అనగా ఆసుర, గాంధర్వ, రాక్షస, పైశాచములు, వైశ్యశూద్రులకు ఆసుర, గాంధర్వ, పైశాచములును పనికి వచ్చునని యర్థము.

చతురో బ్రాహ్మణస్యాద్యాన్ప్రశస్తాన్కవయో విదుః ।
రాక్షసం క్షత్రియస్యైకమాసురం వైశ్యశూద్రయోః ॥ మను - 3-24

అనఁగా మొదటి నాలుగు బ్రాహ్మణులకు శ్రేష్ఠములు. క్షత్రియునకు రాక్షసమొక్కటియే శ్రేష్ఠము. ఆసురము వైశ్యశూద్రులకు ముఖ్యము అని యర్థము. వీనిలో గాంధర్వాదులను చేసికొన్నను తర్వాత యథాశాస్త్రముగా వివాహము చేసికొనవలయును. అట్లు చేసికొన్నను వానికి బ్రాహ్మాదిప్రాజాపత్యాంత వివాహములకున్న ఫలము లేదు. అట్లు చేసికొననిచో ఆ కన్యకు పితృగోత్రనివృత్తి కాదు. అది సర్వదా నింద్యము కాదుగాని యజ్ఞయాగాదులయందు మాత్రము ఆ స్త్రీకి అధికారము లేదు.

నోదకేన నవా వాచా కన్యాయాః పతిరుచ్యతే ।
పాణిగ్రహణసంస్కారాత్ పతిత్వం సప్తమే పదే ॥

గాంధర్వాది వివాహేషు పునర్వైవాహికో విధిః ।
కర్తవ్యశ్చ త్రిభిర్వర్ణైః సమర్థేనాగ్నిసాక్షికః ॥

గాంధర్వాసురపైశాచో వివాహో రాక్షసశ్చ యః ।
పూర్వం పరిగ్రహస్తేషు పశ్చాద్ధోమో విధీయతే ॥

ఇత్యాది వచనములచే కన్యా (దానము) పరిగ్రహమైన పిమ్మట హోమాదికము, సప్తపది ఇత్యాదులు గాంధర్వాది వివాహములయందును చేయవలసినదిగా కనబడుచున్నప్పటికి -

“రాక్షస భిన్నాస్సప్త విప్రస్య” అను ధర్మసింధు వచనముచే రాక్షస వివాహము గాక మిగిలిన యేడు వివాహములకు బ్రాహ్మణునకనుజ్ఞ యీయఁబడినట్లున్నప్పటికి -

బ్రాహ్మాదిషు వివాహేషు చతుర్ష్వేవానుపూర్వశః ।
బ్రహ్మవర్చస్వినః పుత్రాః జాయంతే శిష్ట సమ్మతాః ॥
ఇతరేష్వేవ శిష్టేషు నృశంసానృతవాదినః ।
జాయంతే దుర్వివాహేషు బ్రహ్మధర్మద్విషస్సుతాః ॥
అనిందితైః స్త్రీవివాహైః అనింద్యా ( ద్రా) భవతి ప్రజా ।
నిందితైర్నిందితా నృణాం తస్మాన్నింద్యాన్వివర్జయేత్ ॥

అను వచనముచే చివరి నాలుగు వివాహములవలన కల్గిన సంతానము దోషయుక్త మగునని ఫల కథనపూర్వకముగా నిందించెను. మఱియు గాంధర్వాది నాలుగు వివాహములకు

"త్రిభిర్వర్ణైస్సమర్థేనాగ్నిసాక్షికః"

అను స్మృతి వ్యాఖ్యానమునందు త్రివర్ణ పదమునకు "విప్రవర్జ్య" అని వివరించిరి. అందువలన పూర్వాపరసందర్భము ననుసరించి బ్రాహ్మణునకు గాంధర్వవివాహము నంగీకరించిన స్మృతులకు రత్యర్థమై అసవర్ణ కన్యావివాహవిషయములో యుగాంతరమున అభ్యనుజ్ఞను ఇచ్చుటయందే తాత్పర్యమని స్పష్టముగా ప్రతీతమగుచున్నది. కాన గాంధర్వవివాహముచే స్వీకరింపఁబడిన భార్య ధర్మార్థముపయోగ పడదు; శాస్త్రీయమైన ఫలము నీయలేనిదనియు స్పష్టము.

## వధూవరుల యోగ్యతా యోగ్యతలు
## (గుణదోషములు)

1) వధువు సమానమయిన వర్ణముకలదై యుండవలెను.

2) తన గోత్రమునకు ప్రవరకును చెంది యుండరాదు.

3) ఎనిమిది తరముల పితృబంధువులలోగాని, ఆరు తరముల మాతృబంధువులలోగాని చేరియుండరాదు.

4) సోదరులు గలదయి యుండఁదగును.

5) సులక్షణములు గల్గి యుండవలెను.

6) పూర్వము వివాహితయు వాగ్దత్తయుఁగాక యుండవలెను.

ఇట్టి కన్యను పరిణయమునకు ఎన్నుకోవలెను. ఈ విషయమున మను, గౌతమ, యాజ్ఞవల్క్య, పారాశరాదులు ప్రమాణము.

వారలక్షణములు బాహ్యములు, ఆంతరములునని రెండువిధములు. ఇవి బాహ్యలక్షణములు.

అవ్యంగాంగీం సౌమ్యనామ్నీం హంసవారణగామినీమ్ ।
తనులోమాం కేశదశనాం మృద్వంగీముద్వహేత్ స్త్రియమ్ । మను - 3-10

1) వధువు అంగవైకల్యము లేకుండ నుండవలెను.
2) మధురముగాను సుఖముగాను పల్కుటకు వీలయిన పేరు గల్గి యుండవలెను.
3) హంస గమనమువంటిది, ఏనుగు గమనము వంటిదియునగు సుందరమయిన గమనము గల్గియుండవలెను.
4) ఎక్కువ స్థూలముకాని లోమములు కేశములు దంతములును గలదయి యుండవలెను.
5) కోమలములయిన అవయవములు గల్గి యుండవలెను. ఇట్టివి బాహ్య సులక్షణములు.

బ్రహ్మచర్యము ముగించిన ద్విజుడు పై లక్షణములు గల్గిన వధువును పెండ్లిచేసికొన వలెను.

**దుర్లక్షణములు**

నోద్వహేత్కపిలాం కన్యాం నాధికాంగీం న రోగిణీమ్ ।
నాలోమికాం నాతిలోమాం న వాచాలాం న పింగళామ్ ॥

నర్క్షవృక్షనదీనామ్నీం నాంత్యపర్వతనామికామ్ ।
న పక్ష్యహిప్రేష్యనామ్నీం న చ భీషణనామికామ్ ॥ మను - 3-8,9 శ్లో॥

1) వధువు కపిలవర్ణము గల్గిన కేశములు గలది కారాదు.
2) నిత్యము వ్యాధి (రోగము) కలది కారాదు.
3) అధికములయిన అవయవములు గలది కారాదు.
4) లోమములు అసలే లేనిది అయి యుండరాదు.
5) ఎక్కువగా లోమము లుండునదియు కారాదు.
6) బహు పరుషభాషిణి కారాదు.
7) పింగళవర్ణము గల్గిన కన్నులు గలది కారాదు.
8) ఆర్ద్ర, రేవత్యాది నక్షత్రముల పేరు గలది కారాదు.
9) వృక్షములయు, నదులయు, మ్లేచ్ఛులయు, పర్వతములయు, పక్షులయు, సర్పములయు, దాసులయు పేర్లు గలది కారాదు.
10) భయంకరమైన పేరు గలది కారాదు.

ఇట్టి దుర్లక్షణములు గల్గిన కన్యను పెండ్లాడరాదు.

ఇక ఆంతర లక్షణములు దుర్జ్ఞేయములని ఆశ్వలాయనమహర్షి గారిట్లు చెప్పినారు-

1) క్షేత్రవేదికా గోష్ఠాదులనుండి మృత్తికను తీసికొనిరావలె;
2) ఎనిమిది పిండములు (ఉండలు) చేయవలె;
3) "ఋతమగ్రే ప్రథమం జజ్ఞ ఋతే సత్యం ప్రతిష్ఠితమ్" ఇత్యాది మంత్రములచే అభిమంత్రించవలె;

4) కుమారి నుద్దేశించి వీనిలో నొక్క పిండము గ్రహింపుమని వరుడు చెప్పవలె; ఆమె స్పృశించిన మృత్పిండమును బట్టి తత్తత్ఫలములు గుర్తెఱుంగవలెను.

ఆశ్వ- అధ్యా -, ఖండ 5, సూత్ర-4,5,6.

కన్యావరదోషములను కాత్యాయన మహర్షి యిట్లు చెప్పియున్నాడు -

శ్లో॥ ఉన్మత్తః పతితః కుష్ఠీ తథా షండస్స్వగోత్రజః ।
చక్షుశ్శ్రోత్రవిహీనశ్చ తథాపస్మారదూషితః ॥

శ్లో॥ వరదోషాస్తథైవైతే కన్యాదోషాః ప్రకీర్తితాః ।

**పెండ్లికుమారుడు**

1) ఉన్మాదము గలిగి యుండరాదు; 2) పతితుడు కారాదు;

3) కుష్ఠురోగి కారాదు; 4) నపుంసకుడయి యుండరాదు;

5) తన గోత్రములో పుట్టినవాడు కారాదు;

6) కన్నులు చెవులును లేనివాడు కారాదు;

7) అపస్మారరోగము గల్గి యుండరాదు;

ఇవి వరదోషములు. ఈ దోషములు వధువునకును ఉండరాదు.

**సవర్ణ (సజాతీయ) వివాహము - వర్ణాంతర వివాహములు**

మనుస్మృతిలో -

శ్లో॥ సవర్ణాగ్రే ద్విజాతీనాం ప్రశస్తా దారకర్మణి ।
కామతస్తు ప్రవృత్తానామిమాః స్యుః క్రమశో వరాః ॥ 3-12

అని యున్నది. ద్విజులు ముందుగా తన వర్ణస్త్రీని వివాహమును చేసికొనవలయును. కామాధిక్యము గలవాడయినచో సజాతీయ (సవర్ణ) స్త్రీ వివాహమైన తర్వాత మిగిలిన వర్ణస్త్రీలను చేసికొనవచ్చును. అని యర్థము.

తర్వాత -

శ్లో॥ శూద్రైవ భార్యా శూద్రస్య సా చ స్వా చ విశః స్మృతే ।
తే చ స్వా చైవ రాజ్ఞశ్చ తాశ్చ స్వా చాగ్రజన్మనః ॥ 3-13

అని యున్నది. శూద్రునకు శూద్రస్త్రీయే భార్యగా నుండవలెను. వైశ్యునకు వైశ్యస్త్రీయు, శూద్రస్త్రీయు నుండవచ్చును. క్షత్రియునకు క్షత్రియస్త్రీయు, వైశ్య శూద్ర స్త్రీలును ఉండవచ్చును. బ్రాహ్మణునకు బ్రాహ్మణ స్త్రీయు, క్షత్రియ వైశ్య శూద్ర స్త్రీలు భార్యలుగా నుండవచ్చునని యర్థము. తర్వాత -

శ్లో॥ న బ్రాహ్మణక్షత్రియయోరాపద్యపి హి తిష్ఠతోః ।
కస్మింశ్చిదపి వృత్తాంతే శూద్రా భార్యోపదిశ్యతే ॥ 3-14

బ్రాహ్మణ క్షత్రియులకు ఆపత్తులోనున్నను ఎట్టిస్థితిలోను శూద్రస్త్రీ భార్యగా చెప్పబడలేదని యర్థము – అయితే వెనుకటి శ్లోకములో చాతుర్వర్ణ్య స్త్రీల వివాహము బ్రాహ్మణునకు, త్రైవర్ణికుల స్త్రీ వివాహము క్షత్రియునకు చెప్పబడినది గదా! ఇక్కడ నిషేధమెందులకు చెప్పబడినది? అని శంక గల్గుచున్నది. దీనికి పూర్వశ్లోకములో వరుసగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర స్త్రీలను చేసికొన వచ్చుననియు, ఈ శ్లోకములో బ్రాహ్మణ క్షత్రియులు తమజాతిస్త్రీని వివాహమునుచేసికొనకుండగా ముందుగనే శూద్రస్త్రీని వివాహమాడరాదను వ్యవస్థను తెలిసికొన వలయును. ఇట్లే వైశ్యునకును. ఈ శ్లోకములో బ్రాహ్మణ క్షత్రియ గ్రహణము దోషాధిక్య ప్రదర్శనార్థమని కుల్లూకభట్టు వ్రాసినాడు. ఇట్లు చేసినచో దోషమును పై శ్లోకములోనే –

శ్లో॥ హీనజాతిస్త్రియం మోహాదుద్వహంతో ద్విజాతయః ।
కులాన్యేవ నయంత్యాశు ససంతానాని శూద్రతామ్ ॥ మను. 3-15

అని చెప్పినారు. తనకు తక్కువ జాతిస్త్రీని ఏద్విజులు మోహముచే వివాహము చేసికొందురో వారు తమ సంతానముతో గూడ శూద్రత్వము పొందుదురని యర్థము. వీనినాలోచించినచో ఇతరవర్ణ స్త్రీలకు వివాహము పైవిధముగా చేసికొన వచ్చునని తోచుచున్నది. కాని దీనిని కలియుగములో నిషేధించినారు. నిర్ణయసింధు, స్మృతిచంద్రిక, సంస్కారాండ, వైద్యనాథ దీక్షితీయము (సం.కాం.), పరాశరమాధవీయము, హేమాద్రి కాలనిర్ణయఖండము మొదలగు నిబంధన గ్రంథములలో కలి యుగములో విడువదగిన ధర్మములను చెప్పుచు,

శ్లో॥ సముద్రయాతుః స్వీకారః కమండలు విధారణమ్ ।
ద్విజానామసవర్ణాసు కన్యాసూపయమస్తథా ॥

అను బృహన్నారదీయ వచనము నుదాహరించిరి. సముద్రయానము చేసినవానిని స్వీకరించుటను, మంత్రపూర్వకముగా కమండలమును స్వీకరించుటను, బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు స్వేతరవర్ణ స్త్రీ వివాహమును కలియుగములో చేయగూడదని యర్థము. తర్వాత –

"వర్ణానామసవర్ణానాం వివాహశ్చ ద్విజన్మభిః"

అను ఆదిత్యపురాణవచనమును గూడ నుదాహరించిరి. ఇది కూడ వర్ణాంతరవివాహ నిషేధకమే. ఇట్లు నిషేధించుటచే మన్వాది స్మృతులలో వర్ణాంతరవివాహము చెప్పబడినను దానిని యుగాంతర విషయముగా గ్రహించి కలియుగములో వర్జించవలయును. కాబట్టి కలియుగములో వర్ణాంతర వివాహము పాపజనకమగును.

బ్రాహ్మపురాణమున చెప్పబడినది –

శ్లో॥ క్షత్రవిట్ఛూద్రకన్యాస్తు న వివాహ్యా ద్విజాతిభిః ।
వివాహ్య బ్రాహ్మణీం పశ్చాద్వివాహ్యా క్వచిదేవతు ॥

శంఖలిఖితస్మృతి -

శ్లో॥ ఆపద్యపి న కర్తవ్యా శూద్రా భార్యా ద్విజేన తు ।
తస్యాం తస్య ప్రసూతస్య నిష్కృతిర్న విధీయతే ॥

ఇత్యాది వచనములచే అసవర్ణవివాహము పూర్తిగా నిషేధింపబడెను. అట్లయినచో మనుస్మృతికి గతియెట్లు? అని శంకించి వివాహము ధర్మార్థము, ప్రజార్థము, రత్యర్థము అని మూడువిధములుగా నున్నదనియు, గృహస్థాశ్రమ విహిత తత్తత్కర్మాంగభూత పత్నీసంపాదకమైనది ధర్మార్థమనియు, సంతానము నిమిత్తము స్వీకరింపబడినది ప్రజార్థమనియు, ధర్మ ప్రజార్థము స్వీకరింపబడు కన్య సవర్ణురాలే కావలెననియు, సవర్ణురాలైన భార్యయందు సంతానము కలుగని యెడల క్షత్రియ వైశ్య కన్యలను మాత్రము ప్రజార్థమై పరిగ్రహింప వచ్చుననియు, సంతానము కలిగి యున్నను

"రత్యర్థమేవ సా తస్య కామార్తస్య ప్రకీర్తితా"

రత్యర్థము మాత్రమే శూద్రకన్యను పరిగ్రహింప వచ్చుననియు చెప్పుచు మనుస్మృతి చతుర్యుగ సాధారణమైన దగుటచే యుగాంతర విషయమని వ్యవస్థ చేసిరి, మఱియు

"యదస్యాం జాయతే పునః తజ్జయాయాః జాయాత్వమ్"

అనుశ్రుతిచే భార్యయందు తానే పుత్రరూపముగా జనించుచున్నాడు గాన ఆమెకు జాయాత్వము సంభవించెనని చెప్పబడుచున్నది. ఇత్యాద్యుపపత్తులచే "అవిరోధ ఏవ ద్రష్టవ్యః" అను స్మృతులకు పరస్పరము విరోధము లేదని వ్యాఖ్యాతలు వివరించిరి.

దీనినిబట్టి అసవర్ణవివాహము శాస్త్రీయముకాదని గృహస్థాశ్రమమున నిర్వర్తింపవలసిన ధర్మముల కెంతమాత్ర ముపయోగపడదని స్పష్టమగుచున్నది.

## వివాహమువలన సమాజమునకు గల్గులాభములు

సర్వ ఆశ్రమాః అని యున్నను

బ్రహ్మచారీ యతిశ్చైవ పక్వాన్న స్వామినావుభౌ
తయోరన్నమదత్వా తు భుక్త్వా చాంద్రాయణం చరేత్ ॥

అని యుండుటచే బ్రహ్మచారి యతులే గృహస్థుని మీద ఆధారపడి యుండిరి. వానప్రస్థులప్పుడు గృహస్థునిమీద ఆధారపడి లేరు. ఎప్పుడైనను వానప్రస్థునికి అతిథిగా రావచ్చును. గృహస్థుడు ఆ గ్రామ్యాహారములు తినుచు గ్రామమందుడునుగాన గ్రామ్యగృహస్థునకు అతిథిగారాడు. వన్యాహారము తినుచు అరణ్యములో నున్న గృహస్థునకు అతిథిగా వచ్చినచో గృహస్థునిమీద ఆధారపడి యుండుట అనుమాట అసంభవము గాన "సర్వ ఆశ్రమాః" అనుమాట సామాన్యముగా ఉన్నదిగాని గృహస్థునిమీద ఆధారపడియుండువారు బ్రహ్మచారి యతులే.

బ్రహ్మచారి, గృహస్థుడు, వానప్రస్థుడు, సంన్యాసి అను వారు నాలుగు ఆశ్రమములకు చెందిన వారలు. వివాహము చేసికొనిన వానిని గృహస్థుడని యందురు. అతని నాశ్రయించుకొని మిగిలిన మూడాశ్రమముల వారు జీవించవలయును. మనుస్మృతి ప్రమాణము -

శ్లో॥ బ్రహ్మచారీ గృహస్థశ్చ వానప్రస్థో యతిస్తథా।
ఏతే గృహస్థప్రభవాశ్చత్వారః పృథగాశ్రమాః ॥ 6-87

అని చెప్పబడినది. పైనాల్గు ఆశ్రమముల వారును గృహస్థుని వల్లనే జీవింపవలసి యున్నారు. అందుచే గృహస్థుడు శ్రేష్ఠుడని చెప్పినారు. ఆశ్రమముచే గొప్పతనము గలవారు వానప్రస్థుడును యతియును అయినను పోషకుడగుటచే గృహస్థుడు గొప్పవాడని స్తుతించినారు.

శ్లో॥ యథా వాయుం సమాశ్రిత్య సర్వే జీవంతి జంతవః ।
తథా గృహస్థమాశ్రిత్య వర్తంతే సర్వ ఆశ్రమాః ॥
యస్మాత్త్రయోఽ ప్యాశ్రమిణో జ్ఞానేనాన్నేన చాన్వహమ్ ।
గృహస్థేనైవ ధార్యంతే తస్మాజ్జ్యేష్ఠాశ్రమో గృహీ ॥
స సంధార్యః ప్రయత్నేన స్వర్గమక్షయమిచ్ఛతా ।
సుఖం చేహేచ్ఛతా నిత్యం యోఽ ధార్యో దుర్బలేంద్రియైః ॥ మను 3-77 to 79

ఏ విధముగా సర్వజంతువులు జీవించుటకు వాయువును ఆశ్రయించి యుండునో, అదే విధముగా సర్వాశ్రమములు గృహస్థాశ్రమముపై ఆధారపడి యుండును. ఏలయనగా గృహస్థుడు జ్ఞానమువలనను అన్నమువలనను మిగిలిన మూడు ఆశ్రమముల వారికి సహాయము చేయును. కావున **గృహస్థాశ్రమము** మిగిలిన మూడు ఆశ్రమములకంటే శ్రేష్ఠమైనది. ఇందువలన స్వర్గమునను ఈ లోకమునను సుఖము కోరెడు వ్యక్తి తప్పక గృహస్థాశ్రమమును పరిపాలింపవలయును. దుర్బలేంద్రియములు గల వ్యక్తి గృహస్థాశ్రమము ధరింపజాలడు.

శ్లో॥ పత్నీ ధర్మార్థకామానాం కారణం ప్రవరం స్మృతమ్ ।
అపత్నికో నరో భూపకర్మయోగ్యో న జాయతే ॥
బ్రాహ్మణః క్షత్రియో వాపి వైశ్యః శూద్రోఽ పి వా, నరః ।

ఓ రాజా! భార్య – ధర్మము, అర్థము, కామము అనునవి సిద్ధించుటకు శ్రేష్ఠమయిన సాధనము. అపత్నీకుడగు పురుషుడు బ్రాహ్మణుడైనను, క్షత్రియుడైనను, వైశ్యుడైనను, శూద్రుడైనను ధార్మిక క్రియలకు అధికారి (కర్మయోగ్యుడు) కాజాలడు.

మఱియు గృహస్థుడు శ్రాద్ధములందు ముఖ్యాధికారి. వైదికములగు యజ్ఞాదులయందు గృహస్థుడే కర్తగాను, ఋత్విక్కుగాను ఉండవలెను. అందుచే ఇంద్రాది దేవతలకుగూడ గృహస్థే జీవనాధారము. ఇందువలననే శ్రుతికూడ "ఇతః ప్రదానం దేవా ఉపజీవంతి" తై.సం.3-2-9 అని చెప్పినది.

ఇక్కడ (భూలోకమునందు) ఇవ్వబడినదానిచే దేవతలు జీవించుచున్నారని భావము. శాస్త్రవిధిగా వివాహము చేసికొన్న వానికే పై కర్మలందధికారమున్నది కాబట్టి యీ విధముగా విధిననుసరించి యథావిధిగా చేసికొన్నచో వివాహము సమాజమునకు లాభకారి కాగలదు.

## వివాహ ధార్మిక ప్రయోజనములు

" వివాహస్య ఫలం దేవ పిత్రర్ణాపాకరణమ్ । తథా చ శ్రుతిః – జాయమానో వై బ్రాహ్మణ స్త్రిభిర్ ఋణవా జాయతే బ్రహ్మ చర్యేణర్షిభ్యో యజ్ఞేన దేవేభ్యః ప్రజయా పితృభ్యః ఏష వా అనృణో యః పుత్రీ యజ్వా బ్రహ్మచారీ వాసీ" తై.సం.6–3–10 ఇతి॥

అని చెప్పబడినది. బ్రాహ్మణుడు ఉపనీతుడైనంత మాత్రముననే మూడు ఋణములు కల్గియుండును. (1) ఋషి ఋణము (2) దేవఋణము (3) పితృఋణము. వీనిలో వేదాధ్యయనముచేసి ఋషి ఋణమును తీర్చవలెను. యజ్ఞములను చేసి దేవఋణమును, పుత్రసంతానమును కని పితరుల ఋణమును తీర్చవలెను. **దేవ పితరుల ఋణములను వివాహము చేసికొననివాడు తీర్చుటకు వీలులేదు.** యజ్ఞమునకు, సంతానమునకు భార్య యుండి తీరవలయును. అందుచే వివాహము దేవపితరుల ఋణమును తీర్చుటయను ధర్మ ప్రయోజనము గలది.

ఇక్కడ ఒక ఆక్షేపణ యుండవచ్చును.

పుత్రోత్పాదనవలన పితరుల ఋణము పోవుచో బ్రహ్మచారిగా ఉండి యే స్త్రీయందయినను సంతానమును కనినచో ఋణ విముక్తి యగును గదా! అందులకై వివాహ మెందులకు? అని. దీనికి సమాధానము – హేమాద్రి ప్రాయశ్చిత్త కాండలో 118వ పేజీ

శ్లో॥ ఉపనాయ దినాద్వర్ణీ బ్రహ్మచర్యపరాయణః ।
ప్రమాదాదుత బోధాద్వా యభేన్నారీమకల్మషామ్ ॥
అపకీర్ణీ సవిజ్ఞేయస్సర్వధర్మబహిష్కృతః ॥

అని మార్కండేయ వచనము వ్రాయబడినది. ఉపనయనమైనది మొదలు బ్రహ్మచర్యమును చేయుచు ప్రమాదముచే గాని తెలిసిబుద్ధిపూర్వకముగాగాని స్త్రీ సంగమము చేసినచో వాడు అపకీర్ణి యనబడును. వాడు ఏకర్మకును అర్హుడు గాడు – అని యర్థము. దీనిచే బ్రహ్మచారిగా నుండి సంతానమును గనగూడదని తేలినది. గృహస్థునకునుగూడ పరస్త్రీ గమనమందు దోషము చెప్పబడినది. దీనిచే గూడ వివాహమును యథాశాస్త్రముగా చేసికొని ఆస్త్రీ యందు శాస్త్రోక్తప్రకారముగా సంతానమును కనిన వారికే పితౄణవిముక్తి యగును. కాబట్టి పైవిధముగా వివాహము ధార్మిక ప్రయోజనము గల దగుచున్నది. అందులకే "ధర్మప్రజాసంపత్త్యర్థం స్త్రియముద్వహే" అని సంకల్పమును చేయుచున్నారు.

## వివాహాధ్యాత్మిక ప్రయోజనములు

ఆధ్యాత్మికము అను శబ్దమునకు వ్యుత్పత్తి ఆత్మానమధికృత్య వర్తత ఇత్యధ్యాత్మమ్ । తత్ర భవమాధ్యాత్మికమ్ । ఆత్మ యందయినది యని యర్థము. ఇంతకు ముందు ధార్మికప్రయోజనముగా వివాహము చెప్పబడినది. అదియే ఆధ్యాత్మికముగా గూడ ప్రయోజన మగుచున్నది.

వివాహమయిన తర్వాత యజ్ఞాది కర్మలు చేయవలయునని చెప్పబడినది. ఆ యజ్ఞాదులే ఆత్మయందు సంస్కారమును గలుగజేయును. ఎట్లన బృహదారణ్యకోపనిషత్తులో

"ఆత్మా వా ఆరే ద్రష్టవ్యః" 2-4-5 అని చెప్పి

"తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన దానేన తపసాఽనాశకేన" 4-4-22 అని.

దానికి సాధనములుగా వేదానువచనము, యజ్ఞములు, దానములు, నిష్కామనయా కర్మను చేయుట యను తపస్సు లేక కృచ్ఛచాంద్రాయణాది తపస్సులు – వీనిచేత ఆ పరమాత్మను తెలిసికొనుట కిచ్ఛగింతురు – అని చెప్పబడినది.

**వివాహమైన వానికే యజ్ఞములని** ఇది వఱకే చెప్పబడినది. గాన అట్లు వివాహితుడై యజ్ఞయాగ దానాదులను జేసి ఆత్మను తెలిసికొనుటకు ప్రయత్నమును చేయుట రూపముగా ఆధ్యాత్మిక ప్రయోజనము కూడ (వివాహము) వలన అగుచున్నది.

ఇందులో వేదాధ్యయనము వలన గూడ పై ప్రయోజనము సిద్ధించును గదా! ఇక వివాహ మెందులకు? అను ప్రశ్న కలుగవచ్చును.

**సమాధానము** – వేదాధ్యయనము గూడ ఒక సాధనమే. బ్రహ్మచారికి వేదాధ్యయన మొక్కటియే కాని యజ్ఞాదులు లేవు. గృహస్థునకు వేదాధ్యయనము, యజ్ఞములు, దానములు అన్నియు కలవు. సాధనమునకు అల్పత్వమున్నచో ఫలమల్పముగానే యుండును. వాని బాహుళ్యమున్నచో ఫల బాహుళ్యము కలదు.

గృహస్థునకు ఇతరాశ్రమముల కంటే కర్మ బాహుళ్యమున్నది గనుక వివాహము పైన చెప్పబడిన విధముగా ఆధ్యాత్మికముగా గూడ ప్రయోజనము గలదని సిద్ధించుచున్నది.

## వివాహార్థిక ప్రయోజనములు

గృహస్థాశ్రమధర్మములను పాలించుటకు ధనమవసరము. బ్రాహ్మణులు ధనమును సంగ్రహించుటకు మూడు కర్మలు చెప్పబడినవి. మనుస్మృతిలో

శ్లో॥ అధ్యాపన మధ్యయనం యజనం యాజనం తథా ।
దానం ప్రతిగ్రహశ్చైవ షట్కర్మాణ్యగ్రజన్మనః ॥ 10-75

1) వేదశాస్త్రములను తాను అధ్యయనము చేయుట

2) ఇతరులకు చెప్పుట 3) తాను స్వయముగా యజ్ఞయాగాదులను చేయుట

4) ఇతరులచే చేయించుట 5) దానమును తాను చేయుట

6) ఇతరుల వలన ప్రతిగ్రహించుట

అను ఈ ఆరును బ్రాహ్మణులకు చేయదగిన కర్మలని యర్థము. తర్వాత –

శ్లో॥ షణ్ణాం తు కర్మణామస్య త్రీణి కర్మాణి జీవికా ।
యాజనాధ్యాపనే చైవ విశుద్ధాచ్చ ప్రతిగ్రహః ॥ 10-76

అని యున్నది. పై శ్లోకములో చెప్పిన ఆరు కర్మలలో (1) యాజనము (2) అధ్యాపనము (3) శ్రోత్రియులగు త్రైవర్ణికుల దగ్గర ప్రతిగ్రహించుట - ఈ మూడు కర్మలు బ్రాహ్మణునకు జీవించు వృత్తులు అని అర్థము. అనగా మిగిలిన మూడు కర్మలను నిత్యము చేయవలయును. ద్రవ్యము తనకున్నచో యాజనాధ్యాపన ప్రతిగ్రహము లావశ్యకములుగావు. ద్రవ్యము కావలెనన్నచో ఈ మూడు ముఖ్యమైనవి. వీనిని చేయుటయందు గృహస్థునకే ముఖ్యాధికారము గనుక వివాహము పై విధముగా ఆర్థిక ప్రయోజనము గలదగుచున్నది.

**కన్యాదానఫలము**

(1) కన్య నిచ్చునట్టి దాతయొక్క పితరులు తరించుటయు

(2) వారికి బ్రహ్మలోకనివాసప్రాప్తియు

(3) మోక్షప్రాప్తియు అను మూడు లాభములు కన్యాదాతకు లభించును.

ఈ విషయము వివాహప్రయోగ మందలి

శ్లో॥ కన్యామిమాం ప్రదాస్యామి పితౄణాం తారణాయ వై ।

అనగా పితరులు తరించుటకై నేనీకన్యను నీకు దానము చేయుచున్నాను అని చెప్పుటచే పితరులు తరించుట;

**మహాసంకల్పమునందు**

మయా సహ దశ పూర్వేషాం దశాపరేషాం మద్వంశ్యానాం పితౄణాం నరకాదుత్తీర్య శాశ్వత బ్రహ్మలోకే నివాస సిద్ధ్యర్థం సాలంకృతకన్యాదానమహం కరిష్యే ॥

అనగా నిటునటు పదితరములవారు నాతోగూడ నా వంశీయులగు పితరులు నరకము నుండి బయటపడి శాశ్వతముగా బ్రహ్మలోకనివాసప్రాప్తి నొందుటకై నేనీకన్యను నీకు దానము చేయుచున్నాను. అని చెప్పుటచే పితరులకు **బ్రహ్మలోకనివాసప్రాప్తి;**

"త్వద్దానాన్మోక్షమాప్నుయామ్"

అనగా కన్యవగు నిన్ను దానము చేయుట వలన నేను మోక్షమును పొందుదును అని కన్యాదాత చెప్పుటచే కన్యాదాతకు మోక్ష ప్రాప్తియు గల్గునని **వివాహప్రయోగము** నందలి శ్లోకములు చాటుచున్నవి.

**కన్యావివాహకాలము**

కన్య అనగా ఎనిమిది సం॥రములుకల స్త్రీ.

శ్లో॥ అష్టవర్షా భవేత్కన్యా (ద్గౌరీ) నవవర్షా తు రోహిణీ ।
దశవర్షా భవేద్గౌరీ (త్కన్యా) అత ఊర్ధ్వం రజస్వలా ॥ 3-21

అని యమ (బృహద్యమ) స్మృతియందు చెప్పబడినది. ఎనిమిది సం॥రముల వయస్సు కలదానిని కన్యయనియు, తొమ్మిది సం॥రముల వయస్సు కలదానిని రోహిణి యనియు, పది సం॥రముల వయస్సు కలదానిని గౌరి యనియు స్మృతికర్తలు చెప్పినారు.

అందుచే ఎనిమిది సం॥రముల వయస్సు కలదే కనుక ఆ వయస్సులో కన్యాదానమును చేయవలయునని తేలుచుండగా పైప్రశ్నయే కుదరదు.

కాబట్టి యిక్కడ కన్యాశబ్దమునకు స్త్రీ అని యర్థము, దీనికి సమాధానము నిర్ణయసింధులో భారత వచనము –

శ్లో॥ సప్త సంవత్సరాదూర్ధ్వం వివాహస్సార్వవర్ణికః ।
కన్యాయాశ్శస్యతే రాజన్నన్యథా ధర్మగర్హితః ॥ అని యున్నది.

నాలుగు వర్ణముల వారి స్త్రీలకు ఏడవ సం॥రము దాటిన తర్వాత అనగా గర్భాష్టమమందే పురుషున కుపనయనము వలెనే ముఖ్యము అని యర్థము. కనుకనే సంవర్తస్మృతిలో

వివాహస్త్వష్టవర్షాయాః కన్యాయాశ్శస్యతే బుధైః । అని చెప్పబడినది.

మనుస్మృతిలో

శ్లో॥ త్రింశద్వర్షో ద్వహేత్కన్యాం హృద్యాం ద్వాదశవార్షికీమ్ ।
త్ర్యష్ట వర్షోఽష్టవర్షాం వా ధర్మే సీదతి సత్వరః ॥ 9–94 అని చెప్పబడినది.

30 సం॥రముల వయస్సు గల పురుషుడు 12 సం॥రముల వయస్సుగల కన్యను, 24 సం॥రముల వయస్సుగల పురుషుడు 8 సం॥రముల వయస్సుగల కన్యను వివాహము చేసికొన వలయును. అట్లు చేసికొన్నచో ధర్మము నందుండుచున్నాడని భావము.

"అష్టవర్షా భవేత్కన్యా" అను వెనుకటి శ్లోకములో "అత ఊర్ధ్వం రజస్వలా" అనుదానిచే 10సం॥రములు దాటినచో రజస్వల అని యుండగా ఇక్కడ 12సం॥రములు గల స్త్రీని వివాహమాడ వలయునని చెప్పుటచే ధర్మశాస్త్రము రజస్వలయిన స్త్రీని వివాహము చేసికొనుట కొఱకంగీకరించినది కదా? అను శంక కలుగును. దానికి సమాధానము చెప్పబడుచున్నది.

త్రైవర్ణికులు వేదాధ్యయనము కొఱకు ఒక్కొక్క వేదమునకు 12 సం॥రములు చొ॥న నాలుగు వేదములకు 48 సం॥రములు గాని, సూక్ష్మబుద్ధిగలవానికి ఒక్కొక్క వేదమునకు 5 సం॥రముల చొ॥న 20 సం॥రములు గాని బ్రహ్మచర్యము చేయవలయునని యోగి యాజ్ఞవల్క్యుడు

"**ప్రతివేదం బ్రహ్మచర్యం ద్వాదశాబ్దాని పంచ వా**" అని చెప్పెను. దీనికే మనువు కూడా –

శ్లో॥ షట్త్రింశదాబ్దికం చర్యం గురౌ త్రైవేదికం వ్రతమ్ ।
తదర్ధికం పాదికం వా గ్రహణాంతికమేవ చ ॥ 3–1 అని చెప్పినాడు.

3 వేదములకు ఒక్కొక్కదానికి 12 సం॥రముల చొ॥న 36 సం॥రములు గాని, 6 సం॥రముల చొ॥న 18 సం॥రములు గాని, 3 సం॥రముల చొ॥న 9 సం॥రములు గాని వాని బుద్ధి ననుసరించి గాని వేదాధ్యయనము కొఱకు బ్రహ్మచర్యము చేయవలయునని యర్థము. ఇది ఉపలక్షణము. కాబట్టి నాలుగు వేదములకు పై విధముగా 48,24,12 సం॥రములు గాని, యథాశక్తి పూర్తియగునంత వఱకు గాని బ్రహ్మచర్యమును చేయవలెను. అట్లుచేయు సామర్థ్యము లేనివాడు రెండు వేదములను గాని, లేక ఒక వేదము కాని అధ్యయనము చేసి వివాహము చేసికొనవలయును అని మనుస్మృతి లోనే తరువాత శ్లోకములో –

శ్లో॥ వేదానధీత్య వేదౌ వా వేదం వాఽపి యథాక్రమమ్ ।
అవిప్లుతబ్రహ్మచర్యో గృహస్థాశ్రమమావసేత్ ॥

అని చెప్పబడినది. పైన చెప్పబడినదియే దీని యర్థము. ఇందులో 30 సం॥రముల వయస్సు వఱకు బ్రహ్మచర్యమును చేసిన వాడు రజస్వల కానట్టి 12 సం॥ల స్త్రీని వివాహమాడి కర్మాచరణము చేయ వలయుననియే తాత్పర్యము. ఇది సత్వరః అను పదముచే సిద్ధించినది.

"గృహీత వేదశ్చోపకుర్వాణకో గృహస్థాశ్రమమ్ ప్రతి న విలంబేతేతి "సత్వరః" ఇత్యస్యార్థః "

అని కుల్లూక భట్టు దాని యర్థమును వివరించినాడు. అందుచే తన వయస్సునకు యోగ్యమైన రజస్వల కానట్టియు, పంద్రెండేండ్లకు తక్కువ గల కన్యనే వివాహమును చేసికొనవలెనని యర్థము. అట్లే కానిచో రజస్వల అయిన కన్యను వివాహమును చేసికొన్నవానికి ప్రాయశ్చిత్తమును ధర్మశాస్త్రములో చెప్పుట వ్యర్థమగును. నిర్ణయసింధులో దానము చేయువాడు లేనప్పుడు 12 సం॥ల వఱకు దోషము లేదని సమర్థించినాడు. పరాశర మాధవీయములో –

శ్లో॥ దద్యాద్గుణవతే కన్యాం **నగ్నికాం** బ్రహ్మచారిణే ।
అపి వా గుణహీనాయ నోపరుంధ్యాద్రజస్వలామ్ ॥ భో. గృ. 4-1-12

అని బోధాయన వచనమును వ్రాసిరి.

గుణవంతుడగు బ్రహ్మచారికి రజస్వల కాని కన్యను ఇచ్చి దానము చేయవలయును. అట్లు గుణవంతుడు దొరకనిచో గుణహీనున కయినను ఇవ్వవలయును. కాని రజస్వల యగు వఱకు ఉంచగూడదు అని యర్థము.

నగ్నిక అనగా రజస్వల యగుటకు సిద్ధముగా నున్నది అని యర్థము. మనుస్మృతిలో –

శ్లో॥ కామమా మరణాత్తిష్ఠేద్గృహే కన్యార్తుమత్యపి ।
న చైవైనాం ప్రయచ్ఛేత్తు గుణహీనాయ కర్హిచిత్ ॥ 9-89

అని యున్నది. చనిపోవు వఱకు అట్లే ఉంచవలెను కాని గుణహీనునకు మాత్రము కన్య నివ్వకూడదు అని యర్థము. దీని తాత్పర్యము గుణవంతున కివ్వవలెను గాని రజస్వల యగువఱకు ఉంచుమని కాదు. "ప్రాణము నైనను పోగొట్టుకొందును గాని ఈ పనిని చేయను" అను వాక్యమునకు

ఆ పని చేయక పోవుటయందు తాత్పర్యము కాని ప్రాణమును పోగొట్టుట యందు తాత్పర్యము కాదు. ఇట్లే వెనుకటి "దద్యాద్గుణవతే" అను శ్లోకములో కూడ రజస్వలగా ఉంచవద్దని తాత్పర్యము కాని గుణహీనున కిమ్మని తాత్పర్యము కాదు. ఇట్లు నిబంధన కర్తలు వ్రాసిరి.

వీరమిత్రోదయములో సంస్కారకాండలో 772వ పేజీలో

"యత్తు కామమా మరణాత్తిష్ఠేత్కర్హిచిత్ ఇతి మను వాక్యం తద్గుణవద్వరప్రశంసార్థమ్ । న స్వార్థే ప్రమాణమ్" అని వ్రాసిరి.

అట్లు కానిచో "దద్యాద్గుణవతే" అను బోధాయనవచనముతో విరోధము వచ్చును అని వ్రాసిరి.

శ్లో॥ " ప్రయచ్ఛేన్నగ్నికాం కన్యామృతుకాలభయాత్పితా ।
ఋతుమత్యాం హి తిష్ఠంత్యాం దోషః పితరమృచ్ఛతి ॥ 17-62 అని వసిష్ఠ వచనము.

రజస్వల యగునను భయము కలుగు సమయమున అట్టి కన్యను తప్పక ప్రయత్నము చేసి కన్యను దానము చేయవలయును. అట్లు ఇవ్వనిచో రజస్వల అయినచో తండ్రికి దోషము చెందును అని యర్థము. కన్యయనగా వస్త్రహీనయయినప్పుడు పురుషుని చూచినను సిగ్గుపడనిది కన్యయని పురాణమందు -

శ్లో॥ యావన్న లజ్జితాంగాని కన్యా పురుషసన్నిధౌ ।
యోన్యాదీని న గూహేత తావద్భవతి కన్యకా ॥ అను వచనముచే వివరింపబడినది.

"కలౌ పారాశరాః స్మృతాః" పరా - 1-24

అనుటచే కలియుగములో పరాశరస్మృతిలో చెప్పబడిన ధర్మములు ప్రమాణములు గాన, పరాశరస్మృతిలో -

శ్లో॥ ప్రాప్తే తు ద్వాదశే వర్షే యః కన్యాం న ప్రయచ్ఛతి ।
మాసి మాసి రజస్తస్యాః పిబంతి పితరః స్వయమ్ ॥ పరా- 7-5

12వ సం॥రము వచ్చిన తర్వాత తన కన్యకు ఎవడు వివాహము చేయడో, వాని తండ్రి, తాత మొదలగు పితరులు ఆ కన్యకయొక్క రజస్సును ప్రతి మాసమందు అగు దానిని త్రాగుదురు అని యర్థము. దీనికి గూడ రజస్వల కాకుండగానే వివాహము చేయవలయుననియే తాత్పర్యము.

మరీచి

శ్లో॥ గౌరీం దదన్నాకపృష్ఠం వైకుంఠం రోహిణీం దదత్ ।
కన్యాం దదద్బ్రహ్మలోకం రౌరవం తు రజస్వలామ్ ॥

అని చెప్పినాడు. 10 సం॥రములు గౌరీ సంజ్ఞగల కన్యను ఇచ్చి వివాహము చేసినచో స్వర్గలోకమును, 9 సం॥రములు గల రోహిణీ సంజ్ఞగల కన్యను ఇచ్చి వివాహము చేసినచో వైకుంఠమును, 8 సం॥రముల వయస్సుకల కన్యనిచ్చిన అత్యుత్తమమగు బ్రహ్మలోకమును పొందుదురు

అని యర్థము. కన్య, రోహిణి, గౌరీల కర్థము ఈ ప్రకరణారంభమందైన యమస్మృతి వచనములోనే చెప్పబడినది.

ఇందువలన కన్యాదానమునకు 8వ సం॥రము అనగా గర్భాష్టమము అతి ముఖ్యము. 9వ సం॥రము అంతకంటే కొద్ది తక్కువ ఫలము గలది. 10వ సం॥రము ఇంకను తక్కువ ఫలము గలది. 11 మొదలు రజస్వల యగువఱకు క్రమముగా తక్కువ ఫలము కలది. రజస్వల యయినచో ఫలము లేకపోవుటయే కాక ఎక్కువ దోషమనియు తేలినది.

కన్యా వివాహ కాలముగుఱించి మరియొక రీట్లు చెప్పుచున్నారు. కన్యకు రజోదర్శన పర్యంతము వివాహ కాలము. అష్ట వర్షము లగాయతు దశమవర్ష పర్యంతము ముఖ్య కాలమనియు, తత్ప్రభృతి ద్వాదశవర్ష పర్యంతము గౌణ కాలమనియు, తత్ప్రభృతి షోడశవర్ష పర్యంతము – అనగా రజోదర్శన పర్యంతము అసత్కల్పమనియు, రజోదర్శనానంతరము పూర్తిగా నింద్యమనియు, పలువురు మహర్షులు చెప్పిరి.

"దశవర్షా భవేద్గౌరీ అత ఊర్ధ్వం రజస్వలా!"

"ప్రాప్తే తు ద్వాదశే వర్షే అత ఊర్ధ్వం రజస్వలా ।"

ఇత్యాది వచనములకు దశద్వాదశాది వర్షములను ప్రశంసించుట యందేతాత్పర్యమని కృష్ణం భట్టీయ మందు స్పష్టముగా చెప్పబడినది.

"యావన్నర్తుమతీ భవేత్" అను వచనముచే రజోదర్శన పర్యంతము గౌణముగా అంగీకరించ వచ్చును. "నచ గుణహీనాయ కర్హి చిత్" ఇత్యాది వచనములచే సకాలమున గుణవంతుడైన వరుడు తటస్థించకపోయినను, దాత్ర భావము వలనను. అర్థ లోపము వలనను, అనేక కారణములచే ప్రస్తుత కాలమున రజోదర్శనమునకు పూర్వము వివాహమగుట దుస్సాధ్యముగా నున్నందున అసత్కల్పముగా రజోదర్శనానంతర వివాహమును అంగీకరించి, అసంభాష్య అపాం క్తైయత్వ అవ్యవహార్యత్వాది దోష పరిహారార్థము ప్రాయశ్చిత్తము నాచరించుట చాలా అవసరము. రజోదర్శనానంతరము మూడు సం॥రములు దాటిన యెడల నింద్యమని చెప్పనగును.

"త్రీణి వర్షాణ్యుదీక్షేత విందేత సదృశం పతిమ్" ఇత్యాది వచనములకు తండ్రి వివాహము చేయనియెడల స్వయముగా పతిని వరించుమని విధించుటయందు తాత్పర్యము గాదు అభ్యనుజ్ఞను మాత్రమే ప్రతిపాదించుచున్నదని చెప్పవలెను.

## వివాహము చేయవలసిన రోజులు

ఆపస్తంబమహర్షిమతమునుబట్టి వివాహము స్థాలీపాకదివసము మొదలుకొని 4 రోజుల ఒక పూటతో సమాప్తము చేయవలసి యున్నది. అది ముఖ్య పక్షము.

"త్రిరాత్రముభయోరధశ్శయ్యా బ్రహ్మచర్యం క్షారలవణ వర్జనం చ" ఆప. గృ. 8–8

అని ఆపస్తంబుడు చెప్పినాడు.

ఆశ్వలాయనమహర్షి స్థాలీపాకమును చెప్పి తర్వాత

" అత ఊర్ధ్వం త్రిరాత్రం ద్వాదశరాత్రం సంవత్సరం వైక ఋషిర్జాయతే" 1-8 అని చెప్పినాడు.

(1) ఒక అర్థము :- స్థాలీపాకమైన తర్వాత మూడు రాత్రులు గాని, 12 రాత్రులు గాని, 1 సం॥రము గాని దీక్ష వహించవలెననియు, అట్లు చేసినచో ఋషితుల్యుడగు పుత్రుడు జనించుననియు ఒక అర్థము.

(2) రెండవ అర్థము :- ఇట్లు చేసినచో స్త్రీ పురుషులకు ఏకగోత్రత్వము సిద్ధించునని రెండవ యర్థము. అనగా వధువునకు పితృగోత్రనివృత్తియై పతిగోత్ర ప్రాప్తియగునని తాత్పర్యము.

మానవసూత్రములలోను భారద్వాజసూత్రములలోను "ఏకరాత్రం వా" అని యింకొక లఘుపక్షము చెప్పబడినది. అంతకు తక్కువ పక్షమును ఎవరును చెప్పలేదు. ఈ పక్షములో కూడ స్థాలీపాకము నాడు ఔపాసనారంభమును చేసి మరునాడుదయము కూడ ఔపాసన చేసినచో సాయంప్రాతఃకాలములందు చేసిన రెండు ఔపాసన హోమములు కలిసి యొక ఔపాసన యగును గనుక ఆ సాయంత్రము రెండవ ఔపాసనమును చేసి ఆ అపర రాత్రియందు శేషహోమమును చేసినచో మానవ భారద్వాజ మతములచే వివాహము సిద్ధించును. కాని -

శ్లో॥ ప్రభుః ప్రథమకల్పస్య యోఽను కల్పేన వర్తతే ।
న సాంపరాయికం తస్య దుర్మతేర్విద్యతే ఫలమ్ ॥ మను - 11-30

ముఖ్య పక్షమునకు సమర్థుడగువాడు గౌణ పక్షము నాశ్రయించినచో అట్టి దుర్బుద్ధి గలవానికి పారలౌకిక మగు ఫలము సిద్ధింపదు అని యర్థము. అను వచనముచే సమర్థుడు "బహ్వాల్పం వా స్వగృహ్యోక్తమ్" అను శాస్త్రముచే ఆపస్తంబ సూత్రీయులు త్రిరాత్ర దీక్షను (పంచ రాత్రముగా) చేసియే తీరవలయును.

ఇక్కడ చేయవలసిన శాస్త్రీయ సంస్కరణ ఒక విధముగా చేయవచ్చును. ఎట్లనగా కన్యాదాత ఎంతమందిని భరింపగలడో అంతమంది బంధువులనే వివాహమున కాహ్వానించి వివాహస్థాలీపాకాదుల యందు వరుడు అతని కుటుంబములోని తప్పని సరియైన వారిని మాత్రమే నాలుగు రోజులు ఉంచి వివాహమును యథావిధిగా పూర్తి చేసికొనుట. దానికి కూడ కన్యాదాతకు సామర్థ్యము లేనిచో శాస్త్రములో చెప్పినట్లు ప్రధాన హోమమును మాత్రము కన్యాదాత గృహమందు చేసికొని వెంటనే ఆ యగ్నిని తీసికొని వధువును తన యింటికి తీసికొని వచ్చి మిగిలిన వివాహతంత్రమును పూర్తిచేసికొన వలయును.

లోకాచారమెందులకు కన్యాదాత గృహమందే చేయుట మూలముగా నున్నది? అన్నచో వారికి సామర్థ్యముండుటచేతను, కట్నముల బాధ లేనందునను అట్లు చేసినారని తోచుచున్నది.

కట్నములు లేకుండా వివాహము చేసికొన వలయును. అను సంస్కరణ ప్రస్తుతములో చేసికొన్నచో అది యుత్తమ సంస్కారముగా నుండును. కట్నములకొఱకు కన్యాదాతను పీడించుచు వివాహము సంస్కార లోపము గల దానినిగా జేయుటకంటె పైన చెప్పినట్లు చేయుటయే వివాహములో చేయవలసిన సంస్కారముగా తోచుచున్నది. వివాహమును సంస్కార హీనముగా చేసినచో

శ్లో॥ కువివాహైః క్రియాలోపైః వేదానధ్యయనేన చ ।
కులాన్యకులతాం యాంతి బ్రాహ్మణాతిక్రమేణ చ ॥ 3-63

అని మనుస్మృతిలో జాతి క్షీణించునని చెప్పబడినది. కాబట్టి శాస్త్రవిధి నతిక్రమించి సంస్కరణను చేయుట న్యాయము కాదు. ఇక "ఏకరాత్రం వా" అను మానవ భారద్వాజ గృహ్య సూత్రములలో నున్నను "బహ్వల్పం వా స్వగృహ్యోక్తమ్" అను పూర్వోదాహృతవచనముచే అది ఆశాఖీయుల విషయమే యని తెలిసికొనదగును.

ధర్మప్రదీపమను గ్రంథములో వివాహాగ్నికి పరచర్యాయోగ్యత్వ మెన్ని దివసములలో సిద్ధించునో, అన్ని దివసములే వివాహదివసములని నిర్ణయించిరి.

ఆ విషయమున శౌనకాది వచనములు -

శ్లో॥ యస్మిన్నహ్ని వివాహః స్యాత్సాయమారభ్య తస్య తు ।
పరిచర్యాం వివాహాగ్నేర్విదధీత స్వయం ద్విజః ॥
యది రాత్రౌ వివాహాగ్నిరుత్పన్నస్స్యాత్తథా సతి ।
ఉపక్రమ్యోత్తరస్యాహ్నస్సాయం పరిచరేదముమ్ ॥
రాత్రౌ వివాహ ఉత్పన్నే కథం కుర్వంతి యాజ్ఞికాః ।
రాత్రావతీతకాలశ్చేత్ శ్వస్సాయం తదుపక్రమః ॥

అను వచనముచే ప్రథమ దివసముచేతనే ఔపాసనాధికారమును కలుగజేయునట్టి వివాహము సిద్ధించెనని తెలియబడుచున్నది. ప్రథమ దివసమనగా (వివాహదివసము)

"ఏతదహర్విజానీయాత్ తదహర్భార్యా మావహతే "

అను ఆపస్తంబసూత్రమునకు సుదర్శనాచార్యులు -

యస్మిన్నహ్ని గృహప్రవేశాది స్థాలీపాకాంతం కర్మ కరోతి, తదహరవధిత్వేన జానీయత్" అని వ్యాఖ్యానించిరి.

అనగా ఏ రోజున స్థాలీపాకాంతము కర్మ అనుష్ఠింపబడునో అది ఒక అహస్సు (వివాహ దివసము) అది మొదలు "త్రిరాత్రముభయోరధశ్శయ్యా" ఇత్యాది బ్రహ్మచర్యనియమములు విధింపబడినవి. వివాహదివసమున స్థాలీపాకాంత కర్మ అనుష్ఠింపబడినయెడల అగ్ని పరిచర్యకు యోగ్యత గలుగుననియు, ఈ పరిచర్యకు దంపతులకే అధికార ముండుననియు వివాహ సిద్ధిగానిదే దాంపత్యసిద్ధిగానందున స్థాలీపాకాంతకర్మచేతనే దాంపత్యసిద్ధిని వర్ణించుటచే వివాహములో ప్రధానకర్మ సమాప్తమైనట్లు చెప్పవలెను. ఆ మరుచటి రోజునుండి "త్రిరాత్రముభయోరితి" వచనాను సారము వివాహాంగమైన దీక్ష మూడు రోజులు నూతన వధూవరులకు విధింపబడెను. నాల్గవ రోజున అపరరాత్రి యందు "తం చతుర్థ్యామపరరాత్రే" అను వచనానుసారము శేషహోమముతో దీక్షా విసర్జనము విధింపబడినది. దీనిలో తేలిన సారాంశము -

వివాహములో స్థాలీపాకాంతకర్మ ప్రధానమనియు, త్రిరాత్రదీక్ష, శేషహోమము అంగ భూతమనియు తేలినది. **దీనిని బట్టి వివాహము ఏకదిన సాధ్యమే**. అంగభూతమయిన దీక్షా దివసముల సందర్భమున మహర్షుల వివిధ పక్షములను చెప్పిరి. అశ్వలాయన మహర్షి "అత ఊర్ధ్వం త్రిరాత్ర ద్వాదశ రాత్రం సంవత్సరం వా" అని చెప్పెను.

ఆపస్తంబమహర్షి "త్రిరాత్ర ముభయోరధశ్శయ్యా... ... ... తం చతుర్థ్యామపరరాత్రే" అని దివసత్రయ పక్షమును మాత్రమే విధించెను. మానవ గృహ్య సూత్రమున, భారద్వాజ గృహ్య సూత్రమున

"సంవత్సరం బ్రహ్మచర్యం చరతః ద్వాదశరాత్రం త్రిరాత్రమేకరాత్రం వా" అని ఏకరాత్ర పక్షమును గూడ చెప్పెను. ప్రస్తుత మింత వఱకు మనము ఆపస్తంబ సూత్రానుసారము త్రిరాత్ర దీక్షా పక్షము అవలంబించి శేషహోమమును నాల్గవ రోజున చేయుట సాంప్రదాయము కలిగియున్నాము.

అంగ ప్రధాన కర్మలలో అంగకర్మలకు యథాశక్తి న్యాయమున సంకోచమును నిత్య కర్మల యందు మీమాంసాషష్ఠాధ్యాయముచే అంగీకరించిరి.

ఆ సిద్ధాంతము ననుసరించి అంగ భూతములగు దీక్షా దివసములకు ప్రస్తుత దేశకాల పరిస్థితి ననుసరించియు, గౌణకల్పముగా ఏకరాత్ర దీక్షను స్వీకరించి దినద్వయముతో వివాహమును పూర్తి చేయవచ్చును. ఈ పక్షము నాశ్రయించిన దీక్షకు సంకోచము మాత్రమే చెప్పితిమి గాని పూర్తిగా దీక్షా రూపమైన అంగమునకు లోపము తటస్థించదు. ఇట్లు దీక్షా సంకోచములను వైశ్వదేవ అగ్నిచయనాది కర్మ విశేషములయందు సూత్రకారుల మత భేదముననుసరించి చేయుట శిష్ట సంప్రదాయ సిద్ధమై యున్నది. కాన అదే తీరున వివాహమున గూడ రెండు రోజులుగా సంకోచించ వచ్చునని చెప్పుట శాస్త్ర విరుద్ధము గాదు. శాఖాంతరీయ గృహ్య సూత్రకారులు చెప్పుటచే గౌణ పక్షమని మాత్రము చెప్పవలసి యున్నది. ముఖ్య పక్షము నాశ్రయించి దివస చతుష్టయముచే వివాహమును నిర్వర్తించు వారలను గౌణ పక్షము నాశ్రయించ వలెనని చెప్పుటయందు తాత్పర్యము గాదు. ఒక రోజయినను దీక్షను నిర్వర్తించక వివామమయిన ఉత్తరక్షణమందే శేష హోమాంత కర్మలను పూర్తి చేయు వారలను పై చెప్పిన గౌణ పక్షము నాశ్రయింప వలెనని చెప్పుటయందు తాత్పర్య మని శిష్టులు గ్రహింపనగును.

## సుముహూర్తము

సుముహూర్త మనగా నేమి? జీరకధారణమా? లేక చివర హస్త గ్రహణమా?

**సంస్కారరత్నమాలలో** 547వ పేజీలో మంగల శ్లోకములను వ్రాసి

"తదేవ లగ్నం సుదినం తదేవ - తారాబలం చంద్రబలం తదేవ ।
విద్యాబలం దైవబలం తదేవ - లక్ష్మీపతే తేఽంఘ్రియుగం స్మరామి ॥

ఓం ప్రతిష్ఠః ఇతి జ్యోతిర్విదా పఠితే విప్రాస్సద్యోఽన్త పటముద గపసార్య వధూవరాభ్యాం పరస్పరం సుముహూర్తే నిరీక్షణం కారయేయుః ॥ ఆఆరత " అని వ్రాసిరి

జ్యోతిర్విదులచే "ఓం ప్రతిష్ఠా" అని చెప్పబడిన తర్వాత అంతకుముందు దంపతులిర్వురు చూచుకొనకుండుటకై మధ్యగా ధరించబడిన వస్త్రమును తొలగించి ఉత్తరపు దిక్కునకు తీసివైచిన తర్వాత వధూవరు లొకరినొకరు చూచుకొనవలెను. అదియే **సుముహూర్త** మని యర్థము.

వీరమిత్రోదయసంస్కారకాండలో 825వ పేజీలో

శ్లో॥ స్నాతాలంకృత కన్యాయాః – ప్రాఙ్ముఖ్యాః ప్రత్య గాననః ।
ఈక్షేత తండులస్థాయాః – వరస్తస్య ముఖం చ సా ॥
ముహూర్తే శోభనే సమ్యక్ – క్షిపేతాం ముఖయోర్మిథః ।
సగుడాన్ జీరాకా న్కన్యా – వరయే దధతాం వరః ॥

ఈ మొదలగు ఆశ్వలాయనకారికల నుదాహరించిరి. స్నానమును చేసి అలంకరించబడి నట్టియు, ప్రాఙ్ముఖముగా బియ్యముపై కూర్చుండి యున్నట్టి కన్యయొక్క ముఖమును పశ్చిమముఖముగా కూర్చుని యున్న వరుడు మంచి ముహూర్తమందు చూడవలెను. తర్వాత బెల్లమును జీలకఱ్ఱను కలిపి వానితో కన్య వరుని, వరుడు కన్యను వరించవలయుననియు అర్థము.

"ముహూర్తే శోభనే" అనుటచే ఇదియే ముహూర్తము. "క్షిపేతాం ముఖయోర్మిథః" అనుదానికి ముఖములయందు పరస్పరము దృష్టిని ఉంచవలయునని యర్థము.

ధర్మసింధువులో కన్యాదానవిధి ప్రకరణములో

శ్లో॥ " జ్యోతిర్విదా మంగళపద్యాష్టకపాఠాంతే
స్వోక్తకాలే తదేవ లగ్న" మితి పఠిత్వా
"సుముహూర్తమస్తు, ఓం ప్రతిష్ఠ" ఇత్యుక్తే

అంతః పటముత్తరతోఽపసారయేయుః । తతః కన్యా వరౌ పరస్పరశిరసో రక్షత ప్రక్షేపం పరస్పరేక్షణం చ కుర్యాతామ్"

అని చెప్పబడినది. దీనికి సంస్కారరత్నమాలలో చెప్పిన దానికి వలెనే యర్థము. సంస్కార రత్నమాలలోను, వీరమిత్రోదయములోను వధూవరులు పరస్పరము చూడవలయునని చెప్పబడినది. అది కాత్యాయన మతము.

పారస్కర గృహ్యసూత్రములో "అథైకా సమీక్షయతి" (1–4–16) అని చెప్పబడినది. దాని వ్యాఖ్యానములో తర్కాదులు–

"ఏనౌ–వధూవరౌ, కన్యా పితా సమం జయతి। పరస్పరం సమ్ముఖే కరోతి – సమంజనం చ యువాం పరస్పరం సమంజేథామ్ ఇతి ప్రేషితయోః పరస్పరం సమ్ముఖీ కరణమ్ । సత్యపి కారయితృత్వే వరస్యైవ మంత్రపాఠః । మంత్రలింగాత్" అని వ్రాసిరి.

ఈ వధూవరులతో కన్యాదాత ఒకరినొకరు చూచుకొనుడు అని చెప్పిన తర్వాత ఒకరినొకరు చూచుకొన వలయును; ఇక్కడ కన్య తండ్రికి కారయితృత్వమున్నను మంత్రమును (అఘోరచక్షురపతి

ఘ్న్యేధి అనుదానిని) వరుడే చెప్పవలయును. ఏధి, భవ అను మధ్యమపురుషప్రయోగమున్నది కనుక 'ఏధి' అను దానికి వృద్ధిని పొందు మనియు, 'భవ' అను దానికి కమ్ము అనియు (అర్థము కనుక) అర్థము. ఈ వచనములలో

"ముహూర్తే శోభనే ఈక్షేత । సుముహూర్తమస్తు । ఓం ప్రతిష్ఠ ఇత్యుక్తే పరస్పరేక్షణం చ కుర్యాతామ్ " అని యుండుటను చూచుటయే సుముహూర్తకాలమందు చేయవలసిన క్రియయని తేలుచున్నది.

బొప్పనభట్టు కూడ "తతస్సుముహూర్తే కన్యాం దృష్ట్వా" అని వ్రాసినాడు.

గృహ్యసూత్రవ్యాఖ్యానమున సుదర్శనాచార్యులు బొప్పనభట్టీయమున బొప్పనాచార్యులు "అభ్రాతృఘ్నీమ్" అను మంత్రమును జపించి "అఘోర చక్షుః" అనుమంత్రముచే వరుడు కన్యను అవయవశః చూచుటయే సుముహూర్తమని నిరూపించిరి. జీరకధారణము మాత్రము ఆచారసిద్ధము. కాన జీరకధారణముచేసి పరస్పరము వధూవరులయొక్క నిరీక్షణమే సుముహూర్తమని చెప్పవలసి యున్నది. సుముహూర్తమైన పిమ్మట వధూవరులిద్దఱు అగ్ని సమీపమునకేగి అగ్నికి ప్రత్యగ్భాగమున ఆసీనులు కావలెను. ఆసీనురాలైన వధువును వరుడు "సోమః ప్రథమ" అను రెండు మంత్రములతో నిలబడి అభిమంత్రింపవలెను. పిమ్మట "గృహ్ణామిత" అనునాలుగు మంత్రములతో కుడి హస్తమును వరుడు గ్రహించవలెను. ఇట్లు పాణిని గ్రహించుటచే వివాహమునకు పాణిగ్రహణమనియు పేరు. ఈ పాణి గ్రహణకాలము సూత్రకారులు, బొప్పనాచార్యులు ఏకరీతిగానే చెప్పిరి.

ఈ పూర్వోక్తరీతిననుసరించి యథాకాలమున యథాశాస్త్రీయముగా చేయవలయును.

దేవాలయమున ఏకరాత్రివివాహము అనికొందఱు చెప్పుదురు. అది శాస్త్రములందు అగోచరము, అప్రమాణము, ప్రత్యుత నిషిద్ధము గూడను.

## వివాహమునకు కారణములు

1. కామపరితోషము 2. పారివారికోన్నతివికాసములు 3. సామాజికశ్రేయము 4. ఆత్మసంరక్షణము 5. ఆధ్యాత్మికవికాసము 6. నైతికవికాసము మొ॥నవి.

## వివరణము

### కామపరితోషము

1. కామము ఒక మహత్తరమైన శక్తి.
2. అదియే సృష్టిస్థిత్యాదులకు మూలము.
3. మానవునిలోని సృజనాత్మకశక్తికి ప్రేరకము కామమే.
4. మానవుని సకలవిధమగు భౌతికోన్నతికి మూలము గూడ కామమే.
5. ఇతరములగు మానసికవికారములు/వృత్తులు గూడ కామమూలకములే.

6. శ్రుతులు సృష్టికి మూలము కామమే యని ఘోషించుచున్నవి.
7. లోకముయొక్క ఆర్థికవికాసము/ఉన్నతికి మూలము గూడ భౌతికభోగాసక్తి భోగవాంఛయే.
8. వివిధ వస్తూత్పాదనమునకును మానవీయ సభ్యతా – సంస్కృతుల వికాసమునకును కామమే మూలమని అర్థశాస్త్రజ్ఞుల నిశ్చితాభిప్రాయము.
9. మానవసమాజవికాసమునకు/స్థితికి గూడ మూలము కామమే.
10. మానవుని వివిధకార్యములందు ప్రేరేపించు కార్యశక్తి గూడ కామ స్వరూపమే.
11. కామమను మూలవృత్తియే నశించిన జన్మమే లేదు. ఎట్టి కార్యాచరణము గూడ అవసరము లేదు. అనగా కామము లేకున్న సమస్త కార్యవ్యాపారములు ఎక్కడివక్కడే స్తంబించి ప్రళయము వచ్చును.
12. మానవుని మనస్సుపై కామమునకుగల ప్రాబల్యము అనిర్వచనీయము.
13. ఎంతవారలును కామ ప్రాబల్యమును నిరోధింపజాలరు.
14. అదియొక వరదవంటిది.
15. దాని ప్రాబల్యమువలన సకలేంద్రియములు ఉత్తేజితములగును.
16. మొత్తము శరీరమే కంపించిపోవును.
17. కాని కామమును మానసికవృత్తియని యథేచ్ఛగా విడిచితిమా అది మానవుని ఘోరపతనమునకు దారి తీయును.
18. అట్లే ప్రబలవృత్తిని బలవంతముగ నిరోధించుటవలన గూడ మహానర్థముత్పన్న మగును.
19. మనస్తత్త్వవేత్తలు బలవంతముగా కామమును అణచిపెట్టుటచే మానసికోన్మాదము, మూర్ఛ మొదలగు పెక్కు భయంకరమైన వ్యాధు లుత్పన్నము లగుననియు, మానసిక దౌర్బల్యము (అలసత్వము) ఉత్పన్నమై మానవుడు ఎట్టి కర్మనైనను ఆచరించుశక్తి లేనివాడుగ నైపోవుననియు, దాన మూల వ్యాఘాతము కల్గుననియు వక్కాణింతురు.
20. ఈ విషయమును గ్రహించియే భారతీయ ఋషులు మధ్యేమార్గమును గ్రహించియున్నారు.
21. కామముయొక్క యుచ్ఛృంఖలతను నివారించుటకు వారు దానిని ధర్మసంయుత మొనరించిరి. అనగా కామమును సమూలముగ నాశనము చేయక దానిని ఒక ప్రత్యేకమైన మార్గమున, ఒక నిర్ణీత మైన క్రమము ననుసరించి దాని ప్రసారమును సాగనిచ్చిన అది మానవుని యున్నతికి దారి తీయునని గ్రహించిరి.

22. కావున కామముయొక్క విధ్వంసాత్మకమైన ప్రసారమును ఆపుచేసి, దానిని మంగళమయమైన ఫలోత్పత్తికై ప్రయోగించుట జగదున్నతికి అవసరమని భావించి దానిని పురుషార్థముగ నంగీకరించిరి. వారు కామనిరోధమును లేక స్వచ్ఛంద ప్రసారమును అనుమతింపక మధ్యే మార్గమును అనగా ధర్మ సంయుతమగు కామప్రవృత్తి నంగీకరించి వాస్తవస్థితిని గ్రహించుటతో పాటుగ జగత్తునకు మహోప కారము చేసియున్నారు.

23. ఈ కామమనునది మానవునిలోగల మూలవృత్తులలో ప్రముఖమైనది. ప్రబలమైనది యని మనస్తత్త్వవేత్తల యభిప్రాయము.

24. త్రికాలదర్శులగు మహర్షులు గూడ దీని ప్రాబల్యముతో పాటుగా మానవునియునికికి దాని యావశ్యకతను, దాని యనివార్యత్వమును గ్రహించియున్నారు.

25. కామసూత్రకారుడు "**ఆహారసధర్మాణః కామాః**" అని వాక్రుచ్చియున్నాడు. అనగా శరీరస్థితికి ఆహారమెంత అవసరమో అట్లే కామమును గూడ.

26. కామమన కేవలము మైథునేచ్ఛగాదు. అది కామము యొక్క అంశము మాత్రమే.

27. స్త్రీపురుషగతమైన భోగవాంఛగూడ వివాహమూలకారణములలో ఒకటి యనునది ఎవ్వరును కాదన జాలరు.

28. వివాహ ప్రకరణమున గల ఈ క్రింది మంత్రమును చూచిన అది బోధ పడగలదు.

మం॥ **కోఽదాత్? కస్మై అదాత్? కామోఽదాత్ । కామాయాఽదాత్, కామోదాతా, కామః ప్రతి గ్రహీతా. కామైతత్తే॥ ఇతి వరః పఠేత్।**

అనగా ఇక్కడ కన్యాదానము కామ మూలకమనియు, కన్యా ప్రతిగ్రహణము గూడ కామ మూలకమే యనియు, తత్ప్రయోజనము గూడ కామ పరితోషముకొఱకనుభావము స్పష్టముగ కన్పట్టుచున్నది. కామమే లేకున్న వివాహమను సంస్కారమును చేసికొన నవసరము లేదు. ఇది శాస్త్ర సమ్మతము.

ఇక్కడ గ్రహింపవలసిన సారాంశము – వివాహము కామమూలకమే యైనను, కామ సంవర్ధనము మాత్రము వివాహలక్షణము కాదు.

క ఇదం కస్మై అదాత్, కామః కామాయాదాత్ కామోదాతేత్యాది సమానం –

ఈ స్థలములో గ్రంథకర్తవాడిన కామపదము, వాంఛా సామాన్యపరముగాని స్త్రీభోగవిషయ పరముగ గన్పట్టుట లేదు – గాన ఈ కామపరితోషము వివాహకారణమనుటకు – కామపదమును స్త్రీ వాంఛా పరముగా కొన్నిచోట్ల, కేవల వాంఛా పరముగా కొన్నిచోట్ల వాడినట్లు కనబడుచున్నది –

**పారివారికోన్నతి - పారివారికవికాసములు**

1. మానవుని మూలవృత్తులలో సంతానప్రేమ కూడ గణనీయమైనదని మనస్తత్త్వవేత్తలు వచింతురు.

2. కావుననే కవికుల గురువగు కాళిదాసు "ప్రజాయై గృహమేధినామ్" (రఘు.ప్ర.స.7శ్లో.) అనగా సంతానప్రాప్తికై, గృహస్థాశ్రమమును స్వీకరించు వారలు అని రఘువంశములోని రాజులను ప్రశంసించి యున్నాడు.

3. సంతానప్రాప్తి గృహస్థాశ్రమ ప్రయోజనములలో ప్రముఖమైనది. కావుననే తైత్తిరీయారణ్యక మిట్లు చెప్పుచున్నది :-

మం॥ "**ప్రజననం వై ప్రతిష్ఠా, లోకే సాధు ప్రజాయాస్తంతుం తన్వానః పితౄణామనృణో భవతి, తదేవ తస్యా అనృణం, తస్మాత్ప్రజననం పరమం వదంతి॥** " (తై॥ఆ॥ప్రపాఠక 10 అను - 63)

తాత్పర్యము : గృహస్థాశ్రమ ప్రతిష్ఠకు సంతానము మూలము. పుత్రపౌత్రాది పరంపరను విస్తరింప చేయుటచేతనే మృత పితరుల ఋణము తీరును. అందువలననే **సంతానోత్పత్తియే మోక్ష సాధనములలో పరమోత్కృష్ట** మని వచింతురు.

గృహస్థాశ్రమమునుగూర్చిన ఒక ఆఖ్యాయిక భారతమున నిట్లు కలదు. పూర్వము యాయావర వంశమున జరత్కారువను ఒక ఋషి జన్మించెను. అతడు మహాతపస్వియును, సంశ్రితవ్రతుడును, ధర్మజ్ఞుడును, ఊర్ధ్వరేతస్కుడును, బ్రహ్మచారియునై యుండెను. అతడు దేశయాత్రకు బయలుదేరి ఎక్కడ సాయంకాలమైన అక్కడ వసించుచుండెను. అతడు ఆయాతీర్థములందు తిరుగాడుచు తీవ్ర తపములచేతను వ్రతములచేతను శరీరమును శుష్కింపఁ జేయుచుండెను. అతడు వాయుభక్షియై, నిరాహారియై, ఆయా తీర్థములందు సంచారము చేయుచు నాతడొకచోట ఒకానొకగర్తమున తలక్రిందులుగా వ్రేలాడుచున్న తన పితరులను చూచెను. వారిని చూచి, అతడు వారినిగూర్చియు వారట్లు వ్రేలాడవలసిన దుఃస్థితికి గల కారణములనుగూర్చియు అరయగా వారిట్లు సమాధాన మొసగిరి:-

"మేము తీవ్రవ్రతములను సల్పిన యాయావరవంశ మునులము. మా సంతాన పరంపర సమాప్తము కాబోవుచుండుటచే మేము పితృలోకమున మాకు గల స్థానమునుండి భ్రష్టులమై ఈ భూమిపై పడబోవుచున్నాము. మా సంతాన పరంపరలో నిపుడొకడే యున్నాడు. అతనిపేరు జరత్కారువు. కాని అతడు సంతానప్రాప్తికై దారసంగ్రహము చేయక మిక్కిలి మూర్ఖత్వముతో ప్రవర్తించుచున్నాడు. నాయనా! మాదుఃస్థితిపై జాలిగొను నీవెవ్వరవో తెలుపగోరెదము" అని వారు పలుక జరత్కారువు అనువాడను తానెయన నతని పితరులిట్లనిరి-

"నాయనా! నీవు మన వంశపరంపరను నీతో అనుత్పన్నముగానీయక, దారసంగ్రహము చేసి మమ్ముల నుద్ధరింపుము. దీనివలన మేము ఉద్ధరింపబడుటయే గాక నీవుకూడ స్వధర్మమును పాలించిన వాడ వగుదువు. నాయనా! ఇతర ధర్మఫలములమూలముననగాని, పెక్కుకాలము తపోవ్రతాదులను

సల్పుటవలనగాని పుత్రవంతులకు వచ్చు ఉత్తమగతులు సంప్రాప్తములుగావు. కావున నీవు దార సంగ్రహము చేసి సంతానమును గని మమ్ముల నుద్ధరింపుము".

**"యతః స్వయత్నవాంస్తాత సంతానాయ కులస్య నః ।**
**ఆత్మనోఽర్థేఽస్మదర్థే చ ధర్మ ఇత్యేవ వా విభో ॥**
**నహి ధర్మఫలైస్తాత న తపోభిస్సుసంచితైః ।**
**తాం గతిం ప్రాప్నువంతీహ పుత్రిణో యాం వ్రజంతి వై ॥**
**తద్దారగ్రహణే యత్నం సంతత్యాం చ మనః కురు ।**
**పుత్రకాఽస్మన్నియోగాత్త్వమేతన్నః పరమం హితమ్ ॥"**

(భారత-ఆది-శ్లో॥24,25,26 - 13వ అధ్యాయము)

అపుడతడు వారి యాజ్ఞపై వాసుకి చెల్లెలగు జరత్కారువును వివాహమాడి ఆస్తీకమహర్షిని కనెనని భారతగాథ. అందువలననే శ్రుతి యిట్లు చెప్పుచున్నది.

శ్రు॥ **"సోఽయం పితృలోకః పుత్రేణైవ జయ్యో నాన్యేన కర్మణా"**

తాత్పర్యము :- ఈ పితృలోకము పుత్రసంతానప్రాప్తివలననే జయింపదగినది. ఇతరములగు కర్మలవలన వేనివలనను ఇది వశము కాదు.

పై శ్రుతినే భారతములోని జరత్కారువు కథ వివరించుచున్నది. సంతానప్రేమయనునది సర్వప్రాణిసహజము. కాని వంశోన్నతినిగూర్చిన కోరిక మాత్రము కేవలము మానవసమాజమునకు మాత్రమే పరిమితము. వార్ధక్యమున తాను తన జీవితము నిరాపదముగ నడపుటకు సంతానము ఆవశ్యకమను తథ్యము ఎవ్వరును నిరాకరింపజాలరు. ఇది ఐహిక ప్రయోజనము. ఇక చనిపోయిన ప్రేతాత్మలకు నివాపాంజలులు శ్రాద్ధాదుల గావించుట ద్వారా పితరుల సద్గతులకు పుత్రసంతానము తోడ్పడునని శాస్త్రము వాకొనుచున్నది. ఇది పుత్రసంతానము వలన సిద్ధించు పారలౌకిక ప్రయోజనము. శ్రుతి యిట్లు చెప్పుచున్నది-

శ్రు॥ "జాయమానో వై బ్రాహ్మణః త్రిభిర్ ఋణవాన్ జాయతే; బ్రహ్మచర్యేణ ఋషిభ్యః యజ్ఞేన దేవేభ్యః ప్రజయా పితృభ్యః ।"

పై శ్రుతి తాత్పర్యము - బ్రాహ్మణుడు మూడు ఋణములతో పుట్టుచున్నాడు. అవి ఋషి ఋణము, దేవఋణము, పితృఋణము. వేదాధ్యయనమువలన ఋషిఋణము తీరుచున్నది. యజ్ఞము వలన దేవఋణము తీరుచున్నది. సంతానము వలన పితృఋణము తీరుచున్నది.

దీనినిబట్టి పితరుల తరణమునకు సంతానము ఆవశ్యకమని స్పష్టము. వాగ్దేవతావతారుడగు కాళిదాసమహాకవి యిట్లు పై విషయమునే చెప్పియున్నాడు.

శ్లో॥ లోకాంతరఫలం పుణ్యం తపోదానసముద్భవమ్ ।
సంతతిశ్శుద్ధవంశ్యా హి పరత్రేహ చ శర్మణే॥ (రఘువంశము 1-69)

తాత్పర్యము :- తపము, దానము మొదలగు కార్యములవలన కల్గు సుకృతము ఉత్తమ లోకప్రాప్తిని మరణానంతరమున కల్గించును. కాని ఆ సుకృతము ఇహ లోకమునగాక లోకాంతరమున అనుభవింపబడును. కాని ఉత్తమవంశసంజాతమైన సంతతి ఇహలోక పరలోకములయందు సుఖప్రాప్తికి హేతుభూతము.

కావున ఉత్తమసంతతి శుశ్రూషద్వారా ఇహలోకమునందు సుఖముగ జీవయాత్రను సాగించుటకు తోడ్పడుటతోపాటుగ, శ్రాద్ధాదులద్వారా పరలోకసుఖప్రాప్తికి గూడ హేతుభూతమగునను శ్రుతి హృదయమును కాళిదాసు వెల్లడించియున్నారు. కనుకనే చాలమంది మహర్షులు గృహస్థాశ్రమము సంతానప్రాప్తికొఱకే యని వచించియున్నారు. కావున మానవసహజమగు సంతానప్రేమ వంశోన్నతికి సంబంధించిన గాఢమగు కోరిక వివాహమునకు ప్రముఖకారణ మని పేర్కొనుట, శాస్త్రసంగతము, హేతుసంగతము గూడ.

వివాహ ప్రముఖ ప్రయోజనములలో ఆత్మసంరక్షణము గూడ నొకటి. వివాహముద్వారా స్త్రీ పురుషులిర్వురు సంయత జీవనము జరిపించుకొనుటకై బాసచేసికొని కామచారమునుండి తమ యాత్మలను సంరక్షించుకొనుచున్నారు.

కామచారమువలన మానవుడు శారీరకముగా బలహీనుడై పెక్కు భయంకరరోగములచే పీడితుడై తన జీవితమును నరకప్రాయ మొనరించుకొనుచున్నాడు. వివాహమువలన అట్టి దుఃఖస్థితికి తానులోనుగాకుండగ తనయాత్మను సంరక్షించుకొనుచున్నాడు. అంతియకాని ఉత్తమసంతానప్రాప్తివలన వార్ధక్యమునందు దుఃఖభాజనము గాకుండగా తనయాత్మను సంరక్షించుకొనుచున్నాడు.

**సామాజిక శ్రేయము**

గృహస్థుడైన పురుషుడు ఉత్తమసంతానమువలన తన కర్తవ్యనిర్వహణమువలనను, పుణ్యకర్మల నాచరించుటవలనను, మనుష్యయజ్ఞము అనగా అతిథిపూజ మున్నగు వాని వలన సమాజ శ్రేయమునకు తోడ్పడుచున్నాడు. శ్రుతి – దేవతల కర్పించుటకును, బంధుమిత్రాదులకును అతిథులకును ఇడుటకుగాక కేవలము ఆత్మార్థమై అన్నము వండుకొనువాడు, అన్నమును తినువాడు పాపమును తినుచున్నాడు గాని అన్నమును తినుటలేదని చెప్పుచున్నది. అట్లే దేశము సంకటములో నున్నపుడు వీరపురుషులను దేశమున కర్పించుటవలన దేశసంరక్షణమునకు తోడ్పడుచున్నారు.

మం॥“ **మోఘమన్నం విందతే. అప్రచేతాస్సత్యం బ్రవీమి, వధ ఇత్ సతస్య నార్యమణం పుష్యతి నో సఖాయం, కేవఘో భవతి కేవలా దీ ॥**” (ఋ॥ వే॥10)

అదాతారం దూషయతి –

అప్రచేతాః అప్రకృష్ట జ్ఞానః దానే చేతో మనో యస్య న భవతి సః మోఘం వ్యర్థమేవ అన్నం విందతే లభతే। ఇదం సత్యం యథార్థమేవేతి బ్రవీమి। ఋషిరహం వదామి। న కేవలం వ్యర్థం కింతు తస్య పురుషస్య సత్యం వధ ఏవ అన్నం పరామృశతః । అథవా స నిరర్థకో వధ ఏవ యః పురుషః

అర్యమణం (ఉపలక్షణమిదమ్) సర్వాన్ దేవానర్యమాదీన్ న పుష్యతి హవిష్ప్రదానేన న పోషయతి నో నాపి సఖాయం సమానఖ్యానమభ్యాగతమతిథిం మిత్రవర్గం చ న పోషయతి। అత ఏవ కేవల మసాక్షిక మన్నం భుంజానః స కేవలాఘో భవతి। కేవల పాపవాన్ భవతి। అఘమేవ కేవలం తస్య శిష్యతే। నైహికం నాముష్మిక మితి తు। తస్మాద్యథా కథంచిద్దాతవ్యమిత్యర్థః ॥ (అభిప్రాయః)

## ఆధ్యాత్మిక వికాసము

గృహస్థాశ్రమము భారతీయుల దృష్టికోణము ననుసరించి ఆధ్యాత్మికవికాసముకొఱకే యేర్పఱుపబడియున్నది.

ధర్మ, అర్థ, కామములను త్రివిధ పురుషార్థములను పరస్పరావిరుద్ధములుగను, పరస్పర సమన్వితములుగను ఆచరించుటకొఱకే వివాహము చేయబడుచున్నది. ఈ విషయము వివాహము నందు చేయబడు ప్రతిజ్ఞలవలన గూడ స్పష్టముగ విదితమగు చున్నది. వరునిచే ఈ విధముగా ప్రతిజ్ఞ చేయించబడును.

"ధర్మము విషయమున గాని, అర్థము విషయమున గాని, కామము విషయమునగాని నేను ఈ వధువు నతిక్రమింపను."

"ధర్మే చార్థే చ కామే చ నాతి చరితవ్యా।" "నాతి చరామి" ఇతి వరః పఠేత్ ।

అనగా తాను ఈ వధువుతో కలిసియే దైవపితృకార్యాచరణరూపమగు ధర్మమునాచరించును. ద్రవ్యమును ఖర్చుపెట్టునపుడు గూడ ఆమె సమ్మతిని తీసికొనియే ఖర్చుపెట్టును. ఇది కామ విషయమున గూడ ఆమె తోడనే యుండును. గృహస్థు అయినవాడు భార్యా విషయకమయిన కామము తప్ప ఇతర స్త్రీలను కామించరాదు. అట్లు కామించువాడు పరమపాపియని ఋషుల తాత్పర్యము.

కావుననే రామాయణము

"**పరదారాభిమర్శాత్తు నాన్యత్పాపతరం మహత్।**"

పరదారాభిమర్శముకంటె మహత్తరపాపమింకొకటి లేదు. అంతే కాదు శ్రీరామచంద్రుని శీలమునుగూర్చి చెప్పునపుడు

"**న రామః పరదారాన్వా చక్షుర్భ్యామపి పశ్యతి।**" (శ్రీరాముడు పరస్త్రీలను కన్నెత్తియైన చూడడని వాక్రుచ్చియున్నాడు.)

## అర్థకామములు

భారతీయులు గృహస్థాశ్రమమును భోగలాలసతను పెంచుటకును, జీవితమును అర్థకామ ఉపభోగమునకై వినియోగించుటకు విధించియుండలేదు. అర్థలోభమును పోగొట్టుటకు, విషయ సుఖవాంఛను తగ్గించుటకు మాత్రమే విధించియుండిరి. ఇది చాల పవిత్రవిషయముగ తోచును. అర్థసంచయము కూడ కామమూలకమే గదా! కామరాహిత్యమునకు శాస్త్రీయపరిభాషను బట్టి వాసనా

క్షయమునకు కామోపభోగమునే సాధనముగ నంగీకరించుట - వారి దూరదృష్టికిని, మహత్తరమైన అనుభవమునకును ఇది నిదర్శనము.

ఒక ముల్లును తీసివేయుటకు మఱియొకముల్లును, ఒక మాలిన్యమును తొలగించుటకు మఱియొక మలినపదార్థము నుపయోగించినట్లు అర్థలోభనివృత్తికిని, కామవాసనాక్షయమునకును అర్థకామములనే సాధనములుగా నియమించిరి. కేవలము అర్థకామములు అర్థలోభమును పెంచుటకు, కామభోగవవాసనలను పెంపొందించుకొనుటకును మాత్రమే ఉపయోగపడును.

ఎట్లనగా:- మనకు ఆకలియైనదనుకొనుడు, క్షుధాశాంతికై ఆహారసంపాదనమునకు గడంగితిమి. ఆహారము లభించినది. దానిని భుజించగా ఆకలి శాంతించినది. కనుక ఇక మరల మనకు ఆకలికాదు అని లేదుగదా! ఆహారమును నిరంతరము సేవించుటవలన, ఆహారసంబంధమైన కోరికలు చిత్రవిచిత్రములుగా పెరుగుచుండుట అందఱకును అనుభవములోనున్న విషయము. అలవాటయిన తరువాత ఆహారము కేవలము ఆకలి తీరుట వఱకు మాత్రమే పరిమితిప్రయోజనము కానేరదు. దానిని రుచికరముగ నొనర్చుటకై వివిధ వ్యంజన సమ్మిశ్రిత మొనరింతుము. ఇట్లే మనకేదియేని యొక కోరికగల్గిన ఆ కోరిక తీరినపిదప మఱియొక కోరిక యుదయించును. కావుననే కామములకు పరితోషము అనునది శాంతిక్రియకాక, అగ్నిలో ఆజ్యము పోసినయట్లు కామసంవర్ధకమని ఋషులు సెలవిచ్చియున్నారు.

> "న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి ।
> హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే ॥ " మను. 2-94

అందువలన అర్థలోభ, కామ సంవర్ధనములవలన మానవుడు పెక్కు అనర్థములకు గుఱియై శాంతిని గోల్పోయి నరకతుల్యమైన జీవితమును గడుపుచున్నాడు. దీనినుండి విముక్తి పొందవలెననిన కోరికలను తగ్గించుకొనవలెను. లోకములో తక్కువ కోరికలు గలవారలు, యదృచ్ఛాలాభమున పరితోషమందువారలు ఎక్కువ సుఖమును పొందుచున్నట్లు మనము గమనించుచున్నాము. ఉవ్వెత్తుగా జన్మాంతర అభ్యాసమువలన నిరంతరము మనస్సులో నుదయించు కోరికలను అదుపులోపెట్టి, క్రమముగా వానిని తగ్గించుచు పోయి, తుదకు వాసనాక్షయము గావించుటయే ఋషుల తాత్పర్యము. అట్టి వాసనాక్షయముననే మానవుడు మోక్షమను గమ్యమును చేరుకొనగల్గుచున్నాడు. కావున ఈ వాసనాక్షయముకొఱకే అర్థకామములను ఋషులు ధర్మసంయుతములొనరించిరి. ధర్మమార్గమున అర్థకామములను సేవించుచు పోయిన కొంతకాలమునకు సంపూర్ణవాసనాక్షయము జరుగును. కావుననే గృహస్థాశ్రమము నాశ్రయించి, ధర్మమార్గము ద్వారా అర్థకామసేవనము క్రమముగా వాసనాక్షయమునకు దారితీయుచున్నది. ఈ రూపముననే ఇది మోక్షమునకు సాధనమగుచున్నది. ఆధ్యాత్మికోన్నతికి గూడ తోడ్పడుచున్నది.

ఆధ్యాత్మిక వికాసమునకెట్లు తోడ్పడుచున్నది? చూతము. గృహస్థాశ్రమమును స్వీకరించినవాడు తన భార్యతో కలసి యజ్ఞయాగాదిక్రతువులను, దేవతా, అతిథి ఉపాసనమును చేయవలసియున్నది.

క్రతువులు దేవతాసంప్రీణనములై వేదములచే విహితములయిన కర్మలు. అట్టివానిని ఆచరించుట ద్వారా మానవుడు దేవతానుగ్రహమునకు పాత్రుడగుచున్నాడు. అంతేకాదు నిరంతర దైవీభావనచే వ్యావృతమైన అతని మనమున మలినమైన ఆలోచనలు వచ్చుట కవకాశముండదు. కాగా నిరంతర దైవీభావనాసంవలితమైన అతని మనస్సు శుద్ధమై శాంతికి తావలమగును. అట్లే దైవోపాసనము చేయును; దాన అతని యజ్ఞానము నశించును. దానము, వ్రతము, తపము అతిథిపూజ మొదలగు కర్మలవలన అతని మనస్సు ఉదారమగును; భూతదయ పెరుగును. తనకు ఇష్టవస్తుభోగమున ఎట్టి సంతోషము కల్గునో, ఇతరులకు గూడ అట్టి సంతోషమే కల్గును – అను భావనతో పాటుగ **ఇతరజీవుల సంతోషమును తన సంతోషముగ భావించగల్గిన మహత్తరమైన ఔదార్యము గృహస్థాశ్రమమువలననే కలుగుటకు వీలున్నది.**

ఏలనన కేవలము తన సంతోషముకొఱకే లేక తన సుఖముకొఱకే ప్రయత్నము సేయు మానవుడు, గృహస్థాశ్రమమున ప్రవేశించిన తరువాత భార్యాపుత్రాదుల సంతోషమును తన సంతోషముగ భావించి ప్రయత్నించు పరిస్థితి యేర్పడుచున్నది. అట్లే అతిథుల సంతోషముకొఱకు అతిథిసేవనము చేయుట ద్వారా అతని మనస్సు కేవలమతని యాత్మకొఱకే పరిమితము కాక, సమాజములోని యితర జీవుల శ్రేయము నుపలక్షించుట మూలమునను, ఇతరులయందు తన ఆత్మీయతను పెంచుకొనుట మూలమున గూడ వివాహము ఆధ్యాత్మికోన్నతికి తోడ్పడుచున్నది. కావుననే మన పూర్వులు

"ఉదారచరితానాం తు వసుధైక కుటుంబకమ్। " అని సెలవిచ్చి యున్నారు. పరమేశ్వరుని గూడ "విశ్వకుటుంబి" యని స్తుతించుచుండుటకు గూడ మూలమిట్టి భావనయే.

**నైతికవికాసము**

ధర్మమార్గము ననుసరించి యర్థకామసంపాదనమే నైతికవికాసము. ధర్మమార్గమును విడచి అర్థకామములను సేవించు వర్తమానసమాజమెట్టి అనూహ్యమగు దుఃఖములకు, ఘోరపతనమునకును ఎర యగుచున్నదో, మనము చూచుచున్నాము. అంతియకాదు, నైతిక బలమును కోల్పోయిన మానవులు తాము నశించుటతో పాటుగ తమ సమాజము లేక తమ దేశముయొక్క ఘోరపతనమునకు కారణమగుదురు. శీల – చరిత్రములు గల మానవులే వ్యక్తి అభ్యుదయముతో పాటుగ, సమాజోన్నతికి కారణభూతు లగుచున్నారు. ఇది ప్రత్యక్ష విషయము. ఈ విధముగా భారతీయవివాహము మానవుని సర్వతోముఖవికాసమునకు తోడ్పడుచున్నది.

వైదిక ఋషులు ఋణత్రయ అపాకరణము జీవుడు మోక్షము నొందుట కావశ్యకమని వచించి యున్నారు. మనువు ఈ విషయమునే ఈ క్రింది విధముగా చెప్పియున్నాడు.

"అనధీత్య ద్విజో వేదాన్ అనుత్పాద్య తథా సుతాన్ ।
అనిష్ట్వా చైవ యజ్ఞైశ్చ మోక్షమిచ్ఛన్వ్రజత్యధః ॥ మను– 6–37

వేదముల నధ్యయనము చేయక, పుత్రసంతతి గనక; యజ్ఞములను చేయక మోక్షమును కోరువాడు అధఃపతితుడగును.

పై మూటిలో వేదాధ్యయనము, బ్రహ్మచర్యవ్రతమును అవలంబించుట ద్వారా అనుష్ఠింపబడును. ఇక మిగిలిన పుత్రసంతానమును పొందుట, యజ్ఞములనుచేయుట యనునది మాత్రము గృహస్థాశ్రమమునందే యాచరింపదగియున్నవి. భార్యలేనివాడు యజ్ఞములనాచరించుట కనర్హుడని వేదము వాకొనుచున్నది.

శ్రు॥ "అయజ్ఞో వా ఏషయోఽ పత్నీకః."

అట్లే భర్తకు యజ్ఞములో సహకరించు భార్యకే "పత్ని" యని సంస్కృతమున పేరు అని పాణిని కూడ తన సూత్రములందు చెప్పియున్నాడు.

"పత్యుర్నో యజ్ఞసంయోగే" (పా.సూ.)

మనువు స్త్రీలు గృహదీప్తులనియు, అందఱకు సమానారాధ్యలనియు చెప్పుచు ఈ క్రింది విధముగా చెప్పియున్నాడు -

"అపత్యం ధర్మకార్యాణి శుశ్రూషా రతిరుత్తమా ।
దారాధీనస్తథా స్వర్గః పితౄణామాత్మనశ్చ హ ॥ 9-28

ప్రజానార్థం మహాభాగాః పూజార్హా గృహదీప్తయః ।
స్త్రియః శ్రియశ్చ గేహేషు న విశేషోఽస్తి కశ్చన ॥ 9-26

సంతానము, అగ్నిహోత్రాది ధర్మకార్యములు, సేవ, ధర్మానపేతమగు కామపరితోషము, పితరులకు తనకును (ఉత్తమసంతానప్రాప్తి ద్వారా) స్వర్గము మొ॥నవి దారాధీనములు.

సంతానమును కనుటద్వారా మహోపకారమును చేయు స్త్రీలు గృహములు ప్రకాశింపచేయు మహిమోపేతలు. వారు గృహలక్ష్ములు. లక్ష్మికిని స్త్రీలకును భేదము లేదు.

## భారతీయ వివాహవ్యవస్థ

భారతీయులు తమ వివాహవ్యవస్థను కేవలము ఇహలోకప్రయోజనములవఱకు మాత్రమే పరిమితమొనరింపక పరలోకసాధనముగ నెంచుటయే వారి వివాహవ్యవస్థలోని విశేషము. ఈ వివాహమను సంస్కారము జీవునకు మోక్షము కల్గునంతదనుక అనుచ్ఛేద్యమని వారి తాత్పర్యము.

శ్రీమద్రామాయణము ఈ విషయమునిట్లు ప్రతిపాదించుచున్నది.

శ్లో॥ శ్రుతిర్హి శ్రూయతే పుణ్యా బ్రాహ్మణానాం యశస్వినామ్ ।
ఇహలోకే చ పితృభిర్యా స్త్రీ యస్య మహామతే ॥

అద్భిర్దత్తా స్వధర్మేణ ప్రేత్యభావేఽపి తస్య సా ।

యశస్సంపన్నులగు బ్రాహ్మణులవలన ఈ పవిత్రమగు శ్రుతిని వినుచున్నాము. ఈ లోకమున తల్లిదండ్రులచే ఏకన్య స్వధర్మముననుసరించి దానము చేయబడినదో, మరణానంతరము కూడ ఆమెయే యతనికి భార్య.

భారతీయవివాహవ్యవస్థలోని మఱియొక్క విశేషము :- జన్మాంతరమున గూడ దాని యనచ్ఛేదృత్వము. దీనికి కారణము **హిందూధర్మము పునర్జన్మను, ఆధ్యాత్మికశ్రేయమును అంగీకరించుటయే.**

ఇతరదేశములలో వివాహమునుగూర్చిన యభిప్రాయము ఇంత పవిత్రము కాక కేవలము ఇహలోక ప్రయోజనములకే పరిమితమై యుండుటచే కాంట్రాక్టు పద్ధతిపై నడచుచున్నది. ఈ పద్ధతి ననుసరించుటవలన భార్యాభర్తలు తమతమ ప్రయోజనములు తీరిపోగానే విడిపోవుటను, పెక్కు దుః ఖములకు లోనగుటను గూడ మనము చూచుచునే యున్నాము.

భారతీయులు ఇహలోక పరలోక ప్రయోజనమునకును సాధనముగ వివాహము నంగీకరించుట వలననే వధూవరులకు వివాహవిషయమున స్వేచ్ఛకు అనగా కామమునకు ఎక్కువ అవకాశము నీయలేదు. వివాహ మనునది ఉభయలోక సాధనమగుటచే వధూవరుల యోగ్యత, వారిగుణములు, వారివంశము, సమానరూప వయోగుణములు మొదలగు వానిని పరిశీలించిన పిమ్మటగాని వివాహమున కనుమతింపరాదు. అంతేకాక తల్లిదండ్రులు పై విషయములనన్నింటిని విచారించి వివాహములు నెరపవలెనని స్మృతికారులు వాకొనియున్నారు.

అంతేకాని నేటి వివాహములలో వలె, వధూవరులు రైలుబండిలోనో బస్సులలోనో లేక సినిమాలలోనో, క్లాసులలోనో కేవలము కామముచే పరస్పరమాకర్షితులై వివాహములు చేసికొనుట శాస్త్రసమ్మతము కాకపోగా, పెక్కు అనర్థములకు దారితీయుచుండుట మనము గమనించుచున్నాము. కామమూలకములైన వివాహములు తప్పక ఆ కామము తీరుట తోడనే భంగమగుటయు, లేదా తామనుకొనిన విధమున కామము తీరక పోవుటవలన గాని భంగమగుటయు జరుగును.

అంతేగాక, "**సహ ఉభౌ ధర్మం చరావహై**" అనగా మనమిద్దరము కలిసి ధర్మము నాచరించు దము గాక! అని ప్రతిజ్ఞ వధూవరులచే మనయార్ష వివాహమున చేయించబడును. అట్టి ధర్మనిర్వహణము కొఱకైన వివాహములు భగ్నములు కానేరవు. ఆ ధర్మమే ఆ వధూవరులను విడిపోకుండగ కలిపి యుంచును. ఈ లోకముననేగాదు, పరలోకమున గూడ వారి సాహచర్యమనుచ్ఛేద్య మొనరించుచున్నది.

## గృహస్థాశ్రమ ప్రాముఖ్యము

సర్వ ఆశ్రమములలోను గృహస్థాశ్రమమే మిక్కిలి పవిత్రమైనదనియు, గొప్పదనియు ఋషులు అభిప్రాయ పడియున్నారు. కారణములు :-

గృహస్థాశ్రమము సకలాశ్రమములకును మూలము. ఇతరాశ్రమములలో నున్నవారలందఱకును సమాశ్రయమొసగు ఆశ్రమము గూడ నిదియే. కావుననే చాలగొప్పదని వారి అభిప్రాయము.

మనువు :-

"యథా నదీనదాస్సర్వే సముద్రే యాంతి సంస్థితమ్ ।
తథైవాశ్రమిణా స్సర్వే గృహస్థే యాంతి సంస్థితమ్ ॥ 6-90

ఎట్లు నదీనదములన్నియు సముద్రమున సమాశ్రయమును పొంది శాంతినొందునో అటులనే అన్ని యాశ్రమములవారును గృహస్థుని సమాశ్రయమున సమ్యక్ స్థితి నందుచున్నారు.

వాల్మీకి :-

"చతుర్ణామాశ్రమాణాం హి గార్హస్థ్యం శ్రేష్ఠముత్తమమ్ ।
ఆహుర్ధర్మజ్ఞ ధర్మజ్ఞాస్తం కథం త్యక్తుమిచ్ఛసి ॥

నాల్గు ఆశ్రమములలోను గృహస్థాశ్రమము శ్రేష్ఠమైనది, ఉత్తమమైనదని ధర్మజ్ఞులందఱును చెప్పుచున్నారు.

వ్యాసుడు :- " **గృహస్థం హి సదా దేవాః పితరోఽతిథయస్తథా ।
భృత్యాశ్చైవోపజీవంతి తాన్ భరస్వ మహీపతే ॥
ఆశ్రమాంస్తులయ న్సర్వాన్ ధృతానాహుర్మనీషిణః ।
ఏకతశ్చ తయో రాజన్ గృహస్థాశ్రమ ఏకతః ॥
దేవయానేన నాకస్య పృష్ఠమాప్నోతి భారత ।
అత్యాశ్రమానయం సర్వానిత్యాహుర్వేద నిశ్చయాః ॥** శాంతిపర్వము-మహా భారతము

ఓ రాజా! గృహస్థుని ఆశ్రయించియే ఎల్లప్పుడు దేవతలు, పితరులు, అతిథులు, భృత్యులు గూడ జీవించుచున్నారు. కావున వారినందఱను పోషింపుము. విద్వాంసులిట్లు చెప్పుచున్నారు - అన్ని ఆశ్రమములను త్రాసులో నొకవైపు, గృహస్థాశ్రమమును మఱియొకవైపు పెట్టి తూచగా గృహస్థాశ్రమమువైపుననే మొగ్గుచూపెను.

గృహస్థాశ్రమ విహితకర్మల నాచరించిన వారు దేవయానమార్గము ద్వారా స్వర్గలోకమునకు పోవుదురు. కనుక వేదములను చక్కగా నెఱిగిన మహాత్ములు గృహస్థాశ్రమమే యన్ని ఆశ్రమములను అతిక్రమించెనని అనగా అన్నిటికంటె గొప్పదని చెప్పుచున్నారు. వేయేల? శ్రీమద్రామాయణము గృహస్థాశ్రమ వైభవమునే ముక్తకంఠముతో ఘోషించుచున్నది.

వివాహము ఒక పూర్ణభావమునకు ప్రతీకము, స్త్రీ పురుషులిర్వురును వేరువేరుగానున్న అపూర్ణులే. వారిర్వురును వివాహమను పవిత్రసంస్కారముద్వారా ఏకమగుటయే గాక పూర్ణత్వము నొందుచున్నారు.

## బహుభార్యాత్వము

తైత్తిరీయసంహితలో యూపమునకు రశనను (తాడును) చుట్టు ప్రకరణములో "తస్మాదేకో ద్వే జాయే విందతే" (6-6-4) అని చెప్పబడినది. అనగా ఒక పురుషుడు ఇద్దఱు భార్యలను వివాహము చేసికొనవచ్చును అని యర్థము. ఇక్కడ ద్వే (ఇద్దఱు) అనునది ఉపలక్షణము.

కనుకనే ఐతరేయ బ్రాహ్మణములో

"**తస్మాదేకస్య బహ్వ్యో జాయా భవంతి**" అని చెప్పబడినది. ఒకడు చాల మంది భార్యలను చేసికొన వచ్చునని తాత్పర్యము. చేసికొనుటలో హేతువులను స్మృతులలో చెప్పినారు. ఆపస్తంబ ధర్మ సూత్రములలో -

**"ధర్మప్రజాసంపన్నే దారే నాఽన్యాం కుర్వీత ।"** (2-11-12)

ధర్మమునకు, సంతానమునకు అర్హురాలగు భార్య యుండగా ఇంకొక భార్యను వివాహ మాడరాదు - అని యర్థము.

శ్లో॥ **" వంధ్యాఽష్టమేఽధివేత్తవ్యా (వేద్యాబ్దే) దశమే తు మృతప్రజా ।**
**ఏకాదశే స్త్రీజననీ సద్యస్త్వప్రియవాదినీ॥"** అని యున్నది. మనువు - 9-81

రజస్వల అయినది మొదలు 8 సం॥రములవఱకు ప్రసవించని స్త్రీయు, సంతానమును కన్నను సంతానము జీవింపనిచో 10 సం॥రములు దాటిన స్త్రీయు (రజస్వల అయినది మొదలు) అందఱును స్త్రీలనే కన్నచో 11 సం॥రములవఱకు చూడబడిన తర్వాతయు, తనకు వ్యతిరేకముగా పల్కు స్త్రీయును (అప్పటికప్పుడే) విడువదగిన వారు అని యర్థము.

"అధివేదనం-భార్యాంతరపరిగ్రహః" అని సంస్కారమయూఖములోను, మితాక్షరిలోను చెప్ప బడినది. అధివేదన శబ్దమునకు ఇంకొక భార్యను వివాహము చేసికొనుట అని యర్థము.

"సద్యస్త్వప్రియవాదినీ" అనుదానికి

అప్రియవాదో నామ కలౌ యుగే సాక్షాద్వ్యభిచారః । అప్రియాణి భర్తృవిషయే కలౌ యుగే బహూని సంతి । సాక్షాద్వ్యభిచార ఏవాప్రియవాదః । తదా త్యాజ్యా । అన్యథా దోషమాహ గౌతమః -

వ్యభిచారాదృతే పత్నీం యో విప్రస్సంపరిత్యజేత్ ।
భ్రూణహత్యామవాప్నోతి ఋతుకాలవ్యతిక్రమాత్ ॥

అని హేమాద్రి ప్రాయశ్చిత్తకాండ 122వ పేజీలో అర్థము వ్రాయబడినది. కలియుగములో వ్యభిచరించుటయే అప్రియవదనము. కలియుగములో అప్రియవాదములు అన్ని సమయములలోను అందరియందును ఉండును. కాబట్టి అంతమాత్రమున త్యజింప గూడదు. అట్లు త్యజించినచో ఋతు కాలములో భార్యాగమనము చేయకపోయినందున భ్రూణహత్యాదోషము వచ్చునని అర్థము.

ఇవికాక :-

"సురాపీ వ్యాధితా ధూర్తా వంధ్యార్థఘ్న్యప్రియంవదా ।
స్త్రీప్రసూశ్చాధివేత్తవ్యా పురుషద్వేషిణీ తథా ॥ అని యాజ్ఞవల్క్యస్మృతి.

సురాపానము చేయుదానిని, వ్యాధిగలదానిని, ధూర్తురాలిని, ద్రవ్యమును నాశనము చేయుదానిని ఎక్కువగా చెప్పినది సురాపానాది దోషములు లేనిచో కర్మలయందు వ్యవహరించవలయును.

అందులకే ఆపస్తంబమహర్షి చయనప్రకరణములో-

"వనవస్త్వాకృణ్వంతు గాయత్రేణ ఛందసేతి చతుర్భిర్మహిష్యభాం కరోతి బహు భార్యస్యాధ్వర్యు రేకభార్యస్య ।"

ఆప.శ్రౌ.16-4-5 అని చెప్పినారు. పై నాలుగు మంత్రములచే చాలమంది భార్యలుకల

వానికి ప్రథమభార్య ఉభయను అగ్నిధారణపాత్రను చేయవలయును. ఒక భార్యయే కలవానికి అధ్వర్యుడు చేయవలయును అని యర్థము. అగ్ని సంసర్గ కూడ ఇద్దఱు భార్యలు కలవారికే కదా చెప్పబడినది. కనుక పురుషునకు ఏక కాలమునందే బహుభార్యలుండుట శాస్త్రసమ్మతము; నిషిద్ధము కాదు. ఇదిగాక–

శ్లో॥ బహ్వీనామేకపత్నీనామేకా పుత్రవతీ యది ।
సర్వాస్తాస్తేన పుత్రేణ పుత్రవత్య ఇతి శ్రుతిః ॥ 17–11 వసిష్ఠస్మృతి

"బహ్వీనామేకపత్నీనామేకా చేత్పుత్రిణీ భవేత్ ।
సర్వాస్తాస్తేన పుత్రేణ ప్రాహ పుత్రవతీర్మనుః ॥ అని మనువచనము.

ఒకడే భర్తగాగల చాలమంది భార్యలలో ఒకతె పుత్రవంతురాలైనచో మిగిలిన స్త్రీలకు సంతానము లేకపోయినను అందరూ పుత్రవతులే యగుదురని యర్థము. బృహదారణ్యకములో –

శ్లో॥ అథహ యాజ్ఞవల్క్యస్య ద్వే భార్యే బభూవతుర్మైత్రేయీ చ కాత్యాయనీ చ । అని యుపక్రమించి

"మైత్రేయీతిహోవాచ యాజ్ఞవల్క్యః ప్రవ్యజిష్యన్వా అరేఽ హమస్మాత్స్థానాదస్తి హంత తేఽ నయా కాత్యాయన్యాంతరం కరవాణీతి" ॥ అని యున్నది.

యాజ్ఞవల్క్యునకు ఇద్దఱు భార్యలు గలరు. వారిలో ఒకామెపేరు మైత్రేయి; మఱియొకామె పేరు కాత్యాయని. ఇట్లుండ ఒకప్పుడు యాజ్ఞవల్క్యుడు మైత్రేయిని పిలిచి "మైత్రేయీ! నీకు కాత్యాయనికి ఆస్తిని పంచిపెట్టి నేను సంన్యసింపబోవుచున్నాను; కాబట్టి నీకు కాత్యాయనికి విభాగమును చేయు చున్నాను" అని పలికెను – అని యర్థము. దీనిని బట్టి కూడ ఏకకాలమందే పలువురు భార్యలుండుట ధర్మమేయని తేలినది. ఇట్లనేక శ్రుతులున్నవి.

ధర్మశాస్త్రములందు పునర్వివాహ ప్రకరణమని ప్రత్యేకముగనుండెను. అందు –

"ఆద్యాయాం విద్యమానాయాం ద్వితీయాముద్వహేద్యది ।
తథా వైవాహికం కర్మ కుర్యాదావసథేఽ గ్నిమాన్ ।
అరోగాముద్వహేత్కన్యాం ధర్మలోపభయాత్స్వయమ్ ॥"

మొదటి భార్య యుండగా భార్యాంతర స్వీకారమున్న పక్షములోనే అగ్నిద్వయ సంసర్గకు ప్రసక్తి. కనుకనే – "అథ యః గృహస్థః ద్వే భార్యే విందేత కథం తత్ర కుర్యాత్?"

గృహస్థు ఇద్దఱు భార్యలను పొందినట్లయితే అప్పుడేమి చేయవలయునని శాస్త్రకారులు శంకించి–

శ్లో॥ అథాగ్న్యోః గృహ్యయోర్యోగం సపత్నీ భేదజాతయోః ।
సహాధికారసిద్ధ్యర్థమ్ అహం వక్ష్యామి శౌనక ॥

ఇత్యాది వచనములచే భార్యాభేదముతో ఏర్పడిన గృహ్యాగ్నులయొక్క సంబంధమును సహాధికార సిద్ధినిమిత్తము చెప్పగలనని శౌనకుడు పై ప్రకారమును చెప్పెను.

ప్రథమభార్య యుండగా ఆమె పరిత్యజింపదగిన కారణములు కలదైనను, నిస్సంతురాలయినను రతి నిమిత్తము మరొకరిని ఇచ్ఛయించినను భార్యాంతరమును స్వీకరింపవచ్చునని యాజ్ఞవల్క్యస్మృతి యందు –

"రతికామస్య ఉత్పన్నపుత్రస్య వా నష్టభార్యస్య ఆశ్రమాంతరానధికారిణః గృహస్థాశ్రమ ఏవావస్థాతుమభిలషితస్య పరిణయక్రమమాహ" అని. రతికామనగల ఉత్పన్న పుత్రుడైనను భార్య నష్టమైన, ఆశ్రమాంతరమున కనధికారియైన, గృహస్థాశ్రమమందే ఉండుట కభిలషించిన వానికి వివాహ క్రమమును చెప్పుచున్నానని అవతారికను చూపెను. మఱియు –

శ్రు॥ **"యదేకస్మిన్ యూపే ద్వే రశనే పరివ్యయతి, తస్మాదేకో ద్వే జాయే విందతే। యన్నైకాగ్ం రశనాం ద్వయోర్యూపయోః పరివ్యయతి । తస్మాన్నైకా ద్వౌ పతీ విందతే ॥"**

అను శ్రుతి అగ్నిష్టోమప్రకరణమున పశుధర్మములను చెప్పుసందర్భములో ఒకయూపస్తంభము నకు రెండు రశనలు (దర్భలతో పేనినత్రాళ్లు) కట్టవచ్చుగాని ఒకరశనను రెండు యూపములకు కట్టరాదని చెప్పుటకు దృష్టాంతముగ ఒకపురుషుడు ఇద్దరు భార్యలను వివాహము చేసికొనవచ్చును గాని, ఒకస్త్రీ ఇద్దఱు భర్తలను వివాహము చేసికోరాదని చెప్పిరి. ఇట్లే అనేక వచనములుండుటచే పురుషునికి బహుభార్యాత్వము శాస్త్రసమ్మతమని చెప్పవచ్చును.

### రజస్వలానంతర వివాహము

### లేక

### వివాహాత్పూర్వము కన్య రజోవతి అగుచో ఏమి ప్రాయశ్చిత్తము నాచరింపవలెను?

**కన్యామృతుమతీం శుద్ధాం కృత్వా నిష్కృతిమాత్మనః ।**
**శుచిం చ కారయిత్వా తాముద్వహేదానృశంస్యధీః ॥**

**పితా ఋతూన్ స్వపుత్ర్యాస్తు గణయేదాదితస్సుధీః ।**
**దానావధి గృహే యత్నాత్పాలయేచ్చ రజోవతీమ్ ॥**

**దద్యాత్తదృతు సంఖ్యా గా శ్శక్తః కన్యాపితా యది ।**
**దాతవ్యైకాపి నిః స్వేన దానే తస్యా యథావిధి ॥**

**దద్యాద్వా బ్రాహ్మణేష్వన్నమ్ అతి నిస్వ స్సదక్షిణమ్ ।**
**తస్యాతీతర్తుసంఖ్యేషు వరాయ ప్రతిపాదయేత్ ॥**

**ఉపోష్య త్రిదినం కన్యా రాత్రౌ పీత్వా గవాం పయః ।**
**అదృష్టరజసే దద్యాత్ కన్యాయై రత్నభూషణమ్ ॥**

**తాముద్వహన్ వరశ్చాపి కూష్మాండైర్జుహుయాద్ద్విజః ॥**

అను వచనములననుసరించి వివాహాత్పూర్వము కన్య ఋతుమతియగుచో ఆమెను పరిశుద్ధురాలిగా జేసి ప్రాయశ్చిత్తరూపమైన కర్మను చేయించి వివాహము చేయవలెను. కన్యను

రజోవతియైనది లగాయతు ప్రయత్నపూర్వకముగా కన్యాదానపర్యంతము తండ్రి అప్రమత్తతతో పాలించవలెను. కన్యాదాత సమర్థుడైనయెడల కన్యకు వివాహము నాటికి ఎన్ని ఋతువులు అతిక్రమించెనో లెక్కించి, అన్ని గోవులను దానము చేయవలెను. లేదా అసమర్థుడయినయెడల ఒక్క గోవునైన దానము చేయవలెను. పూర్తిగా నిర్ధనుడైన సదక్షిణాకముగా బ్రాహ్మణునికి భోజనమును పెట్టవలెను.

కన్య మూడు రోజులుపవాసము చేసి, రాత్రి గోపయస్సును పుచ్చుకొనవలెను. దినత్రయానంతరము అదృష్టరజస్కురాలైన కన్యకు రత్నముతో గూడిన అలంకారమును దానము చేయవలెను.

అట్టి కన్యను వివాహము చేసికొనుటకిచ్ఛగించిన వరుడు కూష్మాండహోమములు చేయవలెను. ఎప్పుడు చేయవలెననిన "ఉద్వహన్" అని చెప్పుటచే వివాహాత్ప్రాక్కాలమందు చేయవలెను. లేదా వివాహములో కన్యాదానానంతరము అగ్నిప్రతిష్ఠ అయిన పిమ్మట ప్రధానహోమములకు పూర్వము కూడ చేయవచ్చునని పెద్దల అభిప్రాయము. కారణము సంధ్యాకాలాతిక్రమణ ప్రాయశ్చిత్తము సంధ్యలో అర్ఘ్యప్రదానముతోను, దర్శపూర్ణమాసాది ముఖ్యకాలమతిక్రమించినప్పుడు పథికృద్యాగమును ఆగ్నేయాది ప్రధాన యాగములోను, సోమయాగమునకు ముందుగా చేయదగిన ఐంద్రాగ్న, అశ్విన ప్రాయశ్చిత్త పశువులను సోమయాగాంగమైన అగ్నీషోమీయ పశుయాగముతోను తంత్రముగా చేయుట సంప్రదాయము కలదు. అట్లే ప్రధానహోమముతో ముందుగా చేసినయెడల ప్రత్యేకముగా అగ్ని సంపాదన అవసరము లేకుండుటయు ఒక లాఘవము.

**వివాహమధ్యలో కన్య రజస్వల యగుచో ప్రాయశ్చిత్తము**

వీరమిత్రోదయము – సంస్కారప్రకాశములో 836వ పేజీ

శ్లో॥ **" వివాహే వితతే తంత్రే హోమకాల ఉపస్థితే ।**
**కన్యామృతుమతీం దృష్ట్వా కథం కుర్వంతి యాజ్ఞికాః ॥**
**స్నాపయిత్వా తు తాం కన్యామర్చయిత్వా యథావిధి ।**
**యుంజానామాహుతిం హుత్వా తతః కర్మణి యోజయేత్ ॥**

**యద్వా**

**వివాహహోమే ప్రక్రాంతే యది కన్యా రజస్వలా ।**
**త్రిరాత్రం దంపతీ స్యాతాం పృథక్ శయ్యాసహాశనౌ ॥**
**చతుర్థేஉహని సంస్నాతౌ తస్మిన్నగ్నౌ యథావిధి ।" ఇతి ।**

అని యాజ్ఞపార్శ్వ వచనమును వ్రాసిరి. వివాహము జరుగుచుండగా ప్రధానహోమకాలము వచ్చినపుడు కన్య రజస్వల అయినచో యాజ్ఞికులెట్లు చేయుదురు? ఆ స్త్రీని స్నానము చేయించి అలంకరించి "యుంజానః ప్రథమం మనః" (తై.సం.4–1–1) అను మంత్రముచే హోమమును చేసి కర్మను (మిగిలిన దానిని) చేయవలయును – అని మొదటి రెండు శ్లోకముల కర్థము. ఇది యొక

పక్షము. వివాహప్రధానహోమము ప్రారంభమైన తర్వాత రజస్వల అయినచో అది మొదలు మూడు రోజులు దంపతులుగా వేరుగా పరుండి వేరుగా భోజనము చేయుచు, నాల్గవ రోజున ఇద్దఱు స్నానమును చేసి ఆ యగ్నియందు యథావిధిగా హోమమును ఉపక్రమించి చేయవలయును అని తరువాత సార్ధ శ్లోకమునకు అర్థము. ఇది రెండవపక్షము.

మొదటిపక్షములో వెంటనే కన్యను స్నానము చేయించుట, రెండవ పక్షములో మూడు రోజులు అయిన తర్వాత స్నానమును ఇద్దఱు చేసి మిగిలిన కర్మను చేయించుట భేదము.

సత్యాషాఢ గృహ్యసూత్రములో 91 పేజీలో

"వివాహే వితతే యజ్ఞే హోమకాల ఉపస్థితే ।
కన్యామృతుమతీం దృష్ట్వా కథం కుర్వంతి యాజ్ఞి కాః ॥
యజుః పవిత్రైస్సావిత్ర్యా ప్రోక్షయేత్పూతవారిభిః ।
హిరణ్య చా (ణేత్య) ను వాకేన పవమానస్సు వాదినా ॥
స్నాపయిత్వాఽథ విద్వద్భిరన్య వస్త్రాద్యలంకృతామ్ ।
పూర్ణాహుత్యథ మిందాభ్యాం మహావ్యాహృతిభిస్సహ ॥
హుత్వా తంతుమతీం చైవ వ్యాహృతిభిస్తథైవ చ ।
అనాజ్ఞాతం చ విద్వద్భిః శేషం కార్యం సమాచరేత్ ॥ అనియు
"ప్రధానహోమే నిర్వృత్తే మలవద్వాససీ భవేత్ ।
త్ర్యహే చ పర్యవేతేఽథ శేషం కార్యం సమాపయేత్ ॥"

అనియు రెండు పక్షములు చెప్పబడినవి.

యజుర్వేదములోని పవిత్రమంత్రములతోను, సావిత్రితోను పూతములగు ఉదకములతోను కన్యను ప్రోక్షించి "హిరణ్యవర్ణాః" అను మంత్రముతోను, "పవమానస్సు వర్జనః" అను అనువాకముతోను స్నానమును చేయించి మఱియొక వస్త్రమును ధరించిన తర్వాత పూర్ణాహుతిని,

"యన్మ ఆత్మనో మిందా, పునరగ్నిశ్చక్షురదాత్ ।" అను రెండు మంత్రములతోను

"భూరగ్నయే చ" అను నాలుగు మంత్రములతోను.

హోమములను చేసి తర్వాత తంతుమతీ స్థాలీపాకమును చేసి వ్యాహృతులు మూడు అనాజ్ఞాతత్రయమును హోమమునుచేసి తర్వాత మిగిలిన కర్మను చేయవలెను – అని మొదటి పక్షమున కర్థము.

ప్రధానహోమము పూర్తి అయిన తర్వాత రజస్వల అయినచో మూడురోజులు దూరముగా నుంచి స్నానమును చేసిన తర్వాత మిగిలిన వివాహకర్మను పూర్తి చేయవలయునని రెండవ పక్షమున కర్థము.

బొప్పన భట్టీయములో "కథం కుర్వంతి యాజ్ఞికాః" అను వఱకు వ్రాసి "హవిష్మత్యా స్నాపయిత్వా వాసోఽన్యత్పరిధాస్య చ । యుంజాన ఇతి మంత్రాభ్యాం హుత్వా తంత్రం సమాపయేత్" అని విశేషము చెప్పబడినది.

"హవిష్మతీరిమా ఆపః" (తై.సం. 1-3-12) అను మంత్రముచే స్నానమును చేయించి ఇంకొక వస్త్రమును కట్టించి

"**యుంజానః ప్రథమం మనః యుక్త్వాయ మనసా**" (తై.సం. 4-1-1)

అను రెండు మంత్రములచేత హోమములను చేసి మిగిలిన దానిని పూర్తి చేయవలయునని యర్థము. అక్కడే తర్వాత "వివాహహోమే ప్రక్రాంతే" అను వీరమిత్రోదయములోని సార్ధశ్లోకమును "యథావిధి" అను నంత వఱకు వ్రాసి –

"వివాహహోమం కుర్యాతామిత్యాది స్మృతిసంగ్రహః" అని వ్రాయబడినది.

దీని యర్థము స్పష్టము. వీనిలో ప్రధానహోమమునకు పూర్వమందైతే త్రిరాత్రము కాకుండగా అప్పుడే ప్రాయశ్చిత్తమునుచేసి మిగిలిన కర్మలను చేయుమనియు, ప్రధానహోమము ఆరంభించిన తర్వాతగాని, పూర్తిఅయిన తర్వాతగాని అయినచో మూడు రాత్రుల తర్వాతచేయుమనియు రెండు విధములుగా నున్నది. మూడురాత్రుల తర్వాత చేయుటయే యుక్తమని పెద్దల అభిప్రాయము.

## మరొకరి అభిప్రాయము

"వివాహే వితతే తంత్రే హోమకాల ఉపస్థితే ।
కన్యామృతుమతీం దృష్ట్వా కథం కుర్వంతి యాజ్ఞికాః ॥
హవిష్మత్యా స్నాపయిత్వా వాసోఽన్యత్పరిధాప్య చ ।
యుంజాన ఇతి మంత్రాభ్యాం హుత్వా తంత్రం సమాపయేత్ ॥"

అని నిర్ణయసింధునందు వివరింపబడినది. అనగా వివాహములో సుముహూర్తములగాయతు శేషహోమపర్యంతము వధువు ఎప్పుడు రజస్వల అయినను మూడురాత్రులు బయలనుంచి, పిమ్మట స్నానముచేయించి, నూతనవస్త్రధారణచేయించి, "యుంజానః ప్రథమం" అను రెండు మంత్రములతో చతుష్పాత్ర ప్రయోగపూర్వకముగా హోమముచేసి మిగిలిన వివాహకర్మ మామూలుగా చేయవలెను.

## వివాహకాలము దాటి రజోవతి యగుచో కన్యాదాత చేయవలసిన ప్రాయశ్చిత్తము

అసంస్కృతకన్యారజోదర్శనే ప్రాయశ్చిత్తమాహ దేవలః :-

**పితుర్గృహేతు యా కన్యా రజః పశ్యత్యసంస్కృతా ।**

**సా కన్యా వృషలీజ్ఞేయా తద్భర్తా వృషలీపతిః ॥** అని వ్రాసి "వృషలశ్శూద్రః" అని వ్రాసి మార్కండేయః –

**యా కన్యా పితృవేశ్మస్థా యది పుష్పవతీ భవేత్ ।**
**అసంస్కృతా పరిత్యాజ్యా న పశ్యేత్తాం కదాచన ॥**

**వివాహే చ న యోగ్యా స్యాల్లోకత్రయవిగర్హితా ।**
**ఏతాం పరిణయన్విప్రో న యోగ్యో హవ్యకవ్యయోః ॥**

**స తస్యాం జనయేత్పుత్రం కానీన ఇతి కథ్యతే ।**
**మాతాపితా చ పుత్రశ్చ త్రయస్తే వృషలాః స్మృతాః ॥**

**యదా పుష్పవతీ కన్యా తథైవ త్యక్తుమర్హతి ।**
**న తత్ర దోషస్తస్యాస్తి గేహస్థా చేత్స దోషభాక్ ॥**

గౌతమః –

**యదారహః పుష్పవతీ ద్విజస్తాముద్వహేద్యది ।**
**కాలాంతరే యదా జ్ఞాతా తదా తాం సంపరిత్యజేత్ ॥**

**యదీచ్ఛేదాత్మనశ్శుద్ధిం తదా చాంద్రాయణం చరేత్ ।**
**కామాతురస్తదా వర్తే త్స చండాల సమో భవేత్ ॥**

**పుత్రోత్పత్తిర్యది భవేత్తదా పతిత ఏవ సః ।**

ఈ విధముగావ్రాసిరి. ఏకన్య వివాహము కాకుండగా తండ్రి గృహమందు రజస్వల యగునో అది 'వృషలి' యనబడును. దాని భర్త వృషలీపతి యనబడును. అట్లు రజస్వలయైన కన్యను వదలివైచి దానిని చూడకూడదు. దానికిని వివాహము చేయుట యోగ్యముకాదు. ఆ స్త్రీ ఈ లోకమందు, పరలోకమందు గూడ గర్హింపదగియున్నది. దానిని వివాహమాడిన వాడు యజ్ఞములయందుగాని, రుద్రాభిషేకములు, నవగ్రహాది జపముల యందుగాని అర్త్విజ్యమును చేయుటకును, శ్రాద్ధాదులయందు కర్తగాగాని, భోక్తగాగాని యుండుటకును అర్హుడుగాడు. ఆ స్త్రీయందు సంతానమును కనినచో ఆ సంతానము కానీన శబ్దముతో వ్యవహరింపబడును. ఈ విషయములో రజస్వల అయిన కన్య, దానిభర్త, దాని పుత్రుడు ముగ్గురు కూడ వృషలు లగుదురు. అట్లు రజస్వలయయిన స్త్రీ వెంటనే వదలివేయబడుటకు అర్హత కల్గియున్నది. అట్లు వదలినచో దోషములేదు. ఇంటిలో ఉందుటయే దోషము. ఒకవేళ రజస్వల అయినట్లు చెప్పక రహస్యముగా నుంచినదానిని బ్రాహ్మణుడు వివాహమును చేసికొన్న తర్వాత రూఢిగా తెలిసినచో దానిని వదలివైచి శుద్ధిని కోరి చాంద్రాయణ వ్రతమును చేసికొన్నచో శుద్ధుడగును. అట్లు చేయక దానితో కాపురమును చేయుచు సంతానమును కనినచో ఆ సంతానము పతితమగును. తండ్రి చండాలసముడగును – అని వీని సముదాయార్థము.

వీరమిత్రోదయములోని సంస్కారకాండలో 771వ పేజీలో

"యస్తుతాం వరయేత్కన్యాం బ్రాహ్మణో జ్ఞానదుర్లభః ।
అశ్రాద్ధేయమపాంక్తేయం తం విద్యాద్వృషలీ పతిమ్ ॥"

(రజస్వల అయిన కన్యను ఏ బ్రాహ్మణుడు అజ్ఞానముచే వివాహమును చేసికొనునో అట్టి వృషలీపతియందు ఎవరును గౌరవ ముంచనక్కరలేదు. అతనిని పంక్తిలో నుంచుకొన గూడదు – అని అర్థము.) అని వ్రాసి,

"అత్ర బ్రాహ్మణ పదోపాదానాద్బ్రాహ్మణస్యైవాయం రజస్వలా పరిణయన నిషేధః । న క్షత్రిదీయానామ్ । కుంత్యాదిషు తథా దర్శనాత్ ।" అని వ్రాసినారు. ఈ వచనములలో "బ్రాహ్మణః" అని వ్రాయుటచే ఈ రజస్వలా వివాహదోషము బ్రాహ్మణులకే కాని క్షత్రియ వైశ్యులకు లేదు. భారత భాగవతాదులయందు కుంతి, రుక్మిణి, దమయంతి మొ॥ వారికి రజస్వల అయిన తర్వాతనే వివాహమైనట్లు చెప్పబడినది. ఈ హేమాద్రిలో దోషమే చెప్పబడినది. కాని ప్రాయశ్చిత్తము చెప్పబడలేదు. దానిని నాగేశభట్టు ప్రాయశ్చిత్తేందుశేఖరములోను, ధర్మసింధులోను వ్రాసినట్లు ఇదివరలో వ్రాయబడినది. వానికి ఆర్షవచనము లివ్వలేదు గనుక ఇపుడిచట వ్రాయుట జరుగుచున్నది.

**సంస్కారరత్నమాలలో** (499వ పేజీలో) – తత్ర ప్రాయశ్చిత్తపూర్వకం వివాహమాహ శౌనకః –

"కన్యామృతుమతీం శుద్ధాం కృత్వా నిష్కృతిమాత్మనః ।
తాముద్వహన్వరశ్చాపి కూశ్మాండైర్జుహుయాద్ఘృతమ్ ॥" (చూడుము 46వ పేజి)

అని చెప్పబడినది. వీని యర్థము నాగేశవాక్యముల కర్థములోనే వ్రాయబడినది. '**తాముద్వహన్వరశ్చాపి**' అను చివరిశ్లోకార్థమునకు అర్థమును నాగేశభట్టు అక్కడే ఇట్లు వ్రాసినాడు.

"తాముద్వహన్వరస్తచ్ఛుద్ధ్యై కూశ్మాండ మంత్రైర్ఘృతం జుహుయాత్" అని

అశుద్ధురాలగు కన్యను వివాహము చేసికొనుచు వరుడు దోష నివృత్తి కొఱకు నేతితో కూశ్మాండ హోమములను చేసికొనవలయును అని యర్థము. రజస్వల కాకుండగ వివాహము చేయనందుకు తల్లిదండ్రులు మొ॥ వారికి గోదానములచే శుద్ధియగును. కన్యకు ఆ దోషము పోవుటకు ఉపవాసముల చేతను రత్నాలంకారమును దానము చేయుటచేతను పోవును. ఆ స్త్రీని వివాహము చేసికొన్న వరునకు కూశ్మాండహోమములచే ఆ దోషము పోవును. ఇట్లు ముగ్గురి దోషమును పోగొట్టుకొన్న తర్వాత ఆ ముగ్గురు పవిత్రులయి కర్మార్హులగుదురు. ఇక్కడ కన్యాదాతకు, కన్యకు ఎక్కువ ప్రాయశ్చిత్తము చెప్పి వరునకు వృషలత్వనివృత్తికొఱకు కూశ్మాండహోమములను చిన్న ప్రాయశ్చిత్తమును చెప్పినారేమి? అను శంక కలుగవచ్చును. కాని కూశ్మాండహోమములు కూడ పెద్దప్రాయశ్చిత్తమే.

శ్రుతి:– "కూశ్మాండైర్జుహుయాద్యోఽపూత ఇవ మన్యేత" అని చెప్పి "యదర్వాచీనమేనో భ్రూణహత్యాయాస్తస్మాన్ముచ్యతే" (తై॥ఆర.2–8) అని చెప్పినది. ఎవడు నేను అపవిత్రుడను అని యనుకొనునో వాడును, పంచమహాపాతకములలోని బ్రహ్మహత్యకంటె మిగిలిన విధిని, అంతకంటె తక్కువ పాపములను చేసిన వాడును కూశ్మాండహోమములను చేసిన ఆ పాపములనుండి విముక్తుడగు నని చెప్పిన అర్థము. బ్రహ్మహత్యవలన వచ్చిన పాపము వీనివల్ల పోదు. అయిన బ్రహ్మహత్యే తరములగు

పాపములెన్నిచేసినను ఒకసారి కూశ్మాండహోమములను చేసినచో పోవునుగదా! అని అనుకొనగూడదు.

ఆ శ్రుతిలోనే "యావదేనో దీక్షాముపైతి" అని చెప్పబడినది. పాపప్రమాణమెంతయున్నదో నిశ్చయించుకొని దానినిబట్టి దీక్షను పూనవలయునని యర్థము.

అనగా 1 రోజు, 3 రోజులు, 6 రోజులు, 12 రోజులు, 24 రోజులు, ఒక మాసము, ఒక సం॥రము – ఇన్ని పక్షములని వేదము చెప్పినది. పాపముయొక్క న్యూనతాధిక్యములను నిశ్చయించి దానికి ఎన్ని దినములు దీక్ష పూనిన సరిపోవునో అన్నిదినములు దీక్ష పూని చేయవలయును. దీక్ష యనగా అధశ్శయన బ్రహ్మచర్యములను చేయుచు, గో పయస్సును మాత్రమే పుచ్చుకొనుచు బ్రాహ్మణుడు, క్షత్రియుడు గంజిని, వైశ్యుడు అమిక్షను (వేడిపాలలో పెరుగును పోసి అది విరుగునట్లు చేసిన ఆ విరిగిన దానిని అమిక్షయందురు.) భక్షించుచు రోజునకు ఒకొక్కసారి హోమములను చేయుట. కాబట్టి దీనికి ఒకసారి చేసిన సరిపోవునని శాస్త్రకర్తలు నిశ్చయించిరి. కాబట్టి దీనికి ఒకసారి చాలును. కన్యక తండ్రికి దోషాధిక్య ముండుటచే ఎక్కువ ప్రాయశ్చిత్తమును చెప్పిరి.

**వివాహమున గమనించవలసిన అంశములు 18.**

1. కన్యావరణ
2. కన్యాదానము
3. సుముహూర్తము
4. మధుపర్కప్రాశనము
5. యుగచ్ఛిద్రాభిషేకము
6. మాంగళ్యసూత్రధారణము
7. యోక్త్ర బంధనము
8. తలంబ్రాలు
9. అగ్నిప్రతిష్ఠ
10. పాణిగ్రహణము
11. సప్తపది
12. అగ్నికి ప్రదక్షిణముచేయుచు రాతిని త్రొక్కుట
13. ప్రధానహోమము
14. ప్రవేశహోమము
15. ధ్రువారుంధతీ నక్షత్రదర్శనము
16. ఆగ్నేయాస్థాలీపాకము
17. దీక్షాదివసములు
18. శేష హోమము

వీని వివరములు వాని వాని సందర్భములందు చెప్పబడును.

---

శ్రీరస్తు! శుభమస్తు !! అవిఘ్నమస్తు !!!

మూ॥ అదౌ దంపత్యోః మంగళస్నానం కారయేత్ ।

తా॥ మొదట కన్యాదాతలు మంగళస్నానము చేయవలెను.

మూ॥ పూర్వమేవ వధూం మంగళస్నానం కారయిత్వా ।

తా॥ ముందుగానే పెండ్లికుమార్తెకు మంగళ స్నానము చేయించవలెను.

శుభమగుగాక! అవిఘ్నమగుగాక!

మూ॥ అయం ముహూర్తస్సుముహూర్తోఽస్తు ।

తా॥ ఈ ముహూర్తము మంచి ముహూర్తము అవుగాక.

మూ॥ యశ్శివో నామరూపాభ్యాం... ... సర్వేభ్యో మహాజనేభ్యో నమః... ... ఏవం గుణ ... ... శుభతిథౌ... ... శ్రీమాన్... ... గోత్రః... ... నామధేయః... శ్రీమతః... ... గోత్రస్య... ... నామధేయస్య మమోపాత్త దురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వరప్రీత్యర్థమ్ ఆయుష్యాభివృద్ధ్యర్థం పాణిగ్రహణాఖ్యం కర్మ కరిష్యమాణః తదంగత్వేన తదాదౌ శుద్ధ్యర్థం వృద్ధ్యర్థం శాంత్యర్థమ్ అభ్యుదయార్థం చ మహాజనైస్సహ స్వస్తి పుణ్యాహవాచనం కరిష్యే ॥

తా॥ 'యశ్శివో నామరూపాభ్యాం' మొదలుకొని 'స్వస్తి పుణ్యాహవాచనం కరిష్యే' అనునంతవఱకును చెప్పవలెను.

మహాజనులందఱకు నా నమస్కారములు. ఇట్టి గుణములుగల శుభతిథి యందు శ్రీమంతుడును... గోత్రుడును... పేరుగల వాడును అగు నేను శ్రీమంతుడును... గోత్రముగలవాడును... పేరుగలవాడును అగు నా యొక్క పాపములు పోవుట ద్వారా శ్రీపరమేశ్వరుని ప్రీతికొఱకును, ఆయువు వృద్ధినొందుటకొఱకును వివాహమను కర్మ చేయబోవుచు దానికంగముగా మొదట శుద్ధికొఱకును, వృద్ధికొఱకును, అభ్యుదయముకొఱకును మహాజనులతో గూడ శుభప్రదమైన పుణ్యాహవాచనము చేయుదును.

మూ॥ అదౌ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం శ్రీమహాగణాధిపతిపూజాం కరిష్యే।

తా॥ ముందుగా విఘ్నములు రాకుండగా పూర్తి యగుటకు శ్రీ మహాగణాధిపతి పూజను (మొదట తలపెట్టిన కార్యము ఏ విఘ్నములును లేకుండగా పూర్తియగుటకు (శ్రీ గణాధిపతియొక్క పూజను) చేయుదును.

మూ॥ గణాధిపతిపూజాం పుణ్యాహవాచనం చ కృత్వా।

తా॥ గణాధిపతి పూజను పుణ్యాహవాచనమును చేయవలెను. చేసి,

మూ॥ అంకురారోపణం కుర్యాత్.

తా॥ అంకురారోపణము చేయవలయును.

## అంకురారోపణము

శ్లో॥ కర్తవ్యో విధితోఽఙ్కురార్పణవిధిశ్చౌలాది కర్మాదితో
రాత్రిష్వేవ శరాగ్ని శైలగణనాస్వేతాసు సద్యోఽథవా ।
రిక్తా సర్వవిష ప్రదోషరహితే వారే శుభానాం గృహే
క్షిప్రస్వాతి మృదుధ్రువాసురమఖా విష్ణుత్రయాఖ్యేడుషు ॥

తా॥ గృహ్యసూత్రములందు చెప్పిన ప్రకారము అంకురారోపణమును అన్నప్రాశన, చౌల, ఉపనయన, వివాహ, సీమంత, పుంసవనకర్మలకు పూర్వమందనగా వీటి ముహూర్తదినమునకు 3,5,7, రోజులముందు రాత్రులందుగాని (రాత్రియందే అంకురారోపణ చేయవలయుననుట) సద్యస్కాలమందు గాని చవితి, నవమి, చతుర్దశి- ఈ రిక్తతిథులును, పూర్ణిమ, అమావాస్య, కృష్ణాష్టమి, కృష్ణచతుర్దశి, సంక్రమణము లీ పర్వములను, చవితి, సప్తమి, త్రయోదశి ప్రదోషదినములును, త్యాజ ఘడియలును, నిషేధించి సోమ, బుధ, బృహస్పతి, శుక్రవారము లందును - వృషభ, మిథున, కర్కాటక, కన్య, ధనుర్మీనములైన శుభగ్రహముల యొక్క లగ్నములయందును, అశ్విని, పుష్యమి, హస్త, చిత్త, స్వాతి, రేవతి, మృగశీర్ష, అనూరాధ, రోహిణి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, మూల, మఖ, శ్రవణం, ధనిష్ఠ, శతభిష నక్షత్రము లందును అంకురారోపణము చేయవలయునని తాత్పర్యము.

సూ॥ సర్వేషు మంగళేష్వాదౌ అంకురార్పణమిష్యతే ।
పూర్వం వా త్రిదినే సప్తదివసే పంచమేఽపి వా ॥
పంచాంగశుద్ధిదివసే బీజనక్షత్రసంయుతే ।
సహమంగళఘోషాద్యైర్విప్రపుణ్యాంగనాదిభిః ॥
స్వగ్రామాత్ప్రాగుదగ్వాతు మృత్తికానయనం శుభమ్ ।

అథాఽతోఽఙ్కురార్పణవిధిం వ్యాఖ్యాస్యామో బ్రాహ్మణానన్నేన పరివిష్య పుణ్యాహం స్వస్త్యృద్ధిమితి వాచయిత్వా ।

ఏవం... ప్రీత్యర్థం మమ కుమారస్య (కుమార్యాః) కరిష్య మాణాముక కర్మాంగం బోధాయనోక్త ప్రకారేణ అంకురార్పణం కరిష్యే ।

తా॥ ఇట్లు... ప్రీతికొఱకు నాకుమారునకు (కుమార్తెకు) చేయనున్న ఫలానా కర్మకు అంగముగా బోధాయనఋషి చెప్పిన విధముగా అంకురార్పణము చేసెదను.

(గణపతి పూజాం కృత్వా పుణ్యాహం వాచయిత్వా) - (గణపతిని పూజించి పుణ్యాహమును చెప్పించి)

మూ॥ అంకురారోపణాం గత్వేన బ్రాహ్మణాన్ భోజయిత్వాఽఽ శిషో వాచయిత్వా ॥

తా॥ అంకురార్పణమున కంగముగా బ్రాహ్మణులకు భోజనముపెట్టి వారిచే ఆశీస్సులు చెప్పించుకొన వలెను.

మూ॥ అథ శుద్ధప్రదేశే గోమయేనానులిప్య గంధపుష్పాక్షతైః సంప్రకీర్య ।

తా॥ పిమ్మట శుచియగు ప్రదేశమందు గోమయముతో అలుకవలెను. గంధము, పుష్పములు, అక్షతలును ఆపైన చల్లవలెను.

మూ॥ పంచపాలికాః సౌవర్ణ రజత తామ్ర మృణ్మయైర్వా యథాసంభవం గృహీత్వా ।

తా॥ బంగారముచేగాని, వెండిచేగాని, రాగిచేగాని, మట్టిచేగాని చేయబడిన ఐదు మూకుళ్ళను ముందుగా అంకురారోపణమునకు సంపాదింపవలెను.

మూ॥ శ్లో॥ మధ్యే చతుర్ముఖం వింద్యాత్పూర్వే వజ్రిణమేవ చ ।
దక్షిణే చ యమం వింద్యాత్పశ్చిమే వరుణం తథా ॥
ఉత్తరే శశినం వింద్యాత్పాలికా స్థాపనం క్రమాత్ ।
దూర్వామశ్వత్థపర్ణం చ శిరీషం బిల్వపత్రకమ్ ॥
తాసాం మూలే తు బధ్నీయాచ్ఛ్వేతసూత్రేణ వేష్టయేత్ ॥

తా॥ నడుమ బ్రహ్మపాలికయనియు, తూర్పున ఇంద్రపాలికయనియు, దక్షిణమున యమపాలిక యనియు, పశ్చిమమున వరుణపాలికయనియు, ఉత్తరమున చంద్రపాలికయనియు తెలిసికొని క్రమముగా నుంచవలెను.

గరికపోచ, రావియాకు, దిరిసెనపువ్వు, మారేడాకున్ను ఆపాలికల కడుగుభాగమున తెల్లని దారమును వాటికి చుట్టవలెను.

మామిడాకుంచుట ఆచారము.

మూ॥ శుద్ధప్రదేశే భూమిర్భూమ్నేతి భూమిమభిమంత్ర్య ।

తా॥ శుచి ప్రదేశమందు భూమిర్భూమ్నా అను అనువాకముతో భూమి నభిమంత్రణ చేయవలెను. (మామిడి కొమ్మతో పుట్టమట్టి నభిమంత్రించు టాచారముగానున్నది.)

మం॥ **భూమిర్భూమ్నా ద్యౌర్వరిణా... ... జుష్మాణా వియంతు ॥**

**మావోరిక్షత్ఖనితా... స్త్వనాతురమ్ ॥ అప ఉపస్పృశ్య** = ఉదకమును ముట్టుకోవలెను.

**భూమిర్ధేనురితి మృదమభిమంత్ర్య ।** = ఈమంత్రమునుచెప్పి త్రవ్విన మట్టిని అభిమంత్రించ వలెను.

మం॥ **భూమిర్ధేనుర్ధరణీ లోకధారిణీ ॥ ప్రణవేన పూరయిత్వా** = ఓంఓంఓంఓంఓం అని పూరించవలెను.

మూ॥ ఉద్ధృతాసీతి మృదముద్ధృత్య । = ఈ ముందు మంత్రములచే దోసిటితో మట్టి నెత్తవలెను.

మం॥ **ఉద్ధృతాసి వరాహేణ... ... గతిమ్ । ఓమ్ ॥**

శ్లో॥ **వల్మీకమృత్తికాం చైవ గోమయం చ తథైవ చ ।**
**ఏతాని ప్రక్షిపేత్తాసు పాలికాసు యథాక్రమమ్ ॥**

తా॥ పుట్టమట్టిని, గోమయమునున్ను క్రమముగా ఆ పాలికలయందుంచవలెను.

మూ॥ పాలికాసు కించిత్కించిదుదకం సంప్రోక్ష్య ।

తా॥ పాలికలలో కొంచెము ఉదకము సంప్రోక్షింపవలెను.

శ్లో॥ తిలమాషయవవ్రీహిముద్గసర్షపచణక । కుళుత్థ గోధూమ ప్రియంగు శ్యామాకాది చతుర్దశ ద్వాదశం వా యథాసంభవం గృహీత్వా ॥

తా॥ నువ్వులు, మినుములు, యవలు, ధాన్యము, పెసలు, ఆవాలు, సెనగలు, ఉలవలు, గోధుమలు, కొఱ్ఱలు, చామలు, నివరిధాన్యము మొ॥నవి 14 గాని 12 గాని విధములధాన్యములను లభ్యమైనంతవఱకు అంకురార్పణమునకు సంపాదింపవలెను.

మం॥ **యాజాతా ఓషధయ ఇత్యనువాకేన కాంస్యపాత్రే మిశ్రయిత్వా క్షీరేణ ప్రక్షాళ్య ॥**

తా॥ యా జాతా ఓషధయః = అను అనువాకముతో కంచుపాత్రలోకలిపి పాలతో ప్రక్షాళన చేయవలెను.

మం॥ **యా జాతా ఓషధయో... ... రాజన్పారయామసి ॥ బ్రహ్మ జజ్ఞానం ప్రజాపతే నత్వదేతానితి మధ్యమ పాలికాయామ్ ।**

తా॥ ఈ క్రింది రెండు మంత్రములు ఉచ్చరించి మధ్యనున్న పాలికయందు ఓషధులను చల్లవలెను.

మం॥ **బ్రహ్మజజ్ఞానం... ...పతయోరయీణామ్॥**

మం॥ **యత ఇంద్రభయామహే స్వస్తిదా విశస్పతిరితి ప్రాచ్యామ్ ॥**

తా॥ ఈ రెండు మంత్రములతో తూర్పుపాలికయందు చల్లవలెను.

మం॥ **యత ఇంద్ర భయా -- అభయంకరః ॥**

మూ॥ యమాయ సోమమిమం యమేతి దక్షిణస్యామ్ ॥

ఈ రెండు మంత్రములను జెప్పి దక్షిణపాలికయందు చల్లవలెను.

మం॥ **యమాయ సోమగ్ం... ... హవిషా మాదయస్వ ॥**

మం॥ **ఇమం మే వరుణ... తత్త్వాయామీతి ప్రతీచ్యామ్ ॥**

ఈ రెండు మంత్రములు చెప్పి పడమటి పాలికయందుచల్లవలెను.

మం॥ **ఇమం మే వరుణ... ... ఆయుః ప్రమోషీః ॥**

ప్రక్రియ లేక మం॥ **సోమోధేనుమాప్యాయస్వేత్యుదీచ్యామ్॥**

తా॥ ఈ రెండును చెప్పి ఉత్తరపాలికయందు చల్లవలెను.

మం॥ **సోమో ధేనుగ్ం సోమో... ...భవా వాజస్య సంగథే॥**

మూ॥ శుద్ధాభిస్సికతాభిః ప్రచ్ఛాదయేత్। పంచగవ్యేన జలేన వా ప్రోక్షయేత్ ।

తా॥ పరిశుభ్రమైన ఇసుకతో ఓషధులందు వరుసగా కప్పి పంచగవ్యమును గాని, మంచినీటినిగాని చల్లవలెను. (పంచగవ్యమనగా ఆవుపాలు, పెరుగు, నెయ్యి, పంచితము, పేడ)

మూ॥ మధ్యమపాలికాయాం

తా॥ మధ్యమపాలికలో

మం॥ **ఓం భూః, బ్రహ్మాణమావాహయామి॥**

తా॥ ఓం భూః అని బ్రహ్మను ఆవాహన చేయుచున్నాను.

మం॥ **ఓం భువః, ప్రజాపతిమావాహయామి॥**

తా॥ ఓం భువః అని ప్రజాపతిని ఆవాహనచేయుచున్నాను.

మం॥ **ఓగ్ం సువః హిరణ్యగర్భమావాహయామి॥**

తా॥ ఓగ్ం సువః అని హిరణ్యగర్భుని ఆవాహనచేయుచున్నాను.

మం॥ **ఓం భూర్భువస్సువః, చతుర్ముఖమావాహయామి॥**

తా॥ ఓం భూర్భువస్సువః అని చతుర్ముఖుని ఆవాహన చేయుచున్నాను. ఈ ప్రకార మైదింటియందును ఆవాహన చేయవలెను.

ప్రాచ్యామ్ = తూర్పుదిక్కున

మం॥ **ఓం భూః, వజ్రిణమావాహయామ॥**

తా॥ ఓం భూః అని వజ్రిని ఆవాహన చేయుచున్నాను.

మం॥ **ఓం భువః, ఇంద్రమావాహయామి॥**

తా॥ ఓం భువః, అని ఇంద్రుని ఆవాహన చేయుచున్నాను.

మం॥ **ఓగ్ం సువః, శతక్రతుమావాహయామి॥**

తా॥ ఓగ్ం సువః అని శతక్రతువును ఆవాహన చేయుచున్నాను.

మం॥ **ఓం భూర్భువస్సువః. శచీపతిమావాహయామి॥**

తా॥ ఓం భూర్భువస్సువః అని శచీపతిని ఆవాహన చేయుచున్నాను.

దక్షిణస్యామ్ = దక్షిణపు దిక్కున

మం॥ **ఓం భూః, యమమావాహయామి॥**

తా॥ ఓం భూః అని యముని ఆవాహన చేయుచున్నాను.

మం॥ **ఓం భువః, వైవస్వతమావాహయామి॥**

తా॥ ఓం భువః అని వైవస్వతుని ఆవాహన చేయుచున్నాను.

మం॥ **ఓం సువః. పితృపతిమావాహయామి॥**

తా॥ ఓం సువః అని పితృపతిని ఆవాహన చేయుచున్నాను.

మం॥ **ఓం భూర్భువస్సువః, ధర్మరాజమావాహయామి॥**

తా॥ ఓం భూర్భువస్సువః అని యమధర్మరాజును ఆవాహన చేయుచున్నాను.

ప్రతీచ్యామ్ = పడమటి దిక్కున

మం॥ **ఓం భూః, ప్రచేతసమావాహయామి॥**

తా॥ ఓం భూః అని ప్రచేతసుని ఆవాహన చేయుచున్నాను.

మం॥ **ఓం భువః, వరుణమావాహయామి॥**

తా॥ ఓం భువః అని వరుణుని ఆవాహన చేయుచున్నాను.

మం॥ **ఓగ్ం సువః, అపాంపతి మావాహయామి॥**

తా॥ ఓగ్ం సువః అని అపాంపతిని ఆవాహన చేయుచున్నాను.

మం॥ **ఓం భూర్భువస్సువః, సురూపిణమావాహయామి॥**

తా॥ ఓం భూర్భువస్సువః అని సురూపుని ఆవాహన చేయుచున్నాను.

ఉదీచ్యామ్ = ఉత్తరదిక్కున

మం॥ **ఓం భూః, శశినమావాహయామి॥**

తా॥ ఓం భూః అని శశిని ఆవాహనచేయుచున్నాను.

మం॥ **ఓం భువః, నిశాకరమావాహయామి॥**

తా॥ ఓం భువః అని నిశాకరుని ఆవాహనచేయుచున్నాను.

మం॥ **ఓగ్ం సువః చంద్రమావాహయామి॥**

తా॥ ఓగ్ం సువః అని చంద్రుని ఆవాహనచేయుచున్నాను.

మం॥ **ఓం భూర్భువస్సువః, సోమమావాహయామి॥**

తా॥ ఓం భూర్భువస్సువః అని సోముని ఆవాహన చేయుచున్నాను.

మూ॥ **అథైతాస్వద్భిః అపోహిష్ఠామ ఇతి తిసృభిః హిరణ్యవర్ణా ఇతి చతసృభిః పవమానస్సువర్ణన ఇత్యేతే నానువాకేన చ సంప్రోక్ష్య.**

వాటినెత్తునపుడు వ్యాహృతులను చెప్పుచు నెత్తవలెను.

తా॥ పిమ్మట ఈ పాలికలయందు ఉదకముచేత అపోహిష్ఠామ అను మూడింటిచేతను హిరణ్యవర్ణాః అను నాల్గింటిచేతను పవమానసూక్తముతోను (మార్జనము) చేయవలెను.

మూ॥ సర్వోపచారాన్ కృత్వాఽముష్మై నమోఽముష్మై నమ ఇతి।

తా॥ ఉపచారములన్నిటినిచేసి వీనికి నమస్కారము వీనికి నమస్కారము అని చెప్పవలెను.

మం॥ **అపోహిష్ఠామ ... జనయథాచ నః ॥**

**హిరణ్యవర్ణాః ... బలమోజోనిధత్త ॥**

**పవమనస్సువర్జనః... పునాతు ॥**

**అథ ధ్యానావాహనాది షోడశోపచార పూజాం సమర్పయామి॥**

తా॥ పిమ్మట ధ్యానము, ఆవాహనము మొదలగు 16 ఉపచారముల పూజను సమర్పించుచున్నాను.

మూ॥ బ్రహ్మాది పంచపాలికాధిష్ఠానదేవతాభ్యో నమః।

తా॥ పై వాక్యము అని షోడశోపచారపూజలను చేయవలెను.

మూ॥ బ్రహ్మణే నమః – ఇంద్రాయ నమః – యమాయ నమః – వరుణాయ నమః – సోమాయ నమః – సోమాయ నమః ఇతి నమస్కృత్య ।

తా॥ పై మాటలు అని నమస్కరింపవలెను.

మూ॥ వ్యంజనం నివేదయామి ॥

తా॥ ఈ పైమాట అని పాలికలకు బియ్యము, పెసరపప్పు, దుంపకూర, అప్పడములు, వడియములు నివేదన చేయవలెను.

మూ॥ బ్రహ్మాది పంచపాలికాధిష్ఠానదేవతాస్సుప్రీతాస్సుప్రసన్నా వరదా భవంతు – అని అక్షతలు, ఉదకము విడువవలెను.

తా॥ (ఈ పంచపాలికలకు అధిష్ఠానదేవతలయిన బ్రహ్మాదులు సుప్రీతియు, ప్రసన్నతయు, వరములనిచ్చుటయు గల్గియుందురుగాక అని పల్కి అక్షతలు ఉదకమున్ను విడువవలెను.)

మూ॥ బ్రహ్మాది పంచపాలికాధిష్ఠానదేవతాప్రసాదం శిరసా గృహ్ణామి॥

తా॥ అని ఆ పూజాక్షతలను శిరమున ధరించి యీ క్రింది శ్లోకముతో నమస్కారము చేయవలయును.

**శ్లో॥ దిశాంపతీన్నమస్యామి సర్వకామఫలప్రదాన్ ।**
**కుర్వంతు సఫలం కర్మ కుర్వంతు సతతం శుభమ్ ॥**

తా॥ అన్ని కోరికలను సఫలము చేయునట్టి బ్రహ్మాది దేవతలకు నమస్కరించుచున్నాను. నేనిప్పుడు తలపెట్టిన కార్యమును కొనసాగించి యెల్లప్పుడును శుభములను జరిపింతురుగాక!

మూ॥ తాః పాలికాః యావత్కర్మాంతం సురక్షితం కృత్వా తత్తచ్ఛుభకర్మ కాలే సాంకురాః పాలికా వేదికా చతుష్కోణేషు సంస్థాపయేత్॥

తా॥ ఆ పంచపాలికలను దీక్షాంతమువఱకు మార్జన నివేదనాదులు చేయుచు సంరక్షించవలెను. అంకురార్పణకు హేతుభూతమైన శుభము జరుగునప్పుడు మొలచిన పాలికలను ఆయరుగునకు నాల్గు మూలల నాల్గు ఉంచవలెను.

మూ॥ ఏకాం గృహదేవతా సమీపే వ్యాహృతిభిః ఉద్వాసయేత్॥

తా॥ ఒక పాలికను కులదేవతా సన్నిధానమున ఉంచవలెను. (ఐదును అగ్ని సన్నిధానమున నుంచుటాచారముగా నున్నది.)

(గ్రంథవిస్తరభీతిచే నాందీశోభనదేవతాహ్వానము తర్పణము ఇడా వాచనము వ్రాయలేదు. గాన యాజ్ఞికులు ఈ తరువాయిని గుర్తు ఎరుగుదురుగాక.)

సూ॥ ఆసప్తమాత్రప్రజాకామః

తా॥ సంతానమును కోరువాడు తాదలచిన కార్యమునకు ఏడురోజులు ముందును,

సూ॥ ఆపంచమాత్పశుకామః

తా॥ పశువులను కోరువాడు ఐదురోజులు ముందుగను,

సూ॥ ఆత్రిరాత్రాదన్నాద్యకామః

తా॥ మృష్టాన్నమును కోరువాడు మూడురోజులు ముందును

మూ॥ సద్యస్కాల ఆయుష్య కామ ఇత్యాహ భగవాన్ బోధాయనః

తా॥ ఆయువును కోరువాడు ఆ శుభకార్యదినమునను అంకురార్పణము చేయవలయునని బోధాయన భగవానులు చెప్పినారు.

మూ॥ నాందీ శోభన దేవతాహ్వానం కుర్యాత్ ఇడా వాచనం కుర్యాత్ ॥

తా॥ నాందీ శోభన దేవతాహ్వానము ఇడావాచనమున్ను చేయవలయును.

మూ॥ శ్లో॥ దిశాంపతీన్నమస్యామి సర్వకామఫలప్రదాన్ ।
కుర్వంతు సఫలం కర్మ కుర్వంతు సతతం శుభమ్ ॥

తా॥ పూర్వముక్తమ్ । పైవి చదువుచు దిగ్దేవతా నమస్కారములు చేయవలయును.

ఈక్రియాకలాపము వివాహమునకు 7 రోజులు ముందుగాగాని, 5 రోజులు ముందుగాగాని, 3 రోజులు ముందుగాగాని, వివాహదివసమున గౌరీపూజకు ముందుగాగాని చేయవలెను. వివాహానంతరము చేయుట శాస్త్రవిరుద్ధము.

మూ॥ వివాహముహూర్తాత్పూర్వం వరో మంగళ స్నానం కుర్యాత్ । పూర్వమేవ వధూః మంగళస్నానం కుర్యాత్।

తా॥ వివాహముహూర్తమునకు ముందు పెండ్లికొడుకు మంగళస్నానము చేయవలెను. అంతకు ముందుగానే పెండ్లికుమార్తె మంగళస్నానము చేయవలెను.

మూ॥ మమ కుమార్యాః దీర్ఘసౌమంగళ్య సిద్ధ్యర్థం మయా క్రియమాణ కన్యాదానాంగత్వేన గౌరీపూజాం కరిష్యే ।

తా॥ కన్యాదాత భార్యాపుత్రికా సమేతముగా కూర్చుండి నాకుమార్తెకు దీర్ఘసౌమంగళ్యము సిద్ధించుటకు నాచే చేయబడు కన్యాదానమునకు అంగముగా గౌరీపూజను చేయుదును అని సంకల్పించవలెను.

మూ॥ ఆదౌ గణపతిపూజాం కుర్యాత్ । తతః గౌరీపూజాం కుర్యాత్ ।

తా॥ మొదట గణపతిపూజను చేయవలెను. పిమ్మట గౌరీపూజ గావింపవలెను.

మూ॥ వరః ఆచమ్య ప్రాణాయామం కృత్వా దేశకాలసంకీర్తనం కృత్వా పాణిగ్రహణాఖ్యం కర్మ, కరిష్యమాణః తదంగత్త్వేన తదాదౌ శుద్ధ్యర్థం వృద్ధ్యర్థం శాంత్యర్థమభ్యుదయార్థం చ మహాజనైస్సహ స్వస్తిపుణ్యాహవాచనం కరిష్యే॥

తా॥ పెండ్లికొడుకు ఆచమనముచేసి ప్రాణాయామముచేసి దేశకాల సంకీర్తనము చేసి వివాహమను కర్మ చేయబోవుచు దానికంగముగా మొదట శుద్ధికొఱకును, వృద్ధికొఱకును, శాంతికొఱకును అభ్యుదయముకొఱకును మహాజనముతోగూడ శుభప్రదమయిన పుణ్యాహవాచనమును చేయుదును.

మూ॥ ఆదౌ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం శ్రీ మహాగణాధిపతిపూజాం కరిష్యే। గణపతి పూజాం కృత్వా పుణ్యాహం వాచాయిత్వా ।

తా॥ మొదట గణపతి పూజచేసి తరువాత పుణ్యాహము చెప్పించవలెను. దానివలన ఆ పని నిర్విఘ్నముగా ముగియగలదు.

మూ॥ అనుహవమితి శాకునాది మంత్రాన్ వాచయన్

తా॥ అనుహవమ్ అనెడు శాకునాది మంత్రములను చదువవలయును.

మం॥ **అనుహవం పరిహవం పరీవాదం పరిక్షపమ్ । దుస్స్వప్నం దురిదితం తద్ద్విషద్భ్యో దిశామ్యహమ్। అనుహూతం పరిహూతగ్ం శకునేర్యదశాకునమ్ । మృగస్య సృతమక్ష్ణయా తద్ద్విషద్భ్యో దిశామ్యహమ్ । ఆరాత్తే అగ్నిరస్త్వారాత్పరశురస్తు తే॥ నివాతే త్వాఽభివర్షతు స్వస్తి తేఽస్తు వనస్పతే! స్వస్తి మేఽస్తు వనస్పతే! ।**

**నమశ్శకృత్సదే రుద్రాయ నమో రుద్రాయ ॥ శకృత్సదే ।**

**గోష్ఠమసి నమస్తే అస్తు మా మాహిగ్ంసీ స్సిగసి।నసి వజ్రో నమస్తే అస్తు మా మాహిగ్ంసీః॥**

**ఉద్గాతేవ శకునే! సామగాయసి బ్రహ్మపుత్ర ఇవ సవనేషు శగ్ంససి ।**

**స్వస్తి న శ్శకునే అస్తు ప్రతినస్సుమనా భవ॥**

**మంత్రార్థము :-**

అనుహవమ్ = వెనుక పిలుచుటయు ; పరిహవమ్ = అంతట పిలుచుటయు ; పరీవాదమ్ = నిందించుటయు ; పరిక్షపమ్ = దగ్గు తుమ్ము మొదలగునవియు ; దుఃస్వప్నమ్ = దుష్టమైన స్వప్నమును ; దురితమ్ = అయోగ్యమైన రోదనము మొ॥ ఏదుశ్శకునములు కలవో; తత్ = దానిని (జాతావేకవచనం) (వానిని); అహమ్ = నేను; ద్విషద్భ్యః = శుత్రువులకొఱకు; దిశామి = ఇచ్చుచున్నాను; అనుహూతమ్ = వెనుకపిలువబడుటయు; పరి–హూతమ్= అన్ని దిక్కుల నుండి పిలువబడుటయు ; శకునేః = పక్షిసంబంధమగు; యత్ అశాకునమ్ = ఏదుశ్శకునము ; మృగస్య = మృగముయొక్క ; అక్ష్ణయా సృతమ్ = అపసవ్యముగా నడచుటయు మొ॥వి యేవిగలవో, ; తత్ = అది (అవి) ; ద్విషద్భ్యః = శత్రువులకొఱకు ; అహం దిశామి = నేను చేయుచున్నాను.; వనస్పతే = ఓ వృక్షమా! ; తే = నీకు, ఆరాత్ = దూరమందు ; అగ్నిః = అగ్నిదేవుడు ; అస్తు = ఉండుగాక ; తే = నీకు ; ఆరాత్ = దూరమందు ; పరశుః = గొడ్డలి ; అస్తు = ఉండుగాక ; నివాతే = వాయువు లేకుండగా ; త్వా = నిన్ను గురించి ; అభివర్షతు = వర్షము కురియుగాక ; వనస్పతే = ఓ వృక్షమా! ; తే = నీకు ; స్వస్తి = శుభము ; అస్తు = అవుగాక ; వనస్పతే = ఓ వృక్షమా! మే = నా కొఱకు ; స్వస్తి = శుభము; అస్తు = అవుగాక ; శకృత్సదే = గోమయ నివాసుండగు; రుద్రాయ = రుద్రునికొఱకు; నమః = నమస్కారము ( నమో రుద్రాయ పునరుక్తిః), శకృత్ = గోమయమా! ; గోష్ఠమ్ = ఆవులయందున్నదానవు ; అసి = అయితివి; తే = నీ కొఱకు; నమః = నమస్కారము ; అస్తు = అవుగాక; మా = నన్ను; మాహిగ్ంసీః = బాధపెట్టకుము; సిక్ = వస్త్రముల అంచుతో సమానమైన దానవు; అసి = అయితివి ; వజ్రః = వజ్రాయుధము నసి (నాసి) = కావు; తే = నీ కొఱకు; నమః = నమస్కారము ; అస్తు = అగుగాక ; మా = నన్ను; మాహిగ్ంసీః = బాధపెట్టకుము; హే శకునే = ఓ పక్షీ! ; ఉద్గాతా + ఇవ = ఉద్గాతవలెనే; (ఉద్గాత యనగా యజ్ఞమునందు సామవేదతంత్రము నడపువాడు); సామ = సామవేదమును; గాయసి = గానము చేయుచున్నావు; బ్రహ్మపుత్ర ఇవ = బ్రాహ్మణాచ్ఛంసి అను ఋత్విక్కువలెనే; (బ్రాహ్మణాచ్ఛంసి యనగా యజ్ఞమునందు బ్రహ్మకు సహాయము చేయు ఋత్విజుడు) సవనేషు = యజ్ఞములందు ; శంససి (శగ్ంససి) = శంసనము చేయుచున్నావు; నః = మా కొఱకు, స్వస్తి = శుభము; అస్తు = అవుగాక! నః ప్రతి = మమ్ముగూర్చి; త్వమ్ = నీవు, సుమనాః = మంచిమనస్సుగలదానవు, భవ = అగుము.

తాత్పర్యము : శుభకార్యముల గూర్చి పోవుచుండగా ప్రతిబంధకములయిన

1. వెనుకకు, పిలుచుట
2. అన్ని ప్రక్కలనుండి పిలుచుట
3. నింద సంభవించుట
4. దగ్గు, తుమ్ము మొ॥నవి తటస్థించుట
5. చెడు కలగనుట
6. రోదనము వినుట

మొదలగు ఏ దుశ్శకునములు గలవో వాని నన్నిటిని నా శత్రువులకు జెందునట్లు చేయు చున్నాను.

వెనుకనుండి పిలువబడుట, అన్ని దిక్కులనుండి పిలువబడుట, పక్షులు మృగములు – వీనిసంబంధమగు అపసవ్యగమనము మొ॥వానివలన ఏ దుశ్శకునములు సంభవించునో ఆ దుశ్శకునములు నా శత్రువులను జెందుచుండుగాక!

ఓ వృక్షమా! నీవు అగ్నిచే దహింపబడక గొడ్డలిచే నఱుకc బడక (గాలి యుండినచో వృక్షంబునకు భంగము గల్గించునుగాన) గాలి లేని వర్షముచేc బెఱిగి శోభగల్గునట్లు వృద్ధిపొందుము. నీకు నాకును శుభమగుచుండుగాక.

గోమయమందు నివాసుడగు అనగా పవిత్రస్వరూపుడగు రుద్రునికొఱకు నమస్కారము చేసెదను. ఓ గోమయమా! నీవు గోవులయందున్న దానవయితివి. కావున గోవులు నన్ను హింసింపనట్లు నీవును నన్ను హింసింపకుము.

ఓ గోమయమా! వస్త్రముయొక్క అంచువలె మృదువైనదానవైతివి. వజ్రాయుధమువలె తీక్ష్ణమైన దానవు కావు. కాన నీకు నమస్కారము చేసెదను. నన్ను హింసింపకుము.

ఓ పక్షీ! శ్రవణానందముగా నీవు ధ్వనిచేయుట యజ్ఞమునందు ఉద్గాత సామవేదమును గానము చేసినట్టు వలెనే యుండెను.

"బ్రాహ్మణాచ్ఛంసి" యను ఋత్విక్కు యజ్ఞమునందువలె శస్త్రమును శంసనము చేయుచున్నావు. అనగా ప్రశస్తముగా పలుకుచుంటివి. మాయందు ప్రేమగలదానవై మాకు మేలును గలుగజేయు చుండుము.

మూ॥ వివాహాగారమేత్య ।

తా॥ పెండ్లిజరుగు ఇంటిలో ప్రవేశించి.

మం॥ **దేవీం వాచమజనయన్త । దేవాస్తాం విశ్వరూపాః పశవో వదన్తి ।**

**సా నో మన్ద్రేషమూర్జం దుహానా ధేనుర్వాగస్మానుప సుష్టుతైతు॥**

మంత్రార్థము : దేవీమ్ = ప్రకాశించుచున్న ; వాచమ్ = మాధ్యమిక వాక్కును ; దేవాః = మాధ్యమికులు (దేవతలు) ; అజనయంత = జనింప చేయుచున్నారు; తాం = అట్టివాక్కును; విశ్వరూపాః = వ్యక్తవాక్కులు, అవ్యక్తవాక్కులు నగు సర్వరూపములు గల; పశవః = పశువులు; వదంతి = చెప్పుచున్నవి. (పలుకు చున్నవి) ; సా వాక్ = ఆ వాగ్దేవి ; మంద్రా = స్తుతింపదగినది, సంతోషింపజేయునది (వృష్టి ప్రదానముచేత) ; నః = మనకు; ఇషమ్ = అన్నమును; ఊర్జమ్ = పయోఘృతాది రూపమగు రసమునున్ను; దుహానా = పితుకుచున్న (స్రవించుచున్న); ధేనుః = ఆవువంటిదై ; సుష్టుతా = మనచే బాగుగాస్తుతింప బడినదై ; అస్మాన్ = మనలను; ఉప + ఐతు = పొందుగాక; వర్షించుటకు ఉద్యుక్త యగునని భావము.

తా॥ ప్రకాశించుచున్న మాధ్యమిక వాక్కును దేవతలు జనింపచేయుచున్నారు. అట్టి వాక్కును (వ్యక్త, అవ్యక్త వాక్కులుగల) పశువులు పల్కుచున్నవి. ఆ వాగ్దేవి వృష్టిప్రదానముచేత స్తుతింపదగినదై మనకు అన్నమును పయోఘృతాది రసమునున్ను పాలను చేపు ఆవువంటిదై మనచే స్తుతింపబడి మనను అనుగ్రహించు గాక!

ఈ మంత్రముతో సరస్వతీదేవిని ప్రార్థించి

సభాయై నమః (సభకు నమస్కారము) అని పెండ్లి పీటమీద కూర్చుండి పురోహితునకు ఫలప్రదానమీయవలెను.

మూ॥ పాదౌ ప్రక్షాళ్య = కాళ్ళు నీటితో తుడుచుకొని ; ఆచమ్య = ఆచమనముచేసి; ప్రాణానాయమ్య = ప్రాణాయామముచేసి;

మూ॥ ఓం భూః... ... ఏవంగుణ... ... శుభతిథౌ... ... పాణిగ్రహణాఖ్యం కర్మకరిష్యే। పునః ప్రాణానాయమ్య... ... పాణిగ్రహణాంగత్వేన వరాన్ ప్రేషయిష్యే ।

సూ॥ సుహృదస్సమవేతాన్ మంత్రవతో వరాన్ ప్రహిణుయాత్ మదర్థం కన్యాం వృణీధ్వమితి

తా॥ ఓం భూః... ... ఇట్టి గుణములుగల ... శుభతిథియందు... పాణిగ్రహణమను కర్మను చేసెదను. తిరిగి ప్రాణాయామము చేసి.. పాణిగ్రహణమునకు అంగముగా ఉత్తములను పంపించెదను.

మంచిహృదయముగలవారు, కార్యములందు దీక్షగలవారు, వేదవేత్తలయిన వారును, ఉభయపక్షక్షేమమును గోరువారును, ఆలోచించు శక్తిగలవారును అగు ఉత్తములయిన పెండ్లిమాటలాడు బ్రాహ్మణులను కన్య నన్వేషించుటకై పంపవలెను.

నా కొఱకై కన్యను అన్వేషింపుడు అని యుత్తములను పంపి నా కొఱకు కన్యను వెదకుడు అని వరుడనవలెను. అని వారికి దారిబత్తెము నుద్దేశించి యథాశక్తి హిరణ్యమిచ్చుట ఆచారముగ నున్నది. దీనినే **కన్యావరణ**లందురు.

### – కన్యావరణ –

పెండ్లికుమార్తెయొక్క కులము, గోత్రము, వయస్సు, రూపము అను వానిని పరీక్షింపవలయును. వివాహయోగ్యమయిన కన్యను నిర్ణయించుటకు నలుగురికి తక్కువ కాకుండునట్లు ఉత్తమ హృదయము, సౌజన్యము, సామరస్యము, ఆలోచనాశక్తి కలవారలను కన్యాపితృగృహమునకు "సుహృదస్సమవేతాన్మంత్ర వ్రతః" అను సూత్ర ప్రకారము "ప్రసుగ్మంత" అను రెండు మంత్రములతో ప్రార్థించి పంపవలెను. ఇట్లు పంపుటకు కన్యావరణలందురు.

మూ॥ ఇతి చతురో వరాన్ ప్రేషయతి । తా॥ ఈలాగున నలుగురు ఉత్తములను పంపవలెను.

మూ॥ తానాదితో ద్వాభ్యామభిమంత్రయేత ।

తా॥ వారిని మొదటి (ఈక్రింది) రెండు ఋక్కులచేత అభిమంత్రించవలెను. అనగా వారినుద్దేశించుచు చెప్పి వారిపై అక్షతలు చల్లుటాచారము.

మం॥ **ప్రసుగ్మంతా ధియసానస్య సక్షణి వరేభిర్వరాగ్ం అభిషు ప్రసీదత ।**
**అస్మాకమింద్ర ఉభయం జుజోషతి । యత్సౌమ్యస్యాంధసో బుబోధతి ।**
**అనృక్షరా ఋజవస్సన్తు పంథా యేభిస్సఖాయో యంతి నో వరేయమ్ ।**
**సమర్యమా సం భగో నో నినీయాత్సం జాస్పత్యగ్ం సుయమమస్తు దేవాః! ॥**

అ॥ ప్రసుగ్మంతా = విస్తారముగా, బాగుగా నడచునట్టి ; హే సఖాయః = ఓ స్నేహితులారా!; వః = మిమ్ము; ధియసానస్యసక్షణి = ధ్యానానంతరమందే (ధ్యానస్యసమాసక్షణపర); వరేభిః = శ్రేష్ఠములయిన; మార్గైః = మార్గములచేత; వరాన్ = కోరదగినట్టి కన్యయొక్క తండ్రి మొదలగు వారలనుగూర్చి; అభిషు ప్రసీదత = అభిముఖముగా, లెస్సగా (బాగుగా) వెళ్ళుదురు గాక, పయనింతురు గాక. హే సుహృదః = ఓ మిత్రులారా! ఇంద్రః = ఇంద్రుడు లేక పరమైశ్వర్యయుక్తుడగు భగవంతుడు; అస్మాకమ్ ఉభయమ్ (ఉభయోః) = ఆ కన్యకు నాకును; జుజోషతి = కలయికనుగోరుచున్నాడు. అనగా గలుగజేయుచున్నాడు. యత్ = ఎందు వలననగా; సౌమ్యస్య = సోమలతారసరూపమైన అనగా శ్రేష్ఠమైన; అంధసః = అన్నమును; బుబోధతి = తెలిసికొనుచున్నాడు. హే దేవాః! = ఓ దేవతలారా! యేభిః = ఏ మార్గముల చేత; నః సఖాయః = మా యొక్క స్నేహితులు; వరేయమ్ = కోరదగిన కన్యయొక్క తండ్రి మొ॥ వారలనుగూర్చి; యంతి = వెడలుచున్నారో; పంథాః = ఆ మార్గములు; అనృక్షరాః = ముండ్లు, బెడ్డలు మొ॥ కఠినవస్తువులు లేనివియును; ఋజవః = తిన్ననివియును; సంతు = అగుగాక. నః = మా యిద్దఱకు; అర్యమా = అర్యముడగుదేవుడు లేక సర్వవ్యాపకుడగు భగవంతుడు; సం నినీయాత్ = కూర్చుగాక; భగః = భగుడను దేవుడు, లేక సద్గుణ సంపన్నుడగు భగవంతుడు; సంనినీయాత్ = కూర్చుగాక. జాస్పత్యగ్మ్ = దాంపత్యము; సుమయమ్ = యోగ్యసంబంధము గలదిగా; సమ్ అస్తు = బాగుగా అగుగాక.

తా॥ ఓ స్నేహితులారా! ఈ వివాహమునుగూర్చి మీరు మంచి మార్గముగుండా శ్రేష్ఠులగు సుహృదులతో వరింపదగిన కన్యయొక్క తండ్రి మొదలగువారల సమీపమునకు త్వరగా వెళ్ళి కార్యమును సఫలము చేసికొని రావలయునని వరుడు ధ్యానించుచున్నాడు. ఇంద్రుడు మాయిద్దఱకు సంబంధమును కోరుచున్నాడు. మేమిద్దఱము అతనికి సోమరస రూపమయిన అన్నము నిచ్చెదమని అతడెఱుగును. కాన మాకు అతడు సాయము చేయును.

ఓ దేవతలారా! కన్యను సంఘటన చేయుటకు పంపబడు స్నేహితులయొక్క మార్గములు ముండ్లు మొ॥వి లేక తిన్నగ నుండవలయుననియు, అర్యమాది దేవతలు దాంపత్యమును సంఘటన చేయవలయుననియు వరుడు భగవంతుని ప్రార్థించుచున్నాడు.

మూ॥ తే కన్యాదాతారం గత్వా బ్రువతే ।

తా॥ వారు కన్యాదాతల దగ్గరకువెళ్ళి వరుని ప్రవరాదులను పల్కుదురు.

మూ॥ ఓం చతుస్సాగరపర్యంతం గోబ్రాహ్మణేభ్యః శుభం భవతు। కాశ్యప అవత్సార నైధ్రువ త్రయార్షేయ ప్రవరాన్విత కాశ్యపసగోత్రస్య కేశవశర్మణో నప్త్రే కాశ్యపసగోత్రస్య నారాయణశర్మణః పౌత్రాయ. కాశ్యపసగోత్రస్య మాధవ శర్మణః పుత్రాయ, కాశ్యపసగోత్రోద్భవాయ గోవిందశర్మణే వరాయ ధర్మప్రజా సంపత్త్యర్థమ్.

తా॥ నాలుగు సముద్రములవఱకుగల గోవులకు బ్రాహ్మణులకు శుభమగుగాక. (సర్వులకు సుఖము కలుగుగాక.) కాశ్యప, అవత్సార, నైధ్రువ అను ముగ్గురు ఋషులుగల ప్రవరలతో గూడిన కాశ్యప గోత్రముగల కేశవశర్మయొక్క (ప్రపౌత్రుడు) ముని మనుమడు అయినవాడును, కాశ్యపగోత్రముగల నారాయణశర్మకు పౌత్రుడును అనగా కుమారుని కుమారుడును (మనుమడు అయినవాడు) కాశ్యపగోత్రముగల మాధవశర్మకు పుత్రుడును, కాశ్యపగోత్రమున బుట్టిన గోవిందశర్మయను పెండ్లికుమారునకు ధర్మసంపద సంతాన సంపద కలుగుటకై.

మూ॥ చతుస్సాగరపర్యంతం గోబ్రాహ్మణేభ్యః శుభం భవతు । వాసిష్ఠ మైత్రావరుణ కౌండిన్య త్రయార్షేయ ప్రవరాన్విత కౌండిన్యసగోత్రస్య విష్ణుశర్మణో నప్త్రీం, కౌండిన్యసగోత్రస్య మధుసూదనశర్మణః పౌత్రీం, కౌండిన్యసగోత్రస్య త్రివిక్రమశర్మణః పుత్రీం, కౌండిన్యసగోత్రోద్భవాం లక్ష్మీనామ్నీం కన్యామ్॥

తా॥ నాల్గుసముద్రములవఱకు నున్న గోవులకు బ్రాహ్మణులకును శుభము అగుగాక. వాసిష్ఠ, మైత్రావరుణ, కౌండిన్య అను ముప్వురు ఋషులుగల ప్రవరతో గూడిన కౌండిన్యగోత్రముగల విష్ణుశర్మకు (నప్త్రి లేక ప్రపౌత్రి) మునిమనుమరాలును, అట్టి కౌండిన్యగోత్రముగల మధుసూదనశర్మకు (పౌత్రి) మనుమరాలును, అట్టి కౌండిన్య గోత్రముగల త్రివిక్రమశర్మకు పుత్రియును, కౌండిన్యగోత్రమున బుట్టిన లక్ష్మియను పేరుగల కన్యను

మూ॥ వృణీమహే ఇతి బ్రాహ్మణైర్వక్తవ్యమ్ ।

తా॥ వరించుచున్నాము అని బ్రాహ్మణులు చెప్పవలయును.

మూ॥ వృణీధ్వం, తస్మై దాస్యామి ఇతి దాతా ప్రతి బ్రూయాత్ ॥

తా॥ వరింపుడు, అతనికొఱకిచ్చుచున్నాను అని దాత మాఱుపల్క వలయును.

మూ॥ ఏవం త్రిః ।

తా॥ ఇవ్విధముగా ఉభయుల ప్రవరలున్ను ప్రతివచనమున్ను మూడుసార్లు చెప్పవలయును.

మూ॥ కృతార్థా వయమితి వరమావేదయేయుః । (బ్రాహ్మణా ఇతి శేషః) ।

తా॥ మేము కృతార్థులమైతిమి (కన్యను నిశ్చయించి వచ్చితిమి) అని వరునితో ఆ బ్రాహ్మణులు చెప్పవలయును.

మూ॥ వరః పునః ప్రాణానాయమ్య । ధర్మప్రజా సంపత్త్యర్థం స్త్రియముద్వహే ఇతి బ్రూయాత్ ।

తా॥ పెండ్లికుమారుడు తిరిగి సంకల్పముచేసి ధర్మకార్యముల నిమిత్తము సంతానము నిమిత్తమున్ను స్త్రీని పెండ్లాడుచున్నాను అని చెప్పును.

మూ॥ పునః ప్రాణానాయమ్య । ఉద్వాహాంగభూత, ద్వితీయ యజ్ఞోపవీత ధారణం కరిష్యే । యజ్ఞోపవీత దేవతాభ్యో నమః ధ్యానావాహనాది షోడశోపచారపూజాం కుర్యాత్ ।

తా॥ తిరిగి ప్రాణాయామముచేసి (సంకల్పముచేసి, నా వివాహమునకు అంగభూతమైన రెండవ యజ్ఞోపవీతమును ధరించెదను. యజ్ఞోపవీతదేవతలకు నమస్కారము, ధ్యానము, అవాహనము మొ॥ షోడశోపచారముల పూజ చేయవలయును.

మూ॥ యజ్ఞోపవీతాధిష్ఠానదేవతాపూజాం కృత్వా । ఆచమ్య । యజ్ఞోపవీతం... ... తేజః । యజ్ఞోపవీతం ధృత్వా । ఆచమ్య । యజ్ఞోపవీతధారణముహూర్తస్సుముహూర్తోఽ స్తు ॥

(దాతా పత్న్యా సహ వరస్య యజ్ఞోపవీతధారణం కుర్యాత్ । ఏషా క్రియా వృద్ధాచారప్రాప్తా।)

తా॥ యజ్ఞోపవీతాధిష్ఠాన దేవతలకు పూజ చేయవలయును. చేసి, తిరిగి ఆచమనము చేయవలయును. చేసి, యజ్ఞోపవీతం... తేజః॥ అని మంత్రమునుచ్చరించి యజ్ఞోపవీతమును ధరింపవలెను. ధరించి తిరిగి ఆచమనము చేయవలయును. చేసి, యజ్ఞోపవీతధారణ ముహూర్తము సుముహూర్తము అగుగాక అనవలెను. (దాత తన భార్యతో గూడ వరునికి యజ్ఞోపవీతధారణము చేయించవలయును. ఇట్లు చేయు పద్ధతి వృద్ధాచారముగా నున్నది.)

మూ॥ దాతా ప్రాణానాయమ్య... । లక్ష్మీనారాయణ ప్రీత్యర్థం సాలంకృతకన్యాదానమహం కరిష్యే॥

తా॥ దాత ప్రాణాయామముచేసి (తిరిగి సంకల్పముచేసి) లక్ష్మీనారాయణుల ప్రీతికొఱకు అలంకారములు గల్గిన కన్యను దానము చేసెదను.

మూ॥ మహాసంకల్పపఠనం కుర్యాత్ । తా॥ మహా సంకల్పమును పఠించవలెను.

## మహాసంకల్పము

అస్య శ్రీమద్భగవతో మహాపురుషస్య అనంత వీర్యస్య శ్రీమదాదినారాయణస్య అచింత్యా-పరిమితశక్త్యా భ్రియమాణస్య

శ్రీమంతుడు, భగవానుడు, అనంత శక్తిగలవాడు, మహాపురుషుడునగు శ్రీమదాది నారాయణుడు ఊహింపరాని అపరిమిత శక్తితో సర్వమును భరించుచుండగా,

మహాజలౌఘమధ్యే పరిభ్రమమాణానామనేక కోటిబ్రహ్మాండానామేకతమే వ్యక్తా వ్యక్త మహ-దహంకార (అవ్యక్త ప్రకృతి మహదహంకార) పృథివ్యాపస్తేజోవాయురాకాశాద్యావరణై స్సప్తభి రావృతేఽస్మిన్ మహతి బ్రహ్మాండ ఖండ మధ్యే (బ్రహ్మాండకోటి కరండ మండలే) సకలాధిష్ఠా-త్రాద్యాధారశక్తి శ్రీవరాహ దంష్ట్రాంకురమృణా-ళస్య

మహాసముద్రము మధ్యలో చుట్టు తిరుగుచున్న అనేక కోట్ల బ్రహ్మాండములలో నొక్కటియైన వ్యక్తము, అవ్యక్తము, మహత్తు, అహంకారము (అవ్యక్త ప్రకృతి యైన మహత్తు అహంకారమును). భూమి, నీరు, తేజస్సు, గాలి, ఆకాశము మొ॥ ఏడు ఆవరణము లతో ఆవరింపబడిన ఈ గొప్ప బ్రహ్మాండ ఖండము యొక్క మధ్యలో (బ్రహ్మాండమనే మండలాకారమైన బరిణిలో) సర్వమునకు ఆధార మైన ఆధారశక్తియైన ఆదివరాహముయొక్క కోరలనెడు అంకురమునకు తామరతూడు అయిన

జగన్మూలశక్తి కూర్మానంతాద్యైరావత పుండరీక వామన కుముదాంజన పుష్పదంత సార్వభౌమ సుప్రతీకాఖ్యాష్ట దిగ్గజోపరి ప్రతిష్ఠితస్య

జగత్తుయొక్క మూలశక్తి, ఆదికూర్మముగ, ఆది శేషుడు మొదలగువానిపైన ఐరావతము, పుండరీ కము, వామనము, కుముదము, అంజనము, పుష్పదంతము, సార్వభౌమము, సుప్రతీకము అనుపేర్లుగల అష్టదిగ్గజములపైని ప్రతిష్ఠింపబడిన

అతల వితల సుతల తలాతల రసాతల మహా తల పాతాళ సప్త పాతాళానాముపరితలే

అతలము, వితలము, సుతలము, తలాతలము, రసాతలము, మహాతలము, పాతాళము అను సప్త-పాతాళలోకములకు పైభాగ మందున్న;

భూలోక భువర్లోక సువర్లోక జనలోక మహర్లోక తపోలోక సత్యలోకానామధోభాగే

భూలోకము, భువర్లోకము, సువర్లోకము, మహ ర్లోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము అను వానికి క్రింది భాగమున ఉన్న;

చక్రవాళశైలమహావలయమధ్యే వర్తిన్యాం

చక్రవాళమనెడు పర్వతముయొక్క గొప్ప వలయము మధ్యలోనున్న;

మహానాళాయమానఫణిరాజరాజశేషస్య

మహానాళమువలెనున్న సర్పములకు రాజాధిరాజైన ఆదిశేషునియొక్క;

సహస్రఫణామణిమండలమండితే

వేలకొలది పడగలమణులచే అలంకరింపబడిన;

దిగ్దంతి శుండాదండోత్తంభితే

(ఐరావతము, పుండరీకము, వామనము, కుముదము, అంజనము, పుష్పదంతము, సార్వభౌమము, సుప్రతీకము అను) అష్టదిగ్గజముల దండముల వంటి తొండములచే పైకి ఎత్తబడిన;

లోకాలోకాచలవలయితే

లోకాలోక పర్వతములచే చుట్టబడిన;

ఇంద్రాగ్నియమ నిర్ఋతి వరుణవాయు కుబేరే-శానాష్టదిక్పాలకపాలితే

ఇంద్రుడు, అగ్ని, యముడు, నిర్ఋతి, వరుణుడు, వాయువు, కుబేరుడు, ఈశానుడు అను అష్ట-దిక్పాలకులచే పాలింపబడిన;

వలయాకారలవణేక్షు సురాసర్పిర్దధి క్షీర జలార్ణవైర్విరాజితే

వలయాకారముగా నున్న ఉప్పు, చెఱకు, కల్లు, నేయి, పెరుగు, పాలు, నీరు సముద్రములచే ప్రకాశింప చేయబడిన;

జంబూప్లక్ష శాల్మలికుశ క్రౌంచ శాక పుష్కరాఖ్యైస్సప్తభిర్ద్వీపైర్దీపితే

జంబూ, ప్లక్ష, శాల్మలి, కుశ, క్రౌంచ, శాక, పుష్కర అను సప్త ద్వీపములచే ప్రకాశింపచేయబడిన;

అమరావతీ యశోవత్యంభోవతీ రైవతీ సిద్ధవతీ సాధ్యవతీ గాంధర్వవత్యలకావతీ ప్రభృతి పుణ్య-పత్తనైః ప్రకాశితే

అమరావతి, యశోవతి, అంభోవతి, రైవతి, సిద్ధవతి, సాధ్యవతి, గాంధర్వవతి, అలకావతి మొ॥పుణ్య పట్టణములచే ప్రకాశింపచేయబడిన;

మహేంద్ర మలయ సహ్య శక్తిమద్గంధమాదన వింధ్యపారియాత్ర సప్తకులాచలైః

మహేంద్రము, మలయము, సహ్యము, శక్తిమంతము, గంధమాదనము, వింధ్యము, పారియాత్రము అను సప్తకుల పర్వతములతోను;

హిమవదృక్షవన్మేరు మతంగ హిరణ్యశృంగ

హిమవంతము, ఋక్షవంతము, మేరువు,

మాల్యవత్కిష్కింధా ఋశ్యమూక నామక పంచదశ పర్వతైశ్చాధిష్ఠితే

మతంగము, హిరణ్యశృంగము, మాల్యవంతము, కిష్కింధ, ఋశ్యమూకము అను పేర్లుగల 15 మహా పర్వతములచే అధిష్ఠింపబడిన;

మహాసరోరుహాకారే పంచాశత్కోటి విస్తీర్ణ-భూమండలమధ్యే

మహాపద్మము వంటి ఆకారము గల్గిన 50 కోట్ల విస్తారము గల భూమండలము లోపల;

అంగ వంగ కళింగ కాశ్మీర కాంభోజ సౌవీర సౌరాష్ట్ర మహారాష్ట్ర మగధ మాళవ నేపాళ కేరళ చోళ పాంచాల గౌళ మలయాళ సింహాళ ద్రవిళ (ద్రవిడ) ద్రావిళ (ద్రావిడ) కర్ణాట నాట పానాట పాండ్య పుళింద ఆంధ్ర మరాఠ దశార్ణ భోజ కుక్కురు కురు గాంధార విదర్భ, విదేహ బాహ్లిక బర్బర కేకయ కోసల కుంతల కిరాత శూరసేన సేవన టెంకణ కొంకణ మత్స్య మద్ర పార్శ్వ ఘూర్జర యవన, జాలాంధ్ర సాల, చేది, సింధు, ప్రభృతి, వివిధ దేశ భాషా భూపతిభి ర్విచిత్రితే (ఛప్పన్న దేశ విశేష భూమి పాలవిచిత్రితే)

అంగము, వంగము, కళింగము, కాశ్మీరము, కాంభోజము, సౌవీరము, సౌరాష్ట్రము, మహారాష్ట్రము, మాగధము, మాళవము, నేపాళము, కేరళము, చోళము, పాంచాళము, గౌళము, మలయాళము, సింహాళము, ద్రవిళము, (ద్రవిడము), ద్రావిళము (ద్రావిడము), కర్ణాటము, నాటము, పానాటము, పాండ్యము, పుళిందము, ఆంధ్రము, హూణము, దశార్ణము, భోజము, కుక్కురు, కురు, గాంధారము, విదర్భము, విదేహము, బాహ్లీకము, బర్బరము, కేకయము, కోసలము, కుంతలము, కిరాతము, శూరసేనము, సేవనము, టెంకణము, కొంకణము, మత్స్యదేశము, మద్రదేశము, పార్శ్వదేశము, ఘూర్జరదేశము, యవన దేశము, జాలాంధ్రదేశము, సాలము, చేది, సింధు మొదలగు వివిధములైన దేశవిశేషముల పాలించు రాజులచే (ఛప్పన్న అను పేరుగల దేశవిశేషములచే రాజులచే) విచిత్రముగా చేయబడిన;

గంగా గౌతమీ (గోదావరీ) భీమరథీ (భీమనదీ) తుంగభద్రా కావేరీ చంద్రభాగా పంపా నర్మదా యమునా సరస్వతీ కృష్ణవేణీ బాహుదా కుముద్వతీ చర్మణ్వతీ రేణుకా మలాపహారిణీ

గంగ, గౌతమి(గోదావరి), భీమరధి (భీమనది), తుంగభద్ర, కావేరి, చంద్రభాగ, పంప, నర్మద, యమున, సరస్వతి, కృష్ణవేణి, బాహుద, కుముద్వతి, చర్మణ్వతి, రేణుక మలాపహారిణి;

కృతమాలా తామ్రపర్ణీ, విశోకా, కేశకీ గండకీ విచిత్రకా వసిష్ఠా ప్రవరా కాశ్యపీ సరయూ సర్వపాపహా కృశావతీ ఫల్గునీ కరతోయా పుణ్యతా ప్రణీతా వంజులాది పుణ్యమహానదీభిః పవిత్రితే

కృతమలా, తామ్రపర్ణి, విశోక, కేశకి, గండకి, విచిత్రక, వసిష్ఠ, ప్రవర, కాశ్యపి, సరయూ, సర్వపాపహా, కృశావతి, ఫల్గుని, కరతోయ, పుణ్యత, ప్రణీత, వంజుల మొ॥ మహానదులచే పవిత్రముగా చేయబడిన;

అయోధ్యా మధురా మాయా కాశీ కాంచ్య-వంతికాపురీ ద్వారవతీ సామ్యవంతీ కురుక్షేత్ర రామేశ్వరాది మహాముక్తి స్థలయుతే (పత్తనై-ర్విరాజితే)

అయోధ్య, మధుర, మాయ, కాశి, కాంచి, అవంతికా పురి, ద్వారవతి, సామ్యవంతి, కురుక్షేత్ర, రామేశ్వర మొ॥ గొప్ప ముక్తి స్థలములతో గూడిన (పట్టణములచే ప్రకాశింపజేయబడిన);

సగర గుల్మల స్వామి పుష్కర త్రయ సహిత శేషాచల శ్రీశైలాది పుణ్యాచలైరధిష్ఠితే

సగరము, గుల్మలము, స్వామిపుష్కరము అను మూడింటితో గూడియున్న శేషాచలము, శ్రీశైలము మొ॥ పుణ్యపర్వతములచే అధిష్ఠింపబడిన;

ఇంద్రద్వీప కశేరు తామ్ర గభస్తి, నాగ సౌమ్య గంధర్వ చారణ భారతాఖ్య నవవర్షమండితే

ఇంద్రద్వీపము, కశేరువు, తామ్రము, గభస్తి, నాగము, సౌమ్యము, గంధర్వము, చారణము, భారతము అను పేర్లుగల 9 వర్షములచే అలంకరింపబడిన;

నవసహస్రయోజనైర్విస్తారితే

తొమ్మిదివేల యోజనముల విస్తారము గల్గింపబడిన;

భారత కింపురుష ఐలావృత (హరినాభా వృత) కురుభద్రాశ్మక రమణ కమంద హరణ (మందహాస) (జిహ్వాదాఖ్య) కేతుమాలాఖ్య నవఖండమండితే

భారతము, కింపురుషము, ఐలావృతము, (హరి-నాభావృతము) కురుభద్రము, అశ్మకము, రమణము, కమందము, హరణము (హాసము), జిహ్వాదాఖ్యము (జిహ్వాత్ అను పేరుగల) (కేతుమాలాఖ్యము) కేతుమాలము అను పేర్లుగల తొమ్మిది ఖండములచే అలంకరింపబడిన;

దండక చంపక వింధ్య మిశ నైమిశ కదరిక, బదరిక నహుష గుహ దేవధాతుకాద్యేకా దశారణ్యాయతే

దండక, చంపక, వింధ్య, మిశ, నైమిశ, కదరిక, బదరిక, నహుష, గుహ, దేవధాతుక, మొ॥ పదునొకండు అరణ్యములతో దీర్ఘమయిన;

| | |
|---|---|
| లక్షయోజనవిస్తీర్ణజంబూద్వీపే | లక్షయోజనముల విస్తారము గల జంబూ ద్వీపము నందు; |
| సుమేరు నిషధ హేమకూట హిమాచలానాం హరివర్ష కింపురుష వర్షయోశ్చ దక్షిణే | సుమేరువు, నిషధము, హేమకూటము, హిమా-చలము అను వానికిని హరివర్ష కింపురుష వర్షములకును దక్షిణభాగమున; |
| సేతుబంధ మలయాచలయోరుత్తరే | సేతు బంధమునకును మలయాచలమునకును ఉత్తరభాగమున; |
| సహస్రయోజనవిస్తృతే భరతవర్షే | వేయి యోజనముల విస్తారముగల భరతవర్షము నందు; |
| భరతఖండే | భరతఖండమునందు; |
| ప్రజాపతిక్షేత్రే | ప్రజాపతి క్షేత్రమున; |
| దండకారణ్యే | దండకారణ్యమున; |
| కర్మ భూమౌ | కర్మభూమిలో; |
| అయోధ్యా కాశీ కురుక్షేత్ర గయా ప్రయాగ కాంచీ శ్రీరంగ శ్రీవేంకటాచలాది పుణ్యక్షేత్రైః | అయోధ్య, కాశి, కురుక్షేత్రము, గయ, ప్రయాగ, కాంచి, శ్రీరంగము, శ్రీవేంకటాచలము మొ॥పుణ్య క్షేత్రములతోను; |
| గంగా యమునా సరయూ నర్మదాది పుణ్య నదీభిశ్చ విరాజితే | గంగ, యమున, సరయు, నర్మద మొ॥ పుణ్యనదుల తోను ప్రకాశింపజేయబడినదియు; |
| సమభూమధ్యరేఖాయాః పూర్వదిగ్భాగే | సమభూమధ్యరేఖకు పూర్వదిగ్భాగమున; |
| మేరోర్దక్షిణదిగ్భాగే | మేరుపర్వతమునకు దక్షిణదిగ్భాగమున; |
| శ్రీశైలస్య ఈశాన్యప్రదేశే | శ్రీశైలమునకు ఈశాన్యప్రదేశమున; |
| కృష్ణాగోదావర్యో (కృష్ణాకావేర్యో) (గంగా గోదావర్యో) ర్మధ్యదేశే | కృష్ణాగోదావరీ నదుల (కృష్ణా కావేరీ నదుల) (గంగాగోదావరుల) మధ్య దేశమునందు; |
| సమస్తదేవతాబ్రాహ్మణసన్నిధౌ | సర్వదేవతలయు, బ్రాహ్మణులయు సన్నిధిలో |

| | |
|---|---|
| అస్మిన్ కళ్యాణమండపే | ఈ కళ్యాణమండపమందు |
| పరబ్రహ్మణా నియుక్తస్య | పరబ్రహ్మచే నియోగింపబడిన వాడును; |
| పరార్థద్వయజీవినః | రెండు పరార్థముల కాలము జీవించువాడును అగు; |
| కారణబ్రహ్మణః | కారణబ్రహ్మయొక్క; |
| (దేవతిర్యఙ్మనుష్య సకలజగత్స్రష్టుః పరార్థ ద్వయ జీవినః బ్రహ్మణః) | (దేవతలు, తిర్యగ్జంతువులు, మనుష్యులు అనెడు సకల జగత్తులు సృజించిన వాడును, రెండు పరార్థములు జీవించు వాడును అగు బ్రహ్మయొక్క) |
| ప్రథమపరార్థే | మొదటి పరార్థములో |
| పంచాశద్దివ్యవర్షాత్మకే | 50 దివ్య సం॥రములు దాటిన మీదట; |
| (పంచాశత్తమ వత్సరే) | (ఏబదియవ సం॥రమున) |
| ప్రథమమాసే | మొదటినెల; |
| ప్రథమపక్షే | మొదటిపక్షమునందు; |
| ప్రథమదివసే | మొదటిరోజున; |
| అహని | పగటివేళ; |
| ద్వితీయయామే | రెండవజామున; |
| తృతీయముహూర్తే | మూడవముహూర్త కాలమున; |
| త్రయోదశ ఘటికాయాం | పదమూడవ గడియలో; |
| ద్విచత్వారింశద్విఘటికాసు గతాసు | నలువది రెండు విగడియలు గడచిన మీదట; |
| ప్రథమప్రాణాయామే | మొదటి ప్రాణాయామ కాలమందు; |
| పార్థివకల్ప కూర్మకల్ప బ్రహ్మకల్ప వరాహకల్ప శ్వేతవరాహకల్ప ప్రణయకల్ప సావిత్రీకల్పా-నాం మధ్యే | పార్థివకల్పము, కూర్మకల్పము, బ్రహ్మకల్పము, వరాహకల్పము, శ్వేతవరాహకల్పము, ప్రణయకల్పము, సావిత్రీకల్పము అను వానిలో; |
| శ్వేతవరాహకల్పే | శ్వేతవరాహకల్పమునందు; |
| స్వాయంభువ స్వారోచిషోత్తమ తామస రైవత | స్వాయంభువము, స్వారోచిషము, ఉత్తమము, |

చాక్షుష (వైవస్వత) (సూర్యసావర్ణి) సూర్యాగ్ని చంద్రసావర్ణి బ్రహ్మసావర్ణి (బ్రహ్మరుద్ర) విష్ణుసావర్ణి రుద్రసావర్ణ్యాదీనాం (దక్షరౌచ్య భౌచ్యాదీనాం) చతుర్దశ మన్వంతరాణాం మధ్యే

తామసము, రైవతము, చాక్షుషము, (వైవస్వతము) (సూర్యాసావర్ణి) సూర్యాగ్ని, చంద్రసావర్ణి, బ్రహ్మ-సావర్ణి, (బ్రహ్మరుద్రము), విష్ణుసావర్ణి, రుద్రసావర్ణి మొ॥ (దక్షరౌచ్యము, భౌచ్యము మొ॥) పదునాలుగు మన్వంతరములలోనిదయిన;

వైవస్వతమన్వంతరే

వైవస్వత మన్వంతరమున;

శ్రీమదాది విష్ణోః మత్స్య కూర్మ వరాహ నారసింహ వామన భార్గవ రాఘవ కృష్ణ బౌద్ధ కల్కి దశావతారేషు

శ్రీమంతుడగు ఆదివిష్ణువుయొక్క మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, భార్గవ, రామ, కృష్ణ, బౌద్ధ, కల్కి అనెడు దశావతారములలో;

నవమబౌద్ధావతారే

తొమ్మిదవ బౌద్ధావతారమందు;

అష్టావింశన్మహాయుగే

ఇరువదియెనిమిదవ మహాయుగములో;

సప్తదశ లక్షాష్టావింశతి సహస్ర పరిమితే కృతయుగే యాతే

17 లక్షల 28 వేల పరిమితిగల కృతయుగము గడచిన మీదట;

ద్వాదశ లక్షషణ్ణవతి సహస్ర పరిమితే త్రేతా-యుగే చ యాతే

12 లక్షల 96 వేల పరిమితి గల త్రేతాయుగము గడచిన మీదట;

అష్టలక్ష చతుష్షష్టి సహస్ర పరిమితే ద్వాపరయుగే యాతే

8 లక్షల 64 వేల పరిమితి గల ద్వాపరయుగము గడచిన మీదట;

చతుర్లక్ష ద్వాత్రింశ (ద్విత్రింశ) త్సహస్ర పరిమితే కలియుగే

4 లక్షల 32 వేల సం॥ రముల పరిమితిగల కలియుగమునందు;

ప్రథమపాదే

మొదటిపాదమున;

యుదిష్ఠిర విక్రమార్క శాలివాహన విజయాభి నందన నాగార్జున కులషట్చకేషు మధ్యే

యుదిష్ఠిరశకము, విక్రమార్కశకము, శాలి-వాహనశకము, విజయాభినందన శకము, నాగార్జునశకము, కులశకము అను ఆరు-శకములలో;

తృతీయే శాలివాహనశకే

మూడవదియగు శాలివాహన శకమునందు;

| | |
|---|---|
| అష్టాశతయుత సహస్రవర్షాతీతే | 1108 సం॥రములు గడచిన మీదట; |
| నవశతే వర్తమానే | 900 వ సం॥రము జరుగుచుండగా; |
| వర్తమానవ్యావహారిక చాంద్రమాన | నేటివ్యవహారమందున్న చాంద్రమానమున |
| ప్రభవాది షష్టి సం॥ రాణాం మధ్యే | ప్రభవ మొదలుకొనియున్న 60 సం॥రములలో; |
| (అముక) సంవత్సరే | (ఫలానా) సంవత్సరములో |
| (అముక) ఆయనే | (ఫలానా) ఆయనములో |
| (అముక) ఋతౌ | (ఫలానా) ఋతువులో |
| (అముక) మాసే | (ఫలానా) మాసములో |
| (అముక) పక్షే | (ఫలానా) పక్షములో |
| (అముక) తిథౌ | (ఫలానా) తిథియందు |
| (అముక) వారే | (ఫలానా) వారమునాడు |
| శుభనక్షత్రే | శుభనక్షత్రమున |
| శుభయోగే | శుభయోగమున |
| శుభకరణే | శుభకరణమున; |
| ఏవం గుణవిశేషణ విశిష్టాయాం | ఇటువంటి గుణములు విశేషణములు కలిగిన |
| శుభతిథౌ | శుభతిథియందు; |
| శ్రీమాన్ (అముకః) గోత్రః | శ్రీమంతుడు (ఫలానా) గోత్రము కలవాడు; |
| (అముక) నామధేయః | (ఫలానా) పేరుగలవాడు; |
| ధర్మపత్నీ సమేతః అహం | ధర్మపత్నీ సమేతుడను అగు నేను |
| శ్రీమతః (అముక) గోత్రస్య | శ్రీమంతుడు (ఫలానా) గోత్రము కలవాడు |
| (అముక) నామధేయస్య | (ఫలానా) పేరు గలవాడు |
| ధర్మపత్నీ సమేతస్య మమ | ధర్మపత్నీ సమేతుడను అగు నాకు |
| ఇదానీమ్ అనాద్యవిద్యా వాసనయా సంసార | ఇప్పుడు అనాదిగా నుండియున్న అవిద్యా వాసన- |

| | |
|---|---|
| చక్రేఽస్మిన్ మహతి నానాయోనిషు జనిత్వా కేనాపి భాగ్య విశేషేణేదానీం మనుష్య విశేషం ప్రాప్తవతో మమ | చేత ఈ మహాసంసారచక్రమందు అనేక జన్మము–లెత్తి ఏదో యొకానొక గొప్ప అదృష్టముచేత ఇప్పుడు విశేషమగు మనుష్యజన్మము నొందిన నాకు; |
| జన్మాభ్యాసాత్ జన్మప్రభృతి ఏతత్ క్షణపర్యంతం | వెనుకటి జన్మల అభ్యాసమువలన నేను పుట్టినది మొదలుకొని ఈ క్షణమువఱకు; |
| బాల్యయౌవన కౌమార వార్ధకేషు | బాల్యము, యౌవనము, కౌమారము, వార్ధకముల–యందు; |
| జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థాసు | జాగ్రత్, స్వప్న, సుషుప్తి అవస్థలయందు; |
| మనోవాక్కాయకర్మభిః | మనస్సుచేతను, వాక్కుచేతను, శరీరకర్మలచేతను; |
| రహసి ప్రకాశే చ జ్ఞానతః అజ్ఞానతశ్చ కృతానాం మహాపాతకోపపాతకాదీనాం నవ విధానాం పాపానామ్ అపనోదన ద్వారా | రహస్యముగాను, వెల్లడిగాను, తెలిసికాని తెలియక–కాని, చేసిన మహాపాతకములు, ఉపపాతకములు, తొమ్మిది విధములైన పాపములు త్వరగా పోవుటద్వారా; |
| మయా సహ దశపూర్వేషాం దశాపరేషాం | నాతోగూడ 10 పూర్వ 10 అపరతరముల వారైన; |
| మద్వంశ్యానాం సర్వేషాం పితౄణాం | నా వంశములోని పితృదేవతలందఱకును; |
| నరకాదుత్తీర్యశాశ్వతపుణ్యలోకఫలావాప్త్యర్థం (బ్రహ్మ–లోక నివాస సిద్ధ్యర్థం) శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం | నరకమునుండి దాటి శాశ్వతమైన పుణ్యలోక ఫలము నొందుటకొఱకు (బ్రహ్మలోకమున నివాసము సిద్ధించుటకొఱకు) శ్రీ పరమేశ్వరుని ప్రీతికొఱకు; |
| గంగావాలుకాభిస్సప్తర్షి మండల పర్యంతం కృతరాశేర్వర్ష సహస్రావసానే ఏకైకవాలుకా–పకర్ష క్రమేణ సర్వరాశ్యపకర్షిత సమ్మితకాలే బ్రహ్మలోక నివాససిద్ధ్యర్థం | గంగయందలి యిసుకరేణువులచేత సప్తర్షిమండ–లమువఱకు ప్రోగుపడిన రాశినుండి వేలకొలది సంIIరములు గడచిపోగా ఒక్కొక్క రేణువు చొIIన సర్వరాశి అయిపోవు వఱకు బ్రహ్మలోకమున నివాసము సిద్ధించుటకొఱకు; |
| తిలైః సూర్యమండలపర్యంతం కృతరాశేర్వర్ష సహస్రావసానే ఏకైకతిలాపకర్ష క్రమేణ సర్వ– | నువ్వులచే సూర్యమండలమువఱకు ప్రోగుపడిన రాశినుండి వేలకొలది సంIIరములు గడచిన పిదప |

రాశ్యపకర్షితసమ్మితకాలే బ్రహ్మలోకే నివాస సిద్ధ్యర్థం

ఒక్కొక్క నువ్వుగింజ చొ॥న తగ్గిపోగా సర్వమయిన రాశి అయిపోవు వఱకు బ్రహ్మలోకమున నివాసము సిద్ధించుటకొఱకు;

పంచాశద్గవ్యూతి సమ్మిత గణనా సమ్మిత దేశే (వృష) గోలోమభిర్నక్షత్రమండలపర్యంతం కృతరాశేర్వర్ష సహస్రావసానే ఏకైకవృష లోమాపకర్ష క్రమేణ సర్వరాశ్యపకర్షిత సమ్మిత కాలే బ్రహ్మలోకే నివాస సిద్ధ్యర్థం

నూఱుక్రోశముల దూరదేశమందు ఎద్దు వెంద్రుకల చేత నక్షత్రమండలమువఱకు ప్రోగుచేయబడిన రాశినుండి వేలకొలది సం॥రముల చివర ఒక్కొక్క వెంద్రుక చొ॥న తగ్గిపోగా రాశి పూర్తిగా అయిపోవు వఱకు బ్రహ్మలోకమునందు నివాసము సిద్ధించుట కొఱకు;

యవైర్గ్రహమండలపర్యంతం కృతరాశేర్వర్ష సహస్రావసానే ఏకైకయవాపకర్షక్రమేణ సర్వరాశ్యపకర్షిత సమ్మితకాలే బ్రహ్మలోకే నివాస సిద్ధ్యర్థం

యవధాన్యపు గింజల చేత గ్రహమండలము వఱకు ప్రోగువడిన రాశినుండి వేలకొలది సం॥రముల గడిచిన పిదప ఒక్కొక్క వరిగింజ చొ॥న తగ్గిపోగా సర్వరాశి యయిపోవు వఱకు బ్రహ్మలోకమునందు నివాసము సిద్ధించుటకొఱకు;

మాషైర్ధ్రువమండల పర్యంతం కృతరాశేర్వర్ష సహస్రావసానే ఏకైక మాషాపకర్ష క్రమేణ సర్వరాశ్యపకర్షిత సమ్మితకాలే బ్రహ్మలోకే నివాస సిద్ధ్యర్థం

మినుములచేత ధ్రువమండలము వఱకు ప్రోగుపడిన రాశినుండి వేలకొలది సం॥రములు గడచిన పిదప ఒక్కొక్క మినుముగింజ చొ॥న తగ్గిపోగా సర్వరాశి అయిపోవు వఱకు బ్రహ్మ–లోకమున నివాసము సిద్ధించుకొఱకు;

త్రిగుణీకృతాగ్నిష్టోమాతిరాత్రాప్తోర్యామ సాంతపని వాజపేయ పౌండరీకాశ్వమేధాది శతక్రతు పుణ్యఫలావాప్త్యర్థం

మూడురెట్లు చేయబడిన అగ్నిష్టోమము, అతిరాత్రము, అప్తోర్యామము, సాంతపనము, వాజపేయము, పౌండరీకము, అశ్వమేధము మొ॥ నూఱుయజ్ఞముల పుణ్యఫలము లభించుట కొఱకు;

ఇహజన్మని రాజాధిరాజో భూత్వా సమస్త సుఖా న్యనుభూయ తతో విష్ణుసాయుజ్య ఫలావాప్త్యర్థం

ఈ జన్మమున రాజాధిరాజయి సర్వసుఖము లనుభవించి పిమ్మట విష్ణుసాయుజ్యఫలము నొందుటకు;

శ్రీలక్ష్మీనారాయణముద్దిశ్య శ్రీలక్ష్మీనారాయణ ప్రీత్యర్థం స్వగృహ్యోక్తప్రకారేణ సాలంకృత కన్యాదానమహం కరిష్యే॥

శ్రీ లక్ష్మీసహిత నారాయణు నుద్దేశించి శ్రీ లక్ష్మీనారాయణ ప్రీతికొఱకు గృహ్య ధర్మశాస్త్రమందు చెప్పబడిన రీతిగా అలంకార సహిత కన్యాదానము చేసెదను.

(సాలంకృత సహిరణ్యోదకకన్యాదానమహం కరిష్యే॥)

(అలంకారములు హిరణ్యోదకమున్ను కలిగిన కన్యాదానము చేసెదను).

॥ ఇతి మహాసంకల్పః॥

మహాసంకల్పము సమాప్తము

మూ॥ వరమభ్యర్చ్య

వరుని పూజింపవలెను.

శ్రీలక్ష్మీనారాయణ స్వరూపస్య వరస్య ఇద-మాసనమ్ ।

శ్రీలక్ష్మీనారాయణ స్వరూపుడైన పెండ్లి కుమారునకు ఈ కూర్చ ఆసనము

శ్రీ లక్ష్మీనారాయణ స్వరూప వర। ఉభాభ్యామిదం పాద్యమ్ ।

శ్రీ లక్ష్మీనారాయణ స్వరూపుడవైన ఓ వరుడా! రెండు పాదములకు కడుగుటకు ఈ యుదకమని ముందు కుడికాలును తరువాత ఎడమకాలును కడుగవలెను.

శ్లో॥ నమోస్త్వనంతాయ సహస్రమూర్తయే సహస్ర పాదాక్షి శిరోరు బాహవే । సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే సహస్రకోటీయుగధారిణే నమః ॥

నాశరహితుడును, అనేక రూపములు ధరించిన వాడును, అనేక మైన పాదములు, నేత్రములు, శిరస్సులు, బాహువులు గలవాడును, అనేక నామ-ములు గలవాడును, శాశ్వత పురుషుడయిన వాడును, అనేక యుగధర్మములు నడపు వాడును, అగు భగవంతునకు నమస్కారము అని యీ శ్లోకమును చెప్పుచు పాదములను కడుగవలెను.

శ్రీలక్ష్మీనారాయణస్వరూప వర!అమీ గంధాః ।

ఓ లక్ష్మీనారాయణ స్వరూపుడవగు ఓ వరుడా! ఇవి సుగంధ ద్రవ్యములు (గంధము)

అలంకారార్థా ఇమే అక్షతాః ।
సంత్వక్షతాః సకలారాధనైశ్శోభనమస్తు ।

అలంకారము నిమిత్తము ఈ అక్షతలు ఇవి యన్నియు నాశరహితములగు గాక. ఈ యుపచారముల చేత శుభమగు గాక. (అని అక్షతలు చల్లవలెను.)

ఈ క్రింది శ్లోకములు దాత పఠించవలెను

శ్లో॥ కన్యాం కనకసంపన్నాం కనకాభరణైర్యుతామ్ ।
దాస్యామి విష్ణవే తుభ్యం బ్రహ్మలోకజిగీషయా॥

తా॥ బంగారముతోకూడుకొన్నదియు, స్వర్ణాలంకారములతో గూడినదియు, అగు ఈ కన్యను నా బ్రహ్మలోక నివాసముకొఱకు విష్ణుస్వరూపుడవైన నీకు ఒసగుచున్నాను.

శ్లో॥ కన్యే! మమాగ్రతో భూయాః కన్యే! మే దేవి పార్శ్వయోః ।
కన్యే!మే సర్వతో భూయాః త్వద్దానాన్మోక్షమాప్నుయామ్ ॥

తా॥ ఓ కన్యకా! నీవు నా యెదుట నుండుమా! అట్లే బాగుగా ప్రకాశించెడు ఓ కన్యకా! నా రెండు ప్రక్కల యందుండుమా! ఓ కన్యకా! నీవు అన్ని దిక్కుల యందుండుమా! నీ దానమువలన మోక్షము పొందగలను. ఇట్లు సర్వదిక్కులయందు కన్యనుపాసించుట దేవతోపాసనవంటిది.

శ్లో॥ విశ్వంభరస్సర్వభూతాః సాక్షిణ్యస్సర్వదేవతాః ।
ఇమాం కన్యాం ప్రదాస్యామి పితౄణాం తారణాయ వై ॥

తా॥ శ్రీ విష్ణువును సమస్తభూతములున్ను, బ్రహ్మాది దేవతలును సాక్షిగా పితృదేవతలును సాక్షిగా పితృదేవతలు తరించు నిమిత్తమై ఈ కన్యాదానము చేయుచున్నాను.

శ్లో॥ కన్యాం సాలంకృతాం సాధ్వీం సుశీలాయ సుధీమతే ।
ప్రయతోఽహం ప్రయచ్ఛామి ధర్మకామార్థసిద్ధయే ॥

తా॥ అలంకారములతోగూడి శాంతస్వభావముగల యీ కన్యను నిశ్చల బుద్ధిమంతుడు సత్ప్రవర్తకుడైన వరునకు శ్రద్ధగలవాడనై ధర్మకామార్థములు సిద్ధించు నిమిత్త మిచ్చుచున్నాను.

మూ॥ పునః కన్యావరగోత్రనామాన్యుక్త్వా ।

తా॥ మఱల వధూవరుల గోత్రనామములను చెప్పవలెను.

మూ॥ చతుస్సాగరపర్యంతం గోబ్రాహ్మణేభ్యశ్శుభం భవతు ॥

తా॥ నాలుగుసముద్రములవఱకు నుండెడు గోవులకును బ్రాహ్మణులకును శుభము అగుగాక.

... నప్త్రీం = ... మునిమనుమరాలును,
... పౌత్రీం = ... కుమారుని కుమార్తెయు
... పుత్రీం = ... కుమార్తెయు
... నామ్నీం = ... పేరుగలదియును నగు ఈ కన్యను
నప్త్రే = ... మునిమనుమడును
పౌత్రాయ = ... కుమారుని కుమారుడును
పుత్రాయ = ... కుమారుడును

నామ్నే వరాయ = ... పేరుగలవాడునగు వరునకు

తుభ్యం = నీకు

ప్రజాసహత్వ కర్మభ్యః ప్రతిపాదయామి ఇతి సహిరణ్యం కన్యాహస్తముదకపూర్వం వరహస్తే దద్యాత్॥

సంతానప్రాప్తికి, కర్మలయందు సహకరించుకొరకు అప్పగించుచున్నాను అని బంగారముతో గూడిన కన్య దోయిట సదక్షిణ చందన ఫలతాంబూల ముంచి ఉదకధారతో ఆ దోసిటిని వరుని దోసిటనుంచవలెను.

సాలంకృత హిరణ్యోదక కన్యా మహాదానం తుభ్యమహం సంప్రదదే న మమ ॥

అలంకారము, బంగారము, నీరు అనువానితో గూడిన కన్యా మహాదానము నీ కొఱకు నేను చేయుచున్నాను. ఇంక ఇది నాకు గాదు.

ఇది మొదలు ఏధర్మము (అనగా యాగాదులు) చేసినను ఈ పేరుతోనే చేయవలయునని నియమించును. అదియును గాక స్త్రీకి కర్మలందు స్వాతంత్ర్యము లేదు గాన పురుషునికి సహధర్మచారిణియే గాని స్వాతంత్ర్యము లేదు, గాన కర్మలందు సహత్వాధికారము కొరకు సంతానము కొరకు ఈమెను నీకు అప్పగించుచున్నాను. అని ఉదకధారా పూర్వకముగా వరుని హస్తమందు వప్పగించవలెను.

ఆమెను వరుడు హస్తము గ్రహించి ప్రతిగ్రహించవలెను.

## – కన్యాదానము –

తరువాత పెండ్లికుమారుడు వివాహ సంస్కారము చేసికొనుటకు పితృగృహమునకు వెళ్లవలయును. వెళ్ళి "ధర్మప్రజాసంపత్త్యర్థం స్త్రియముద్వహే" అని సంకల్పము చేసి ప్రారంభింప వలయును. పెండ్లికుమార్తెను తండ్రి లేక సోదరుడు మొ॥వారు "**ధర్మేచ అర్థేచ, కామేచ త్వయైషా నాతిచరితవ్యా**" అని వచింపవలెను. అనగా ధర్మము, అర్థము, కామము అను పురుషార్థములయందు ఈ వధువు నీచే విడువదగినదికాదు అని అర్థము. "**నాతిచరామి**" ఈ కన్యను మూడుపురుషార్థముల యందు పరిత్యజించను" అను పెండ్లికుమారుని సమాధానమును తీసికొనవలయును. పిమ్మట కన్యాదానము చేయవలయును. ఇట్లు కన్యను దానముచేయుటను, పరిగ్రహించుటను **కన్యాదానమందురు**.

మూ॥ వరః దేవస్యేతి కన్యాం హస్తే ప్రతిగృహ్ణీయాత్॥

వరుడు "దేవస్య త్వా" అనుమంత్రముతో కన్యను హస్తమందు ప్రతిగ్రహింపవలయును.

మం॥ **దేవస్య త్వా సవితుః ప్రసవే । అశ్వినోర్బాహుభ్యామ్ । పూష్ణో హస్తాభ్యాం ప్రతిగృహ్ణామి ।**

**రాజా త్వా వరుణో నయతు దేవి । దక్షిణే! ప్రజాపతయే కన్యాం ।**

**తేనామృతత్వమశ్యామ్ । వయో దాత్రే ।**

**మయో మహ్యమస్తు ప్రతిగ్రహీత్రే । క ఇదం కస్మా అదాత్ ।**

**కామః కామాయ। కామో దాతా । కామః ప్రతిగ్రహీతా । కామగ్ం సముద్రమావిశ ।**

**కామేన త్వా ప్రతిగృహ్ణామి । కామైతత్తే । ఏషా తే కామ దక్షిణా । ఉత్తానస్త్వాంగీరసః ప్రతిగృహ్ణాతు, ఇతి ॥**

అర్థము: హే ప్రతిగృహ్యమాణద్రవ్య! = ప్రతిగ్రహింపబడెడు ఓ ద్రవ్యమా! ; సవితుః దేవస్య = సూర్యదేవునియొక్క, అశ్వినోః = అశ్వినీదేవతల సంబంధమైన; ప్రసవే = ప్రేరణము జరుగగా; బాహుభ్యామ్ = బాహువులతోను; పూష్ణః = పూష (సూర్య) సంబంధమగు; హస్తాభ్యామ్ = హస్తములతోను; త్వా = నిన్ను; ప్రతిగృహ్ణామి = స్వీకరించుచున్నాను. హే దక్షిణేదేవి! = ఓ దక్షిణాదేవీ ! వరుణః రాజా = రాజగు వరుణుడు; కన్యామ్ = కన్యవగు నిన్ను; ప్రజాపతయే = ప్రజాపతికొరకు; నయతు = పొందించుగాక; తేన = ఆ పొందించుటచే; (అనగా ప్రతిగ్రహదోషము లేకపోవుటవలన) అహమ్ = నేను; అమృతత్వమ్ = నరకాభావమను దానిని; అశ్యామ్ = పొందుదును; ఇయం చ = దక్షిణా = ఈ దక్షిణాదేవి; దాత్రే = దాతకు; వయః అస్తు = పక్షిరూపిణియయి దాతను స్వర్గమును జేర్చుగాక యని యర్థము; ప్రతిగ్రహీత్రే = ప్రతిగ్రహించునట్టి; మహ్యమ్ = నాకు; మయః అస్తు = సుఖమగుగాక; ఇదమ్ = ఈ ద్రవ్యము; కః = ప్రజాపతి; కస్మై = ప్రజాపతికి; అదాత్ = ఇచ్చెను; (అంతర్యామి రూపముగా దాతప్రతిగ్రహీతలకు ప్రేరకుడగుటవలన); కామః = కాముడు; కామాయ = కాముని కొఱకు; దత్తవాన్ = ఇచ్చెను; ఎట్లు ప్రజాపతి అదృష్టప్రేరకుడో అటులనే కాముడు దృష్ట ప్రేరకుడు గనుక, (అందువలన); కామ ఏవ = కాముడే; ప్రతిగ్రహీతా చ = ప్రతిగ్రహీత కూడను – తతః = అందువలన; హే దక్షిణే! = ఓ దక్షిణాదేవీ! సముద్రమ్ = సముద్రమువంటి, కామమ్ = కాముని; ఆవిశ = ప్రవేశింపుము (స్వర్గాది ఫలవిషయకము కదా కామము; (కాముడు) దాత; ఐహిక సుఖవిషయమగు కామము (కాముడు) ప్రతిగ్రహీత. కామేన = కామమనే (కాముడనే) నిమిత్తముచేత; త్వా = నిన్ను; ప్రతిగృహ్ణామి = ప్రతిగ్రహించెదను. హే కామ! = నా హృదయములోనుండెడు ఓ కామమా! తత్ ఏతత్ = ఆయీద్రవ్యము, తే = నీ కొఱకు; భవతి = అగుచున్నది; హేకామ! = ఓ కాముడా!, తే = నీప్రీతికొఱకు; ఏషా = ఇది, దక్షిణా = దక్షిణగా అయినది. అంగీరసః = అంగిరసగోత్రములో పుట్టిన; ఉత్తానః = ఉత్తానుడను మహర్షి; త్వా = నిన్ను; ప్రతిగృహ్ణాతు = ప్రతిగ్రహించుగాక.

మూ॥ ఇతి కన్యాం ప్రతిగృహ్ణీయాత్ । తా॥ అని కన్యను ప్రతి గ్రహింపవలయును.

మూ॥ తతః లోకాచారక్రమేణ యథాశక్తి దానాని కుర్యాత్ ।

తా॥ పిమ్మట లోకాచారముననుసరించి యథాశక్తిగా వరునికి – దానములను చేయవలయును.

మూ॥ స్వస్తీతి ప్రతివచనమ్ । తా॥ స్వస్తి అని వరుడు జవాబు చెప్పవలయును.

మూ॥ దాతా కన్యాదానసాద్గుణ్యార్థం మానసోత్సాహపరిమితదక్షిణాం వరాయ దద్యాత్ ।

తా॥ కన్యాదాత కన్యాదానము సద్గుణవంతమగుటకు మనస్సులోని ఉత్సాహమునుబట్టి వరునకు దక్షిణనీయ వలయును.

మూ॥ ధర్మే చ అర్థే చ కామే చ త్వయైషా, నాతిచరితవ్యేతి దాతా వదేత్ ।

తా॥ ధర్మమందు, అర్థమందు, కామమందును ఈమె నీచే అతిక్రమింపబడరాదు అని కన్యాదాత పలుకవలయును.

మూ॥ నాతిచరామీతి వరః ప్రతిబ్రూయాత్ ।

తా॥ అతిక్రమించి సంచరింపను అని వరుడు బదులు చెప్పవలయును.

మూ॥ తత్రైవ కన్యాఽఽస్తే ।

తా॥ కన్యాదానము జరిగినచోటనే కన్య యుండును.

మూ॥ తతో వరః వివాహవేదికాయామగ్నిప్రతిష్ఠాపనం కుర్యాత్ ।

తా॥ పిమ్మట వివాహవేదికయందు వరుడు వైవాహికాగ్నిని నిశ్చయించిన కుండమందు అగ్ని ప్రతిష్ఠాపన చేయవలయును. అది యెట్లనగా

ఆచమ్య

మూ॥ వరః ప్రాణానాయమ్య

తా॥ వరుడు ఆచమనము చేసి ప్రాణాయామము చేయవలయును. (చేసి)

మూ॥ ఏవం గుణ ... ... ... ... సిద్ధ్యర్థం మమ సకల శ్రౌతస్మార్త నిత్య కర్మానుష్ఠానాధికార సిద్ధ్యర్థం గృహ్యాగ్ని ప్రతిష్ఠాపనం కరిష్యే । స్థండిలోల్లేఖనం కృత్వా । అగ్నిం ప్రతిష్ఠాప్య అగ్నిం ప్రజ్వాల్య 'ప్రాక్తోయ నిధానాంతం' కుర్యాత్

తా॥ ఇట్టి గుణములుగల ... ... ... ... సిద్ధికొఱకు నాకు సమస్తమయిన శ్రౌతములు స్మార్తములునగు నిత్యకర్మల అనుష్ఠానమునకు యోగ్యత సిద్ధించుటకొఱకు గృహ్యాగ్ని యొక్క ప్రతిష్ఠాపనము చేసెదను. అగ్ని ప్రతిష్ఠాపనము చేసి, అగ్నిని ప్రజ్వరిల్లఁజేసి తూర్పున ఉదకము ఉంచువరకుచేసి

మూ॥ కళ్యాణమండపమాగచ్ఛేద్వరః । తా॥ వరుడు కళ్యాణమండపము వద్దకు రావలెను.

మూ॥ దాతా ప్రాణానాయమ్య । మయా క్రియమాణకన్యాదానాం గత్వేన వరం మధుపర్కేణ పూజయిష్యే కూర్చం ప్రయచ్ఛతి ।

తా॥ దాత ప్రాణాయామము చేసి, నాచేత, చేయబడుచున్న కన్యాదానమున కంగముగా వరుని మధుపర్కముచేత పూజించెదను. కూర్చను వేయుచున్నాడు.

మూ॥ యత్రాస్మా అపచితిం కుర్వంతి తత్కూర్చ ఉపవిశతి యథా పురస్తాత్ ।

తా॥ ఏగృహమందీస్నాతకునకా మధుపర్క పూజ చేయుదురో అక్కడ దాత యిచ్చిన కూర్చమీద కూర్చుండవలెను. ఉపనయనములో ఆచార్యుడు మంత్రయుక్తముగా కూర్చొనినట్లే.

మూ॥ అంతఃపటలం కృత్వా = తెఱను పట్టవలెను.

అథ వరాయ మధుపర్కం కుర్వన్నుదగ్రం కూర్చం నిదధ్యాత్ । తతో వరః రాష్ట్రభృదసీతి యజుషోప విశేత్ ॥

తా॥ భూర్లోకము ఓంకారస్వరూపమయినది. ఇట్టి గుణములు కల ... ... శుభ తిథియందు నాకుమార్తెను, ఆయువు అభివృద్ధి పొందుటకు వచ్చిన ఈ వరుని మధుపర్కముతో పూజింతును. పిదప వరునకు మధుపర్కము నిచ్చుచూ ఉత్తరాగ్రముగా కూర్చనుంచవలయును. అప్పుడు వరుడు "రాష్ట్రభృదసి" అను యజుర్వేద మంత్రముతో కూర్చుండవలెను.

మూ॥ యథా పురస్తాత్। పూర్వమునందువలె అనగా ఉపనయనములో ఆచార్యుడు మంత్రయుక్తముగా కూర్చొనినయట్లు.

మం॥ **రాష్ట్రభృదస్యాచర్యా సందీ మా త్వద్యోషమ్ ॥**

అ॥ కూర్చమనగా దర్భమయ ఆసనము; హే కూర్చ = ఓ కూర్చమా! త్వం = నీవు; రాష్ట్రభృత్ అసి = రాజ్యమును భరించు దానవు అయితివి; ఆచార్యా సందీ = ఆచార్యున కాసనమైతివి; త్వత్ = నీకంటె; మా యోషమ్ = వేరుగానుండను.

తా॥ ఓ కూర్చా! నీవు సమస్తమైన రాజ్యమును భరించుదానవు. ఆచార్యుల కాసనమైతివి గాన నేను నీమీద కూర్చుండెదను. వరుడు పై మంత్రమును చెప్పి ఉత్తరాగ్రమైన కూర్చమీద పశ్చిమాభిముఖుడై కూర్చుండ వలెను.

మం॥ **రాష్ట్రభృదసి సమ్రాడా సందీ మా త్వద్యోషగ్‌మ్ ॥**

(రాజునకాసనమైతివి) అని క్షత్రియుడు చెప్పవలెను.

మం॥ **రాష్ట్రభృదస్యధి పత్న్యాసందీ మా త్వద్యోషమ్ ॥**

ఇట్లు వైశ్యుడున్ను ఇతరకులజుడైన ప్రభువున్ను చెప్పవలెను.

మూ॥ ఆపః పాద్యా ఇతి దాతా ప్రాహ । వరః ఉత్తరయాభి మంత్ర్య ।

తా॥ తరువాత దాత ఉదకము తెచ్చి ఈ ఉదకములు పాద ప్రక్షాళనార్థములు అనవలెను. వరుడు ముందు మంత్రముచే అభి మంత్రణము చేయవలెను.

మం॥ **ఆపః పాదావనే జనీర్ద్విషంతం నాశయంతు మే । అస్మిన్కులే బ్రహ్మవర్చస్యసాని ॥**

అ॥ పాదావనే జనీః = పాదప్రక్షాళనము చేసిన; ఆపః = ఉదకములు; మే ద్విషంతమ్ = నాయొక్క శత్రువును; నాశయంతు = సంహరించుగాక; అస్మిన్ కులే = ఈవంశమునందు; బ్రహ్మవర్చసీ = బ్రహ్మవర్చస్సు గలవాడనై; అసాని = అయ్యెదను.

తా॥ పాదప్రక్షాళనము చేసిన యీజలములు నాశత్రువును హరించుగాక. ఈ వంశమునందు బ్రహ్మవర్చస్సు గల వాడనయ్యెదను. (అగుదును గాక.)

మూ॥ పూర్వం దక్షిణపాదం ప్రక్షాళ్య । తతో వామ పాదం ప్రక్షాళయేత్ । ప్రక్షాళయితారముపస్పృశ్య

తా॥ ముందుగా కుడికాలు కడుగవలయును – పిమ్మట ఎడమకాలు కడుగవలెను. కాళ్లు కడుగు దాతను చేతితో తాకవలెను.

సూ॥ దక్షిణం పాదం పూర్వం బ్రాహ్మణాయ ప్రయచ్ఛేత్ ।

సూ॥ సవ్యగ్ం శూద్రాయ ।

తా ॥ కుడికాలు ముందుగా బ్రాహ్మణుడైన దాత కీయవలెను.

తా॥ దాత శూద్రుడైనచో ఎడమకాలు ముందీయవలెను. (సూత్రకారులు చెప్పలేదు గనుక రాజునకును వైశ్యునకును పాద ప్రక్షాళనమే లేదని సుదర్శనాచార్యులు చెప్పుచున్నారు. కొందరు కుడియెడమ పరీక్ష వారికక్కరలేదు గనుక సూత్రము చెప్పలేదని యందురు. (సందిగ్ధమైనదాని కాచారమునే యవలంబించునది.)

మూ॥ శ్రీలక్ష్మీనారాయణ స్వరూపస్య బ్రాహ్మణస్య ఉభాభ్యామిదం పాద్యమ్ ।

తా॥ శ్రీలక్ష్మీనారాయణ స్వరూపుడగు బ్రాహ్మణుని రెండు పాదములకు ఇదిగో పాద్యము (కాళ్లు కడుగుకొనుటకు నీరు.)

శ్లో॥ నమోఽస్త్వనంతాయేతి పాదప్రక్షాళనం కుర్యాత్ ।

తా॥ నమోఽస్త్వనంతాయ అను శ్లోకమును చదివి పాద ప్రక్షాళనము చేయవలయును.

మూ॥ వరః ఆచమ్య । ఉత్తరేణ యజుషాఽఽ త్మానం ప్రత్యభిమృశేత్ ।

తా॥ వరుడు ఆచమనము చేసి తరువాతనున్న 'మయి మహో' అను యజుర్వేద మంత్రముతో తనను స్పృశింపవలయును.

మం॥ **మయి మహో మయి యశో మయీంద్రియం వీర్యం ।**

మూ॥ ఆప ఉపస్పృశ్య । కూర్చాభ్యాం పరిగృహ్య ।

సూ॥ మృణ్మయేనార్హణీయా ఆప ఇతి దాతా ప్రాహ ॥

అ॥ మయి = నాయందు; మహః = తేజస్సు; మయి = నాయందు; యశః = కీర్తి; మయి = నాయందు; ఇంద్రియమ్ = నేత్రాదీంద్రియములు; వీర్యమ్ = రేతస్సు ఉండుగాక.

తా॥ నాయందు తేజస్సు, కీర్తి, ఇంద్రియములు, రేతస్సు గలుగుగాక. బ్రాహ్మణుల పాదములంటుటచే నివి నిలువవని యిట్టి ప్రార్థన.

నీరు ముట్టుకొని, రెండు కూర్చలతో 'మృణ్మయేనార్హణీయా ఆపః' అని దాత పలుక వలెను.

మూ॥ వరః ఉత్తరయాఽభిమంత్ర్య ।

తా॥ వరుడు (తరువాతదైన) 'ఆమాగన్' అను మంత్రముతో మంత్రించి

మం॥ **ఆమాగన్ యశసా వర్చసా సగ్ంసృజ పయసా తేజసా చ । తం మా ప్రియం ప్రజానాం కుర్వధిపతిం పశూనామ్ ॥**

అ॥ త్వమ్ = నీవు; ఆగన్ = వచ్చుచు; యశసా = కీర్తితోడను; వర్చసా = కాంతితోడను; పయసా = క్షీరములతోడను; తేజసా = తేజస్సుతోడను; మా సంసృజ = నన్ను కూర్చుము; తం మా = అటువంటి నన్ను; ప్రజానాం ప్రియమ్ = ప్రజలకు ఇష్టమైన వానిగాను; పశూనామ్ = పశువులకు; అధిపతిమ్ = అధిపతినిగాను; కురు = చేయుము.

తా॥ ఓ యుదకమా! నీవు వచ్చి నన్ను కీర్తిగలవానిగాను వర్చస్సు గలవానిగాను, కాంతిగలవానిగాను, ప్రజలకిష్టునిగాను, పశువులుగల వానిగాను చేయుము.

మూ॥ అంజలావేకదేశ ఆనీయమాన ఉత్తరం యజుర్జపేత్ । రాత్రాస్వాంజలౌ ఉదకైకదేశే స్తోకే ఆనీయమానే దాత "అర్ఘనీయా ఆప" అను మంత్రముతో వరునకిచ్చు నిమిత్తము తెచ్చిన నీటిలో కొంత ఆ దాత వరుని అంజలిలో పోయుచున్నప్పుడు "ఆమాగన్" మంత్రము వరుడు చెప్పవలెను.

మం॥ **విరాజో దోహోఽసి విరాజో దోహమశీయ మమ పద్యాయ విరాజ**

అ॥ విరాజః = అన్నముయొక్క; దోహః = సంరక్షకము; అసి = అయితివి; విరాజః = అన్నమువలన; దోహమ్ = రక్షణమును; అశీయ = పొందెదను; మమ = నాయొక్క; పద్యాయ = పుత్రుని కొఱకు; పదం స్థానం, తత్రభవః పద్యః, పదం స్థానం, తత్రభవః పద్యః ఇతి భావః (మత్థానాపన్నః పుత్ర ఇతిభావః) విరాజ = దీపింపుము.

తా॥ ఓ ఉదకమా! నీవలన అన్నము కల్గుచున్నది. ఆ అన్నము వలన సంరక్షింపబడుచున్నాను. నా పుత్రుడును రక్షింపబడుగాక.

లేదా

అన్నము వర్షించుదానవు. అందువలన అన్నవర్షమును పొందుదును. నా స్థానమందున్న ఆ పుత్రుని ప్రకాశింపజేయుము.

మూ॥ వరః అపః అపాస్య) శేషం పురస్తాన్నినీయమానగ్ముత్తరయాభి మంత్రయతే ।

మం॥ **సముద్రం వః ప్రహిణోమి స్వాం యోనిమపి గచ్ఛత । అచ్ఛిద్రః ప్రజయా భూయాసం మాపరాసేచి మత్పయః ॥**

అ॥ వః = మిమ్ములను; సముద్రమ్ = సముద్రమునుగూర్చి; ప్రహిణోమి = పంపుచున్నాను; స్వామ్ = స్వకీయమైన; యోనిమ్ = కారణభూతమును; గచ్ఛత = పొందుడు, ప్రజయా =

సంతానముచేతను; అచ్ఛిద్రః = భంగములేని వాడనై (నిరంతరుడును) భూయాసమ్ = అయ్యెదను. (నాకుసంతతివిచ్ఛేదము కలుగకుండుగాక); పయః = ఉదకము; మత్ = నావలన; మా పరాసేచి = అనుపయోగకరముగా నుండుకుండుగాక.

తా॥ ఓ యుదకములారా! మిమ్ములను సముద్రమునకు పంపుచున్నాను. మీ జన్మస్థానమునకు వెళ్ళుడు. నా సంతానమును భంగము చేయబోకుడు. మీరు నాకెప్పుడు నుపయోగించు రీతి నుండుడు.

మూ॥ అత్ర వాసో గవాదికం యథాశక్తి దత్వా । వరమలంకృత్య । ఓం యువం వస్త్రాణి... సచేథే ఇతి మంత్రముచ్చార్య తత్తద్దాతృనామ వదేత్ ॥

తా॥ (ఇక్కడ బట్టలు ఆవులు మొ॥వి యథాశక్తిగా నిచ్చి వరుని అలంకరించి) “ఓం యువం వస్త్రాణి... సచేథే” అను మంత్రమును పలికి ఆయా దాతల పేర్లను పలుక వలెను.

మం॥ **ఓం యువం వస్త్రాణి పీవసా వసాథే యువోరచ్ఛిద్రా మంతవో హ సర్గాః । అవాతిరతమనృతాని విశ్వర్తేన మిత్రావరుణా సచేథే ॥**

అ॥ హే మిత్రావరుణా = ఓ మిత్రావరుణులారా! పీవసా యువమ్ = బలిసియున్న మీరిర్వురును (లేదా) పీవసా = ఆచ్ఛాదనయోగ్యములైన వస్త్రములను; వసాథే = ఆచ్ఛాదన చేయుచున్నారు. (లేదా) పీవసా = స్థూల ప్రభూత తేజస్సుచేత; వస్త్రాణి = అవిచ్ఛిన్నములైన వస్త్రస్థానీయములైన తేజస్సులను; వసాథే = ధరించుచున్నారు; కించ = మఱియు; యువోః = మీయిద్దరియొక్క; సర్గాః = సృష్టులు; అచ్ఛిద్రాః = అచ్ఛిన్నములు; మంతవో హ = మన్నింపదగినవి; ఈదృశౌ యువామ్ = ఇటువంటి మీరిద్దఱు; విశ్వా = సమస్తములయిన; అనృతాని = అసత్యములను, అప్రియములగు, పాపములను; అవాతిరతమ్ = నశింపజేయుదు; ఋతేన = ఫలముచేతను ఫలసాధనమైన యజ్ఞముచేతను గాని, సచేథే = కలిసికొనియున్నారు. మాకు కూర్చుడు అని భావము.

మూ॥ మధుపర్కద్వయం ధృత్వా । ఆచమ్య ।

తా॥ మధుపర్కద్వయమును ధరించి, ఆచమనమును చేసి.

సూ॥ దధి మధ్వితి సగ్ంసృజ్య కాగ్ంస్యేన వర్షీ యసా పిధాయ కూర్చాభ్యాం పరిగృహ్య ప్రాహ మధుపర్కో మధుపర్కో మధుపర్కః ఇతి । వరః ఉత్తరాభ్యామభి మంత్ర్య ।

తా॥ పెరుగు తేనె యీరెంటిని ఒకపాత్రయందు కలిపి దానికంటె పెద్దదైన కంచుపాత్రచేత కప్పి రెండు కూర్చలచేత అడుగునను పైనను పట్టుకొని మధుపర్కము, మధుపర్కము, మధుపర్కము అని మూడుసార్లు దాత పలుకవలెను.

సూ॥ త్రివృతమేకే ఘృతం చ

తా॥ కొందఱు మధుపర్కమునకు మూడు వస్తువులనియు మూడవది ఘృతమనియు నందురు.

సూ॥ పాంక్తమేకే ధానాస్సక్తూగ్‌శ్చ

తా॥ మఱికొందఱు వేపుడు బియ్యము, పేలపిండియును కూడ కలిపి యైదందురు.

వరుడు ముందున్న "త్రయ్యై విద్యాయై, ఆమాగన్" అను రెండు మంత్రములతో అభిమంత్రణము చేసి,

మం॥ **త్రయ్యై విద్యాయై యశోఽసి యశసో యశోఽసి బ్రహ్మణో దీప్తిరసి తం మా ప్రియం ప్రజానాం కుర్వధిపతిం పశూనామ్ ॥**

మం॥ **ఆ మా గన్ యశసా వర్చసా సగ్ంసృజ పయసా తేజసా చ । తం మా ప్రియం ప్రజానాం కుర్వధిపతిం పశూనామ్ ॥**

అ॥ త్రయ్యై విద్యాయై = మూడైన వేదములయొక్క; యశః అసి = కీర్తివి అయితివి; యశసః = కీర్తికి; యశః అసి = కీర్తివి అయితివి; బ్రహ్మణః = వేదముయొక్క; దీప్తిః అసి = ప్రకాశింపచేయుదానవు అయితివి; తం మా = అటువంటి నన్ను; ప్రజానాం ప్రియమ్ = ప్రజలకు ఇష్టునిగాను; పశూనామ్ అధిపతిం కురు = పశువులకు అధిపతిగాను చేయుము.

మా॥ త్వమ్ ఆమాగన్ = నీవు వచ్చుచు; యశసా = కీర్తితోడను; వర్చసా = కాంతితోడను; పయసా = క్షీరములతోడను; తేజసా = తేజస్సులతోడను; మా సంసృజ = నన్ను కూర్చుము; తం మా = అటువంటి నన్ను; ప్రజానాం ప్రియమ్ = ప్రజలకు ఇష్టమైన వానినిగాను; పశునామ్ అధిపతిమ్ = పశువులకు అధిపతినిగాను; కురు = చేయుము.

తా॥ ఓ మధుపర్కమా! నీవు మూడువేదములకు కీర్తికలుగజేయుదానవును, కీర్తికి కీర్తినొసగుదానవును, వేదమును ప్రకాశింపచేయుదానవును అయితివి. కావున నన్ను ప్రజలకు ఇష్టమైనవానిగాను, పశువులు మొ॥వి గలవానినిగాను చేయుము.

(కీర్తియనగా గోమధుపర్కముల కర్తవ్యమైన వేదాధ్యయనమని కొందఱందురు.)

తా॥ ((ఓ అర్ఘ్యోదకమా!) ఓ మధుపర్కమా! నీవు వచ్చి నన్ను కీర్తిగల వానిగాను, వర్చస్సు గలవానిగాను, పాడి గలవానిగాను, కాంతి గలవానిగాను, ప్రజలకిష్టునిగాను, పశువులుగల వానినిగాను చేయుము.

మూ॥ యజుర్భ్యామప ఆచామతి । పురస్తాదుపరిష్టాచ్చ "అమృతోపస్తరణమసి..." ఆపః పీత్వా।

తా॥ రెండు యజుర్వేద మంత్రములతో నీరు ఆచమనుముచేయుచున్నాడు. ముందును పైనను

మం॥ **అమృతోపస్తరణమసి ॥**

అ॥ అమృతోపస్తరణమ్ = అమృతముతో సమానములయిన పదార్థములకు ఆధారము, అసి = అయితివి.

తా॥ ఓ జలమా! నీవు అమృతముతో సమానమైన పదార్థములకు ఆధారమయితివి. (ప్రాణదేవతకు దుప్పటిలేక ఆన్తరణముగా నున్నావు.)

మం॥ **ఆపః పీత్వా॥ ద్విరాచమ్య । ఉత్తరయాత్రిః ప్రాశ్య । (సకృన్మంత్రేణ ద్విస్తూష్ణీం.)**

తా॥ పై మంత్రము చెప్పి నీరుత్రాగి, రెండుసార్లు ఆచమనము చేసి ఉత్తర (ముందు) మంత్రము అనగా 'యన్మధునః' అను మంత్రము నొకసారి చెప్పి మధుపర్కమును (సకృత్ ప్రాశ్య = ఒకసారి ప్రాశనముచేసి అని కొందఱు.) మూడు సార్లు ప్రాశనము చేసి అని కొందఱు. సకృన్మంత్రేణద్విస్త్వాం అనుటచే ఇచ్చట మంత్రతః ప్రాశననొకసారి, తూష్టీం ప్రాశన రెండుసార్లు చేయవలెను.

మం॥ **యన్మధునో మధవ్యం పరమమన్నాద్యం వీర్యమ్ । తేనాహం మధునో మధవ్యేన పరమేణాన్నాద్యేన వీర్యేణ పరమోఽన్నాదో మధవ్యోఽసాని**

మూ॥ యన్మధునో మధవ్యం పరమ మన్నాద్యం వీర్యం ।
తేనాహం మధునా మధవ్యేన వీర్యేణ పరమోన్నాదో మధవ్యోఽసాని ॥

అ॥ మధునః = తేనెయొక్క; యత్ = ఏ; పరమమ్ = ఉత్కృష్టమైనదియు; అన్నాద్యమ్ = అన్నమును హరింపజేయునదియు; వీర్యమ్ = బలకరమయినదియునై యున్నదో; తేన పరమేణ = అటువంటి ఉత్కృష్టమైనదియు; అన్నాద్యేన = అన్నమును హరింపజేయునదియు; వీర్యేణ = బలకరమైనదియు నగు; మధునః = తేనెయొక్క; మధవ్యేన = మధుత్వముచేత; అహం పరమః = నేను ఉత్కృష్టమైన; అన్నాదః = అన్నమును తినువాడను, మధవ్యః = అందరిచేత గోరదగినవాడను; అసాని = అయ్యెదను.

తా॥ అన్నమును జీర్ణము చేయునదియు, బలకరమైనదియు, ఉత్కృష్టమైనదియునగు తేనెయొక్క మధుత్వముచేత నేనును ఉత్కృష్టమగు, అన్నమును భక్షించువాడను, అందరిచే గోరబడదగిన వాడను అయ్యెదను.

(దాత వరుని చేతియందు ఈ మధుపర్కము నుంచుట ఆచారము సరియైనదికాదు.)

మూ॥ "అమృతా పిధానమసీత్యపః పీత్వా" అనుమంత్రముతో నీరుత్రాగి

మం॥ అమృతాపిధానమసి ॥

అ॥ అమృతా పిధానం = అమృతరూపమగు మధుపర్క ద్రవ్యముకు నీవు మాతవు; అసి = అయితివి. అని నీరుత్రాగి

మూ॥ హస్తం ప్రక్షాళ్య । ద్విరాచమ్య ।

అ॥ చేయి కడుగుకొని రెండుసార్లు ఆచమనము చేయవలెను. (చేసి)

## మధుపర్కప్రాశనము

ప్రారంభోవరణం యజ్ఞే సంకల్పో వ్రతసత్రయోః

నాందీముఖం వివాహాదౌ అనుటచే దీక్షాప్రారంభము మధుపర్కప్రాశనతోగాని తదంగముగా నీయబడుచు మధుపర్కములనే వ్యవహారము గల వస్త్రధారణచే దీక్షారంభము కాగూడదు. నాందీముఖ ప్రభృతి జాతాద్యాశౌచముండదుగాన జాతాద్యాశౌచాభావ ప్రయోజకము నాందీముఖము.

మూ॥ అనుకంప్యాయ ప్రయచ్ఛేత్ ।

సూ॥ ప్రతిగృహ్యైవ రాజా స్థపతిర్వా పురోహితాయ । గౌరితి గాం ప్రాహ ॥ యద్యుత్సృ-జేదుపాంగ్‌శూత్తరాన్ జపిత్వా ॥

తా॥ ప్రతిగృహీత తనకు దయాపాత్రులైన శూద్రాది సేవకులకు మధుపర్కశేషము నీయవలెను. (సూత్రభాష్యము)

క్షత్రియులుగాని, వైశ్యులుగాని ప్రతిగ్రహీతలగుచో నామధుపర్కశేషము తీసికొని పురోహితుని కీయవలెను. పిమ్మట దాత 'గౌః' అని గోవును చూడవలెను. గోవును విడిచి పెట్టుటనే కోరినచో వరుడు ఈక్రింది మూడు మంత్రములను మెల్లగా జపము చేయవలెను.

మం॥ **(గౌః) గౌరస్యపహతపాప్మాఽప పాప్మానం జహి మమ చాముష్య చ॥**

**ఇతి స్వదాతృ నామ్నోరితి షష్ఠ్యంతయోః నిర్దేశః । శ్రీరామశర్మణో మమ చ । కేశవశర్మణోఽముష్య చ ॥**

అ॥ గౌః = ఓ ధేనువా! త్వం = నీవు; అపహతపాప్మా = నశింపఁజేయబడిన పాపము గలదానవు; అసి = అయితివి; మమ చ అముష్య చ = నాయొక్కయు మధుపర్కదాతయొక్కయు; పాప్మానమ్ అపజహి = పాపమును పోగొట్టుము.

తా॥ ఓ ధేనువా! నీవు నిర్దోషురాలవు. కాన నాయొక్కయు, మధుపర్క దాతయొక్కయు పాపమును నశింపఁజేయుము – అని తనయొక్క దాతయొక్క అని షష్ఠ్యంతము నిర్దేశము, శ్రీరామశర్మ యైన నా యొక్కయు, కేశవశర్మయగు వీనియొక్కయు అని అర్థము.

మం॥ అగ్నిః ప్రాశ్నాతు ప్రథమస్స హి వేద యథా హవిః । అనష్టమస్మాకం కృణ్వన్బ్రాహ్మణో బ్రాహ్మణేభ్యః ॥

అ॥ ప్రథమః = మొదటివాడగు; అగ్నిః = అగ్నిదేవుడు; ప్రాశ్నాతు = భక్షించుగాక; బ్రాహ్మణేభ్యః = బ్రాహ్మణులకంటె; బ్రాహ్మణః = బ్రాహ్మణుడైన; స హి = ఆ దేవుడు; అస్మాకమ్ = మాకు అనష్టమ్ = నష్టము లేకపోవుటను; కృణ్వన్ = చేయుచు; హవిః = ఆజ్యాది హవిస్సు; యథా = ఏరీతిగానుండునో; వేద = తెలిసికొనును.

తా॥ దేవతలలో మొదటి వాడును, బ్రాహ్మణులలో నధికుడును అగు అగ్నిదేవుడు మాకు నష్టము చేయక ఆజ్యాది హవిస్సు ఏరీతిగనుండునో తెలిసికొని భక్షించును.

మం॥ **యజ్ఞో వర్ధతాం యజ్ఞస్య వృద్ధిమను వర్ధాఽపచితిరస్యపచితిం మా కుర్వపచితోఽహం మనుష్యేషు భూయాసమ్ ॥**

అ॥ యజ్ఞః = పూజాస్వరూపమైన యజ్ఞము; వర్ధతామ్ = వృద్ధిపొందుగాక; యజ్ఞస్య = యజ్ఞము యొక్క; వృద్ధిమను = వృద్ధిననుసరించి; వృద్ధ = వృద్ధిపొందుము; అపచితిః = పూజకుసాధనమైన దానవగుటచే పూజనీయమైనదానవు; అసి = అయితివి; మామ్ = నన్ను; అపచితిమ్ = పూజార్హునిగా; కురు = చేయుము; అహమ్ = నేను; మనుష్యేషు = మనుష్యులయందు; అపచితః = పూజనీయుడను; భూయాసమ్ = అయ్యెదను.

తా॥ ఓ ధేనువా! నీ సంబంధమైన పూజవృద్ధిపొందుగాక; ఆ పూజవృద్ధిపొందిన పిమ్మట పూజనీయ మైన నీవును వృద్ధిపొందుము; నీవు నన్ను పూజనీయునిగా జేసితివేని మనుష్యులలో నేను పూజార్హుడ నయ్యెదను.

మం॥ **గౌర్ధేనుభవ్యా మాతా రుద్రాణాం దుహితా వసూనాగ్ం స్వసాఽఽదిత్యానామమృతస్య నాభిః । ప్రణువోచం చికితుసే జనాయ మా గామనాగామదితిం వధిష్ఠ । పిబతూదకం తృణాన్యత్తు ।**

అ॥ గౌః = ఈ యావు; ధేనుభవ్యా = యోగ్యమైన ఆవు అయ్యేని; రుద్రాణామ్ = ఏకాదశ రుద్రులకు; మాతా = తల్లియు; వసూనామ్ = అష్టవసువులకు; దుహితా = కుమార్తెయు; ఆదిత్యానామ్ = ద్వాదశాదిత్యులకు; స్వసా = తోబుట్టువును; అమృతస్య = అమృతమునకు; నాభిః = ప్రధానమైన అవయవమయ్యేని; చికితుషే = ఏమియు తెలియనట్టి; జనాయ = మనుష్యుని కొఱకు; ప్రణువోచమ్ = మిక్కిలి చెప్పుచున్నాను; అనాగామ్ = నిర్దోషమైనదియు; అదితిమ్ = హింసింపగూడనిదియునగు; గాం = ఆవును లేక ఎద్దును; మా వధిష్ఠ = వధింపకుడు.

అ॥ ఉదకమ్ = జలమును; పిబతు = త్రాగుగాక; తృణాని = ఘాసములను; అత్తు = భక్షించుగాక!

తా॥ యోగ్యమైన ఈధేనువు యజ్ఞమందు సమస్తమైన దేవతలు పొందదగిన ఆజ్యాదిహవిస్సును ఒసగునదౌటచే రుద్రులకు తల్లియై, అష్టవసువులకు కుమారికయై, ఆదిత్యులకు చెల్లెలై, అమృతమునకు ఆధారమై యున్నది. కాన నిర్దోషమైనదియు, పరులకు హింసచేయనదియునైన యట్టి ధేనువును బాధపెట్టగూడదని యవివేకులకు మిక్కిలి చెప్పుచున్నాను. ఆవు స్వేచ్ఛగా గడ్డితినుగాక; నీటిని త్రాగుగాక!

మూ॥ ఓముత్సృజత । ఉచ్చైః ।

తా॥ ఆవును విడువుడు అని బిగ్గరగా వరుడు పలుకవలయును.

మూ॥ అన్నం ప్రోక్తముపాగ్ం శూక్తైరభిమంత్ర్య ।

మం॥ **(దాతా) భూతం**

**(వరః) సావిరాట్ । తన్మాక్షాయి । తస్య తేఽశీయ । తన్మ ఊర్జం ధాః ।**

తా॥ సిద్ధమై అన్నము సిద్ధమైనది అని పలికి '**సా విరాట్**' అను మంత్రముచే దగ్గరగా అన్నమును అభిమంత్రించి

అ॥ భూతం దాతృవాక్యము సిద్ధముగా ఉన్నది

సిద్ధన్నే తిష్ఠన్ భూతమితి ప్రాహేత దర్శనాద్ర్ధాత్రా సిద్ధమన్నమితి ప్రోక్తమ్ ।

భూతమిత్యాదిపంచభిర్మం త్రైః ప్రతి గ్రహీతా.

ఉపాంశు అభిమంత్ర్య ఓంకల్పయతేత్యుచ్చైః. అనుజానాతి ॥

అనగా లోకములో పాకము సిద్ధము చేయబడినదని యజమాని భోక్తలకు చెప్పగా, వారు వడ్డించుడని అనుజ్ఞ ఇచ్చినట్లు.

ఇచ్చటగూడ దాత ఆగంతుడగు స్నాతకునకు వంటసిద్ధమైనదని నివేదించగా, ఆ వంటను వరుడు భూతమిత్యాది పంచ మంత్రములను, ఉపాంశువుగా చెప్పి, వడ్డించుడనుట.

**వరవచనము**

తా॥ అన్నము వండబడి సిద్ధముగా నున్నది. సా విరాట్. అది చాలా ప్రకాశించుచున్నది.

అ॥ తత్ = ఆ యన్నము; మాక్షాయి = నశింపకుండుగాక; తస్యతే = అటువంటినిన్ను (ద్వితీయార్థమున షష్ఠి) అశీయ = భక్షించెదను. తత్ = అటువంటి నీవు, మే = నా కొఱకు; ఊర్జమ్ = బలమును, ధాః = కల్గఁజేయుము.

తా॥ ఆ యన్నము నశింపకుండుగాక. ఓ యన్నమా! అటువంటి నిన్ను భక్షించెదను. కాన నాకు బలమును గలుగఁజేయుము. ఓం దానిని తీసికొని రండు.

మూ॥ ఓం కల్పయత । ఉచ్చైః । వరం వస్త్రాదిభిర్యథార్హం పూజయేత్ ।

తా॥ వరుడు ఈ వాక్యమును బిగ్గరగా ననవలెను. పెండ్లి కుమారుని నూతన వస్త్రములు మొ॥ వానిచే పూజింపవలెను.

మం॥ **అర్చత ప్రార్చత । యువం వస్త్రాణి పీవసా వసాథే యువోరచ్ఛిద్రామంతవో హ సర్గాః । అవాతిరతమనృతాని విశ్వఋతేన మిత్రావరుణా సచేథే ॥**

**హిరణ్యరూపస్సహిరణ్యసంధృగపాన్నపాత్సేతి హిరణ్యవర్ణః । హిరణ్యయాత్పరియోనేర్నిషద్యా హిరణ్యదా దదత్యన్నమస్మై ॥**

మూ॥ తతస్సుముహూర్తే లగ్నాష్టకచూర్ణికాం చ పఠిత్వా ।

తా॥ పిమ్మట సుముహూర్తమునందు లగ్నాష్టకమును చూర్ణికను పఠించవలెను. (పఠించి)

త్రివిక్రమశర్మగాను తమకుమార్తె పాణిగ్రహణమహోత్సవసమయమందు అల్లునకు మధుపర్క-

ద్వయమున్ను సర్వాభరణములున్ను ఇచ్చి గౌరవించడమైనది. వరుడు ఆ మధుపర్కములను ధరించి ఆచమించి "సభాయై నమః" అని నమస్కరించవలెను.

మూ॥ తతస్సుముహూర్తే చూర్ణికాం మంగళాష్టకాని చ పఠిత్వా ।

తా॥ పిమ్మట సుముహూర్తమందు చూర్ణికయను మంగళసూక్తమును ఈ క్రింది మంగళాష్టకములను పఠించవలెను. (పఠించి)

## లగ్నాష్టకములు

(తతః లోకాచారక్రమేణ మంగళాష్టకాని పఠిత్వా = పిమ్మట లోకాచార క్రమము ననుసరించి మంగళాష్టకమును పఠించి)

శ్లో॥ తదేవ లగ్నం సుదినం తదేవ తారాబలం చంద్రబలం తదేవ ।
విద్యాబలం దైవబలం తదేవ లక్ష్మీపతే! తేఽంఘ్రియుగం స్మరామి ॥

తా॥ అదే లగ్నము; అదే సుదినము; అదే తారాబలము చంద్రబలమును. విద్యాబలము దైవబలము నదియే. ఓ లక్ష్మీవల్లభా! నీరెండు పాదములను స్మరించెదను.

శ్లో॥ శ్రీదేవ్యాస్తనయోశ్శివస్సుఖకరో మిత్రశ్శశీకంపనః
సర్వే తే మునయోఽచలా దశదిశస్సర్పా మృగేంద్రాః ఖగాః ।
సద్యః పుణ్యసరోవరాణి దితిజా స్తీర్థాని కంజానన
శ్చేంద్రో వహ్న్యమరా నదీజలధయః కుర్వంతు వాం మంగళమ్ ॥

తా॥ శ్రీదేవికొడుకు, సుఖకరుడైన శివుడు, సూర్యుడు, చంద్రుడు, వాయువు, మునులందరు, భూమి, దశదిశలు, సర్పములు, మృగరాజులు, పక్షులు, నదులు, పుణ్యసరస్సులు, దైత్యులు, తీర్థములు, బ్రహ్మ, ఇంద్రుడు, అగ్ని, దేవతలు, నదములు, సముద్రములును మీకు మంగళమును గల్గఁ జేయుఁగాక.

శ్లో॥ శ్రీభద్రాచలదివ్యభవ్యశిఖరప్రోత్తుంగ సౌధాంతరే
నిత్యశ్రీమతి సుందరే మణిమయే సింహాసనే భాసురే ।
స్వాసీనస్సహ సీతయా ముదితయా వామాంకవిశ్రాంతయా
శ్రీరామః పరిపూర్ణ శాశ్వత సుఖౌ కుర్యాదిమౌ దంపతీ ॥

తా॥ శ్రీభద్రాచలముయొక్క దివ్యము భవ్యమునగు శిఖరమునందు మిక్కిలి ఎత్తయిన మేడ మధ్య భాగములో నిత్యము సిరిగలదియు, సుందరము, మణిమయము, భాసురమునగు సింహాసనము మీద సంతోషముగలదియు తన ఎడమ తొడపై కూర్చున్నదియునగు సీతతో సుఖముగా కూర్చున్న శ్రీరాముడు ఈ నూత్నదంపతులను పరిపూర్ణ నిత్యసుఖము గలవారినిగాఁ జేయుగాక.

శ్లో॥ శ్రీమద్రత్నకిరీటసుందరతరశ్రీతాండవాడంబర–
శ్శ్రీరంగన్ముఖచంద్రబింబలలిత స్స్వానందమందస్మితః ।

కర్ణశ్రీకరచారుకుండలమణీఖేలత్కపోలస్థల–
శ్రీరామః పరిపూర్ణశాశ్వతసుఖౌ కుర్యాదిమౌ దంపతీ ॥

తా॥ శ్రీమంతమగు రత్నకిరీటముచే మిక్కిలి అందమైనవాడును, శ్రీ తాండవముయొక్క ఆడంబరము గల వాడును, శోభచే ప్రకాశించు ముఖచంద్రబింబముచే లలిత మయిన వాడును, తన ఆనందముచేనైన మందస్మితము గలవాడును, కర్ణశోభను, గల్గించు సుందరమైన కుండల మణులచే క్రీడించు కపోలస్థలముగలవాడును అగు శ్రీరాముడు ఈ నూతనదంపతులను పరిపూర్ణనిత్యసుఖముగల వారినిగాఁ జేయుగాక.

శ్లో॥ విద్యుద్ధారధగద్ధగద్విలసితప్రోద్ధామదామోపమ–
శ్రీహేమాంబరవిస్ఫురత్కటికనత్కల్యాణదామోజ్జ్వలః ।
తాంబూలద్విగుణారుణాధరమణిశ్రీవిశ్వసమ్మోహన
శ్రీరామః పరిపూర్ణశాశ్వతసుఖౌ కుర్యాదిమౌ దంపతీ ॥

తా॥ మెరుపువంటి హారముచే ధగధగమని ప్రకాశించు గొప్పదయిన భూషణముతో సమానమయిన వాడును, శ్రీ పీతాంబరముచే ప్రకాశించు కటిప్రదేశమందు వెలుగు మంగళప్రదమైన సూత్రముచే ఉజ్జ్వలమైనవాడును, తాంబూలముచే రెట్టింపు అరుణమైన అధరమణి గలవాడును, శ్రీవిశ్వమును మోహింపచేయువాడును అగు శ్రీరాముడు ఈ నూతన దంపతులను పరిపూర్ణ నిత్యసుఖముగల వారినిగాఁ జేయుగాక.

సూ॥ సావధానముహూర్తే దైవజ్ఞో ఘటికాయంత్రేణ ముహూర్తం సమ్యగవలోక్య । నక్షత్రమార్గ మవలోక్య ।

తా॥ సావధానముహూర్తమందు జ్యోతిష్కుడు గడియారమున ముహూర్తము సరిగా చూడవలెను. (చూచి) నక్షత్రమార్గమును చూడవలెను. (చూచి)

చూర్ణికా

మూ॥ స్వస్త్యష్టాశీతి సహస్రాణాం ద్విజగురుదైవత్యానాం
సమస్తజగదాధారమహామండూకకూర్మయజ్ఞవరాహశేషపృథివీనాం
పురందర పావకయమనిర్‌ఋతి వరుణ వాయు కుబేర ఈశానాద్యష్ట దిక్పాలకానాం
జలజభవ హరిహర ముఖ్య దేవగణానాం
నారద విశ్వామిత్ర పరాశరాత్రి వాల్మీకి గౌతమ భృగువ్యాసాది మహర్షీణాం – 1

తా॥ శుభమగుగాక, ఎనుబదియెనిమిది వేల ద్విజగురు దేవతలకును; సమస్త జగముల కాధారమైన మహామండూక, కూర్మ, యజ్ఞవరాహ, శేష, పృథివులకును ; ఇంద్రుడు, అగ్ని, యముడు, నిర్‌ఋతి, వరుణుడు, వాయువు, కుబేరుడు, ఈశానుడు అను అష్టదిక్పాలకులకును ; బ్రహ్మ, హరి, హరుడు మొదలైన దేవగణములకును ; నారదుడు, విశ్వామిత్రుడు, పరాశరుడు, అత్రి, వాల్మీకి, గౌతముడు, భృగువు, వ్యాసుడు మొ॥ మహర్షులకును;

మూ॥ సీతారుంధత్యహల్యాద్రౌపదీతారామండోదరీ పాంచాలీ దమయంత్యాది మహా పతివ్రతానాం, రామ శిబి రంతిదేవ పృథు మరుద్భగీరథ భరత శశిబిందు గజాంబరీష దిలీప పరశురామ, బలరామాది షోడశ చక్రవర్తినాం,
కార్తవీర్యర్జున సగర పురూరవ పురుకుత్స నల హరిశ్చంద్రాభిధానాం షట్చక్రవర్తినాం,
విక్రమార్క భోజరాజాది పుణ్యపురుషాణాం,

తా॥ సీత, అరుంధతి, అహల్య, ద్రౌపది, తార, మండోదరి, పాంచాలి, దమయంతి మొ॥ మహా పతివ్రతలకును ; రాముడు, శిబి, రంతిదేవుడు, పృథువు, మరుత్తు, భగీరథుడు, భరతుడు, శశిబిందువు, గజుడు, అంబరీషుడు, దిలీపుడు, పరశురాముడు, బలరాముడు మొ॥ షోడశ చక్రవర్తులకును ; కార్తవీర్యార్జునుడు, సగరుడు, పురూరవుడు, పురుకుత్సుడు, నలుడు, హరిశ్చంద్రుడు అను పేర్లుగల షట్చక్రవర్తులకును; విక్రమార్కుడు, భోజరాజు మొ॥ పుణ్యపురుషులకును

మూ॥ గంగా నర్మదా తుంగభద్రా మలాపహారిణీ శ్రీకృష్ణవేణీ గోదావరీ భీమరథ్యాది మహానదీనాం,

తా॥ గంగ, నర్మద, తుంగభద్ర, మలాపహారిణి, శ్రీకృష్ణవేణి, గోదావరి, భీమరథి మొ॥ మహానదుల కును

జంబూ నింబ కదంబ చూతక్రముక నారికేళ ఖర్జూర ధాత్రీ దాడిమ్యాది ఫలవృక్షాణాం

తా॥ నేరేడు, నిమ్మ, కడిమి, మామిడి, పోక, కొబ్బరి, ఖర్జూరము, (ధాత్రి) ఉసిరి, దానిమ్మ మొ॥ ఫలవృక్షములకును

పున్నాగ జాతీ వకుళ కేతకీ చంపక మల్లికా మాధవీ మాలత్యాది వివిధ కుసుమానాం,

తా॥ పున్నాగము, జాజి, పొగడ, మొగలి, సంపెంగ, మల్లె, మాధవి, మాలతి మొదలగు వివిధ పుష్పములకును

కస్తూరి కుంకుమాగరు గోరోచనాది సుగంధానాం,

తా॥ కస్తూరి, కుంకుమ పువ్వు, అగరువు, గోరోచన మొ॥ సుగంధములకును

అపరిమిత కనక కలశ కన్యకా గృహమేధి కవీశ్వర వీణాది వాద్య మేఘ ధ్వనీనాం,

తా॥ అపరిమితములైన కనకకలశములకు, కన్యకలకు, గృహస్థులకు, కవీశ్వరులకు, వీణాది వాద్యములకు, మేఘధ్వనులకును

అయోధ్యా కాశీ పురుషోత్తమ రామేశ్వరాది పుణ్యనగరీణాం,

తా॥ అయోధ్య, కాశి, పురుషోత్తమము, రామేశ్వరము మొ॥ పుణ్య నగరములకును

శ్రీశైల వింధ్య హిమాచల గోవర్ధనకైలాసాది మహాశైలానాం,

తా॥ శ్రీశైలము, వింధ్యము, హిమాచలము, గోవర్ధనము, కైలాసము మొ॥ మహాపర్వతములకును

తర్కమీమాంసా న్యాయ వైశేషిక భాట్టప్రాభాకర వ్యాకరణాది షట్ఛాస్త్రాణాం,

తా॥ తర్కము, మీమాంస, న్యాయము, వైశేషికము, భాట్టప్రాభాకరము, వ్యాకరణము మొ॥ షట్ఛాస్త్రములకును

ఋగ్యజు స్సామాథర్వణ వేదానాం

తా॥ ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణ వేదము అను నాల్గు వేదములకును

లగ్నహోరా ద్రేక్కాణ నవాంశద్వాదశాంశ త్రింశదశాంశకానాం ప్రసాదేన నిరంతరమనుకూలా-శ్శుభాశ్శోభనాః

తా॥ లగ్నము, హోరా, ద్రేక్కాణము, నవాంశము, ద్వాదశాంశము, త్రింశదంశాంశములయొక్క అనుగ్రహముచేత, నిరంతరము అనుకూలములును, శుభములును, శోభనములునై

అస్య ముహూర్తస్య = ఈ ముహూర్తమునకు

సుతిథిం = మంచి తిథిని

సువారం = మంచి వారమును

సునక్షత్రం = మంచి నక్షత్రమును

సుయోగం = మంచి యోగమును

సుకరణం = మంచి కరణమును

సుచంద్ర తారాబలమ్ = మంచి చంద్రతారాబలమును

అనుకూలం = అనుకూలముగా జేసి

శుభశోభనాస్సర్వే గ్రహాః= శుభములు శోభనములునయి అన్ని గ్రహములును

సునక్షత్రాః = మంచినక్షత్రములుగలవై

శుభైకాదశస్థానఫలదాః= శుభమైన ఏకాదశస్థాన ఫలము నిచ్చునవై

సుప్రీతాః = మంచి ప్రీతిగలవై

సుముహూర్తాః = సుముహూర్తములుగలవై

సుప్రసన్నాః = సుప్రసన్నతగలవై

వరదాః = వరములనిచ్చునవై

భవంతు = అగుగాక.

మూ॥ సుముహూర్తే వధూవరయోశ్శిరసోః అన్యోన్యం సజీరకగుడం నిక్షేపేతామ్ ॥

తా॥ సుముహూర్తమందు వధూవరుల తలమీద జీలకఱ్ఱతోగూడిన బెల్లమును ఉంచవలయును.

మం॥ **ధ్రువం తే రాజా వరుణో ధ్రువం దేవో బృహస్పతిః ।**
**ధ్రువం త ఇంద్రశ్చాగ్నిశ్చ రాష్ట్రం ధారయతామ్ ॥**

**ధ్రువం ధ్రువేణ హవిషా । తస్మై దేవా అధిబ్రువన్ ।**
**అయం చ బ్రహ్మణస్పతిః । ధ్రువా ద్యౌర్ధ్రువా పృథివీ ।**
**ధ్రువం విశ్వమిదం జగత్ । ధ్రువా హి పర్వతా ఇమే**
**ధ్రువో రాజా విశామయమ్ । ఇహైవైధి మా వ్యధిషాః**
**పర్వత ఇవావిచావలిః । ఇంద్ర ఇవేహ ధ్రువస్తిష్ఠ ।**
**ఇహ రాష్ట్రముధారయ । అభి తిష్ఠ పృతన్యతః ॥**
**అధరే సంతు శత్రవః । ఇంద్ర ఇవ వృత్రహా తిష్ఠ ।**
**అపః క్షేత్రాణి సంజయన్ । ఇంద్ర ఏణమదీధరత్ ।**
**ధ్రువం ధ్రువేణ హవిషా । తస్మై దేవా అధిబ్రువన్ ।**
**అయం చ బ్రహ్మణస్పతిః ॥**

అ॥ హే రాజన్ = ఓరాజా! తే = నీయొక్క; రాష్ట్రమ్ = రాష్ట్రమును; రాజా = ప్రకాశించుచున్న; వరుణః = వరుణుడు; ధ్రువమ్ = స్థిరముగా; ధారయతామ్ = పోషించుగాక; దేవః = దానాదిగుణయుక్తుడైన; బృహస్పతిః = బృహస్పతి; ధ్రువమ్ = స్థిరముగా; ధారయతి = ధరించుగాక; ఇంద్రశ్చ అగ్నిశ్చ = ఇంద్రుడు అగ్ని యిర్వురున్ను; తే = నీ యొక్క; రాష్ట్రమ్ = రాష్ట్రమును; ధ్రువమ్ = స్థిరముగా; ధారయతామ్ = పోషింతురుగాక; ధ్రువేణ = స్థిరమైన; హవిషా = శాస్త్రప్రకారము ఆచరింపబడిన హోమముచేత; దేవాః = దేవతలు (సంతుష్టులై); తస్మై = ఆ యజమానునకు; ధ్రువమ్ = స్థిరముగా; అధిబ్రువన్ = ఇతడధికుడని చెప్పుదురుగాక; అయమ్ = ఈ; బ్రహ్మణస్పతిః చ = ఈ బృహస్పతికూడ ఇతడధికుడని చెప్పునుగాక; యథా = ఏవిధముగా; ద్యౌః = స్వర్గము; ధ్రువా = స్థిరమయినదో; పృథివీ = భూమి; ధ్రువా = స్థిరమైనదో; ఇదమ్ = ఈ; విశ్వం జగత్ = సర్వప్రపంచము; ధ్రువమ్ = స్థిరమయి యున్నదో; ఇటులనే, అయమ్ = ఈ; విశాం రాజా = ప్రజలయొక్క రాజు; ధ్రువః = స్థిరముగా ఉందుగాక; హే రాజన్ = ఓ రాజా! ఇహైవ = ఈ రాష్ట్రములోనే; ఏధి = స్థిరముగా ఉండుమా! మా వ్యధిష్ఠాః = భయమును పొందకుమా! పర్వత ఇవ = పర్వతమువలె; అవిచావలిః = నిశ్చలుడవై యుండుమా! ఇంద్ర ఇవ = ఇంద్రుని వలె (ఇంద్రుడెట్లు ద్యులోకములో స్థిరముగా ఉన్నాడో) ధ్రువః = స్థిరుడవై; తిష్ఠ = ఉండుము; ఇహైవ = ఈ రాష్ట్రములోనే యుండి; రాష్ట్రమ్ = రాష్ట్రమునంతను; ధారయ = పోషింపుమా! పృతన్యతః = మాపట్ల విరోధముగల సేనను తమకు అపజయమును కోరుచున్న ఆ శత్రువులను; అభితిష్ఠ = ఆక్రమణముచే నిగ్రహించి స్థిరముగా నుండుము; శత్రవః = శత్రువులు; అధరే సంతు = నీకంటె క్రిందుగా ఉందురుగాక! వృత్రహా ఇవ = ఇంద్రుని వలె; తిష్ఠ = శత్రుహంతకుడవై యుండుమా! అపః = సస్యములకు ఉపయోగపడెడు జలములను; క్షేత్రాణి చ = క్షేత్రములనున్ను; సంజయన్ = మంచి జయమును గల్గించుచు ఉండుము. ఇంద్రః = ఏయీ యింద్రుడున్నాడో, అతడు; ఏణమ్ = ఈ రాజును; అదీధరత్ = స్థిరుడై యుండునట్లు

ధరించుగాక! ధ్రువేణ = స్థిరమైన; హవిషా = శాస్త్రప్రకారము చేయబడిన హోమముతో; దేవాః = సంతుష్టులై దేవతలు; తస్మై = ఆ యజమానునకు; అధిబ్రువన్ = ఇతడధికుడని చెప్పుదురుగాక! అయమ్ = ఈ; బ్రహ్మణస్పతిః చ = బ్రహ్మణస్పతిగూడ ఇతడధికుడని చెప్పునుగాక.

తా॥ రాజయిన వరుణుడు నీకు ధ్రువపదమును ఇచ్చుగాక. దేవుడైన బృహస్పతి నీకు ధ్రువపదము నిచ్చుగాక. నీరాష్ట్రమును ఇంద్రాగ్నులు ధ్రువముగా ధరింతురుగాక. ధ్రువమైన హవిస్సుచేత ధ్రువపదమగుగాక. దేవతలు అతనికిట్లు అనిరి – ఇతడే బృహస్పతి. ఆకాశము ధ్రువమైనది. భూమి ధ్రువమయినది. ఈ సమస్తప్రపంచము ధ్రువమైనది. ఈ పర్వతములు ధ్రువమైనవి. ఈ పక్షిరాజు ధ్రువమైనవాడు. ఇక్కడే వృద్ధి పొందుము. వ్యధనొందకుము. పర్వతమువలె చలింపక యుండుము. ఇక్కడ రాష్ట్రమును ధరింపుము. నీవు ముందుగానుండుము. నీశత్రువులు క్రిందుగా నుందురుగాక. ఇంద్రునివలె శత్రుహంతవై యుండుము. (వృత్రహంతయైన) ఇంద్రునివలె నుండుము. నీళ్ళను, క్షేత్రములను వృద్ధిపొందిపఁజేయుచు ఇంద్రుడు దీనిని ధరించెను. ధ్రువమైన హవిస్సుచేత ధ్రువముగా నుందువుగాక. బ్రహ్మణస్పతి యితడే.

మూ॥ అయం ముహూర్తస్సుముహూర్తోఽస్తు ॥

తా॥ ఈ ముహూర్తము సుముహూర్తమగుగాక.

## సుముహూర్తము

మంచి ముహూర్తము అనగా తారాబలము. చంద్రబలము, లగ్నబలము గల సమయము. అపుడు “అఘోరచక్షురితి” అఘోరచక్షుః అనెడు మంత్రముతో కన్య అవయవములను చూడ వలయును. ఇదే సమయమున జీలకఱ్ఱ – బెల్లము కలిపి వధూవరులు ఒకరి శిరస్సునందు ఒకరు పెట్టుటయు సంప్రదాయమున్నది. ప్రమాణము గోచరించుటలేదు. పూర్వకాలము నుండి వచ్చునట్టి సాంప్రదాయము ననుసరింపవలయునే కాని విడువకూడదు.

మూ॥ తతస్సుముహూర్తే కన్యాం స్వయందృష్ట్వా తృతీయాం జపేత్ । అభ్రాతృఘ్నీమితి జపిత్వా ॥

తా॥ పిమ్మట సుముహూర్తమందు కన్యను చూచి ‘‘అభ్రాతృఘ్నీం’’ అను మంత్రమును జపింపవలయును. (జపించి)

మం॥ **అభ్రాతృఘ్నీం వరుణాపతిఘ్నీం బృహస్పతే । ఇంద్రా పుత్రఘ్నీం లక్ష్మ్యం తామస్యై సవితస్సువ॥**

అ॥ హే వరుణ! = ఓ వరుణుడా! లేక లోకులచే కోరికలడుగబడు పరమాత్మా ! అభ్రాతృఘ్నీమ్ = తోడబుట్టినవారిని చంపనియట్టి; లక్ష్మ్యమ్ = లక్ష్మిని; సువ = ఇమ్ము. హే బృహస్పతే! = ఓ బృహస్పతీ లేక యోగులను పాలించు పరమాత్మా ! అపతిఘ్నీం = భర్తను చంపనియట్టి; లక్ష్మ్యమ్ = లక్ష్మిని; సువ = ఇమ్ము. హే ఇంద్ర = ఓ ఇంద్రుడా! లేక పరమైశ్వర్యముగల భగవంతుడా! అపుత్రఘ్నీమ్ = పుత్రులను జంపనియట్టి; లక్ష్మ్యమ్ = లక్ష్మిని; సువ = ఇమ్ము;

హే సవితః = ఓ సూర్యుడా! లేక సృష్టికర్తవగు పరమాత్మా! తాం లక్ష్మ్యమ్ = ఆ లక్ష్మిని అనగా భ్రాతలను, పతిని, పుత్రులను చంపనియట్టి లక్ష్మిని; సువ = ఇమ్ము.

తా॥ ఓ వరుణ! నీవు ఈమెకు సోదరులను జంపనియట్టి లక్ష్మినిమ్ము. ఓ బృహస్పతీ! నీవు ఈమెకు భర్తను జంపని లక్ష్మినిమ్ము. ఓ ఇంద్రుడా! నీవు ఈమెకు పుత్రులను జంపని లక్ష్మినిమ్ము. ఓ సూర్యుడా! నీవీమెకు సర్వలక్ష్మినిమ్ము.

లేక

ఈ కన్యకు భ్రాతృపతిపుత్రనాశనములేని దానినిగా జేయుమని వరుడు దేవప్రార్థన చేయుచున్నాడు.

మూ॥ దృష్ట్వైవ చక్షుషీ ఉపసగ్ంహరతి । చతుర్థ్యా సమీక్షేత

తా॥ వధువునొక్కమాఱు చూచి యూరుకొనవలెను. నాల్గవ ఋక్కు చెప్పి వధూదృష్టియందు తన దృష్టిని ప్రసరింపజేయవలెను.

మం॥ **అఘోరచక్షురపతిఘ్న్యేధి శివా పతిభ్యస్సుమనాస్సువర్చాః ॥**
**జీవసూర్దేవకామా స్యోనా శం నో భవ ద్విపదే చతుష్పదే ॥**

అ॥ హే వధు = ఓ చిన్నదానా! త్వమ్ = నీవు; అఘోరచక్షుః = సౌమ్యమైన దృష్టిగలదానవును; అపతిఘ్నీ = పతిని జంపనిదానవును; ఏధి = అగుము. సుమనాః = మంచి మనస్సుగల దానవును; సువర్చాః = మంచి తేజస్సుగలదానవును; ఏధి = అగుము. జీవసూః = జీవించెడు సంతానమును కనుదానవును; దేవకామా = దేవతలను (యాగము నిమిత్తము) పరమేశ్వరుని సౌభాగ్యము కోరుదానవు; స్యోనా = ప్రశస్తమైన దానవును; భవ = అగుము ! నః = మాసంబంధమయిన; ద్విపదే = ద్విపాదజంతువులగు మనుష్యులకొఱకును; చతుష్పదే = చతుష్పాద జంతువులగు గోవులు మొ॥వాని కొఱకును; శమ్ = సుఖము కల్గించుదానవు; భవ = అగుము.

తా॥ "ఓ వధువా! సౌమ్యమైన దృష్టికలదానవై భర్తను జంపనిదానవై భర్తకు మఱదులకు శుభము కూర్చుము. ప్రసన్నమైన మనస్సుగల దానవై సువర్చస్సుగల దానవగుము. జీవించిన సంతానమును గనుచు దైవపూజ చేయుచు ప్రశస్తురాలవై నా బంధువులకు నా పశుసంపదకు సుఖమును కూర్చుదానవై యుండుము" అని వరుడు దేవప్రార్థన చేయుచున్నాడు.

మూ॥ ఆవరణ వస్త్రమపాస్య । అత్ర వరవధ్వౌ సంకల్పయతః ।

తా॥ అడ్డుగానున్న తెరను తీసివైచి వధూవరులు సంకల్పించవలెను.

మూ॥ ఆచమ్య ... ... ఓం భూః ... ... శుభతిథౌ అనయోర్దంపత్యోః ఆయుర్వర్చో యశోబలాభి వృద్ధ్యర్థం

తా॥ తిరిగి ప్రాణాయామముచేసి ఓంభూః... ... శుభతిథియందు దంపతులమైన మన యిద్దఱకు ఆయువు, వర్చస్సు, యశస్సు, బలము అభివృద్ధి పొందుటకు.

మూ॥ ఆవాభ్యాం కర్మాణి కర్తవ్యాని । ప్రజాశ్చోత్పాదయితవ్యాః ।

తా॥ మన యిద్దఱము పుణ్య కర్మలు చేయవలయును. సంతానమును గూడ కనవలయును – అని దంపతులనవలెను. వరుడు సాక్షతోదకములను వధూహస్తమందు విడువవలెను.

మూ॥ అంగుష్ఠేనోపమధ్యమయా చాంగుళ్యా దర్భాగ్ం సంగృహ్య । ఉత్తరేణ యజుషా తస్యా భ్రువోరంతరగ్ం సమ్మృజ్య ప్రతీచీనం నిరస్యేతీ ॥

తా॥ వధువునకభిముఖుడై బొటనవ్రేలితోను మధ్యవ్రేలికి ప్రక్కనుండు వ్రేళ్లతోను (ఉంగరపు వ్రేలితోను) దర్భను పట్టుకొని 'ఇదమహం' అను మంత్రమును చెప్పి ఆచిన్నదాని కనుబొమ్మల నడుమను ఆ దర్భతో తుడిచి పడమటగా ఆ దర్భను పార వేయవలెను.

మం॥ **ఇదమహం యా త్వయి పతిఘ్న్యలక్ష్మీస్తాం నిర్దిశామి ॥**

అ॥ హే వధు = ఓ చిన్నదానా! త్వయి = నీయందు; పతిఘ్నీ = పెనిమిటిని చంపునట్టి; యా = ఏ; అలక్ష్మీః = అభాగ్యత; అస్తి = ఉన్నదో; తామ్ = ఆ అభాగ్యమును; అహమ్ = నేను; నిర్దిశామి = తుడిచివేయుచున్నాను; ఇదమ్ = దర్భచేత పెండ్లికూతురియొక్క భ్రూమధ్యమందు తుడుచుటయే అభాగ్యతను తీసివేయుట యగును.

తా॥ ఇదిగో! నేను నీయందున్న భర్తను జంపునట్టి అలక్ష్మిని పోగొట్టుచున్నాను.

మూ॥ ప్రాప్తే నిమిత్త ఉత్తరాం జపేత్ ।

తా॥ కారణము తటస్థించినప్పుడు (అనగా వధువుగాని తత్సంబంధులు గాని వియోగఖేదముచే కన్నీరు నించినప్పుడు) క్రిందిమంత్రమును జపించవలెను.

మం॥ **జీవాగ్ం రుదంతి విమయంతే అధ్వరే దీర్ఘామనుప్రసితిం దీధియున్నరః ।**
**వామం పితృభ్యో య ఇదగ్ం సమేరిరే పతిభ్యో జనయః పరిష్వజే మయః ॥**

అ॥ యే = ఏ నరులు (కన్యకయొక్క బంధుజనులు); దీర్ఘామ్ = గొప్పదయిన; ప్రసితిమ్ = ప్రేమానుబంధమును; (అనయోః) = మాయిద్దరకును; అను దీధియుః = చేయుచున్నారో; పితృభ్యః = పితృదేవతలకొఱకు; వామం = కోరదగినట్టియు; పతిభ్యః = (పత్యుః) భర్తయైన నాకు; మయః = సుఖకరమగునట్టియు; జనయః = ఈ పెండ్లికూతురుయొక్క; పరిష్వజే = ఆలింగనము చేయదగిన; ఇదమ్ = ఈ వివాహకర్మమును; సమేరిరే = ప్రేరణచేసిరో; తే = వారు (కన్యాబంధుజనులు); అధ్వరే = హింసారహితమైన అనగా శుభకరమైన ఈ వివాహ కర్మయందు; జీవామ్ = జీవించియున్న యీ చిన్నదానినిగురించి; రుదంతి = ఏడ్చుచున్నారు. విమయంతే = వ్యత్యయమును చేయుచున్నారు.

తా॥ కన్యావియోగమును గూర్చి దుఃఖించుచున్న బంధువులను సంతోషకరమగు వివాహ సమయ మందు దుఃఖింప వద్దు అని వరుడు కోరుచున్నాడు.

ఈ బంధుజనులు దీర్ఘకాలమువఱకు నుండు మా భావిసంబంధమును ధ్యానింతురుగాక, ఈ పితృదేవతలకు కోరదగినట్టియు భర్తయైన నాకు సుఖకరమగునట్టియు పెండ్లి కూతురునకు ఆలింగనము కొరకైన ఈ వివాహమును ఏ బంధుజనులు ప్రేరేపించిరో !

సూ॥ యుగ్మాస్సమవేతాన్మంత్రవత ఉత్తరీయాఽ ద్భ్యః ప్రహిణుయాత్ ॥

తా॥ సరిసంఖ్యగలిగి తన కార్యమందు దృష్టికల్గినట్టి వేదవేత్తలైన బ్రాహ్మణులను క్రింది మంత్రముచెప్పి పెండ్లికూతునభిషేకించుట కుదకము నిమిత్తము పంపవలెను.

మం॥ **వ్యృక్షత్క్రూరముదచంత్వాప అస్యై బ్రాహ్మణాస్స్నపనగ్ం హరంతు అవీరఘ్నీ రుదచంత్వాపః ॥**

అ॥ క్రూరమ్ = ఉదకసంబంధమైన కలుషత్వము; వ్యృక్షత్ = దూరముగా పోవుగాక; ఆపః = ఉదకములు; ఉదచంతు = మీదికి వచ్చుగాక; అస్యై = ఈ చిన్నదానికి; బ్రాహ్మణా = బ్రాహ్మణులు; స్నపనమ్ = ఉదకమును; స్నానోదకమును; ఆ + హరంతు = తీసికొనివచ్చెదరు గాక. అవీరఘ్నీః = వీరులగు పుత్రులను జంపని; ఆపః = ఉదకములు; ఉదచంతు = మీదికి వచ్చుగాక.

తా॥ కలుషములేని యుదకము నీచిన్నదాని నిమిత్తము బ్రాహ్మణులు తీసికొని రావలసినది.

నీటియందలి క్రూరత్వము పోవుగాక. నీరుపైకి వచ్చుగాక. బ్రాహ్మణులు స్నానార్థమై నీరు తెత్తురుగాక. నీరు వీరులైన పుత్రులను జంపకపోవుగాక.

సూ॥ ఉత్తరేణ యజుషా తస్యాశ్శిరసి దర్భేణ్వం నిధాయ ॥

తా॥ క్రింది యజస్సు చెప్పి ఆ చిన్నదాని శిరస్సు మీద దర్భలచే చుట్టిన కడియమునంచవలెను. (ఇణ్వమనగా 20 దర్భలను 5 దర్భలచే వలయాకారముగా చుట్టునది.)

మం॥ **అర్యమ్ణో అగ్నిం పరియంతు క్షిప్రం ప్రతీక్షంతాగ్ం శ్వశ్ర్వో దేవరాశ్చ ॥**

అ॥ శ్వశ్ర్వః = అత్తగార్లు అనగా మాయిద్దఱ యొక్క తల్లులును; దేవరాశ్చ = బావమఱదులును అనగా మా యిద్దఱియొక్క తోబుట్టువులును, అర్యమ్ణః = సూర్యునియొక్క లేక సర్వవ్యాపకుడగు భగవంతునియొక్క; (ప్రసాదాత్ = అనుగ్రహమువలన) అగ్నిమ్ = వివాహసంబంధమయిన అగ్నిని; క్షిప్రమ్ = శీఘ్రముగా; పరియంతు = చుట్టునావరించి యుందురుగాక; ప్రతీక్షంతామ్ = చల్లారకుండునట్లు జాగరూకతచే చూచుచుందురుగాక.

తా॥ సూర్యుని దయవలన శీఘ్రముగా మాయిరువురి యత్తలును, మామలును, సోదరులును ఈ వివాహాగ్ని చుట్టునుండి చూతురుగాక.

సూ॥ తస్మిన్నుత్తరయా దక్షిణం యుగచ్ఛిద్రం ప్రతిష్ఠాప్య ।

తా॥ ఆ కడియమందుత్తరమంత్రము చెప్పి బండికాడియొక్క దక్షిణపు తొలను (రెండు తొలలున్నచో కొసది) ఉంచవలెను.

మం॥ **ఖేஉనస్తః ఖేరథః ఖేయుగస్య శచీపతే । అపాలామింద్రః త్రిః పూర్త్యకరత్సూర్యవర్చసమ్ ॥**

అ॥ హే శచీపతే! = శచీదేవికి పతియైన ఓ యింద్రా! త్వమ్ = నీవు; అనసః = బండియొక్క; రథః = రథముయొక్క; ఖే = రంధ్రమందును; యుగస్య = కాడియొక్క; ఖే = రంధ్రమందును; త్రిః = ముమ్మారు; పూర్త్వీ = ఉదకమును శోధనచేసి; ఆనీటితో; అపాలా = అపాలా అనుకన్యను; సూర్యవర్చసమ్ = సూర్యుని తేజస్సువంటి తేజస్సుగల దానినిగా అకరత్ (అకర్తత్) = చేసితివి.

తా॥ ఓ శచీపతీ! ఇంద్రా! నీవు బండి రంధ్రమునందును, రథముయొక్క రంధ్రమందును; కాడి రంధ్రమందును మూడుసార్లు నీటిని పవిత్రముచేసి అపాల యను కన్యను సూర్యవర్చస్సుగల దానినిగా చేసితివి. అట్లే ఈమెనుగూడ జేయుము.

**అపాల పూర్వగాథ**

శ్వేత కుష్ఠురోగముగల అపాల యనునామె పెండ్లికాక యింద్రుని పూజించవలెనను కోరికతో నుండునది. ఒకనాడు స్నానమునకు పోయి నదిలో కొట్టుకొనిపోయి అందులో కొట్టుకొనివచ్చు సోమలతను కొఱికి ఆ రసమును ఇంద్రుని కర్పించెను. అది త్రాగి యింద్రుడు బండి రథము కాడి రంధ్రములందు నీటిని వెడలించి వాటితో మూడుసార్లు శుద్ధిచేసి సూర్యుని వర్చస్సు గల దానినిగా జేసెనని 'కన్యనాయతి' అను వర్గములో బహ్వృచులు చెప్పుచున్నారు.

సూ॥ ఛిద్రే సువర్ణముత్తరయాంతర్ధాయ ॥

తా॥ ఆరంధ్రమందు బంగారమును ఈక్రింది ఋక్కు చెప్పి ఉంచి పట్టుకొనవలెను. అనగా 'శం తే సువర్ణం' అను మంత్రముచే కాడిచిల్లులో బంగారమును గప్పి పట్టుకొనవలెను.

మం॥ **శం తే హిరణ్యగ్ం శముసంత్వాపశ్శం తే మేధీ భవతు శం యుగస్య తృద్మ । శంత ఆపశ్శతపవిత్రా భవంత్వథాపత్యా తన్వగ్ం సగ్ంసృజస్వ ॥**

అ॥ హే వధు! = ఓ చిన్నదానా! తే = నీకు; హిరణ్యమ్ = బండికాడియొక్క రంధ్రమందుంచిన బంగారము; శం = సుఖకరము అగుగాక. ఆపః = ఉదకములు సుఖకరములు; సంతు = అగుగాక. (సం + ఉ); మేధీ = కళ్లముమధ్యపాతినకట్ట, తే = నీకు; శమ్ = సుఖకరము; భవతు = అవుగాక; శతపవిత్రాః = అనేకవస్తువులను పవిత్రము చేసెడు; ఆపః = ఉదకములు; తే = నీకు; శం = సుఖకరములు; భవంతు = అగుగాక. అథ = అటుపిమ్మటను; ఆపత్యా = పతియైన నాతోడ; తన్వమ్ = నీ యొక్క దేహమును; సంసృజస్వ = కలుపుము.

తా॥ బండికాడియొక్క రంధ్రమందుంచబడిన బంగారము మీదుగా ప్రసరించిన యుదకంబుచేత పవిత్రమైన యీ కన్యకయొక్క దేహము ఆలింగనమున కర్హమగునని వరుడు కోరుచున్నాడు. (ఈ బంగారము నీకు సుఖకరమగుగాక. నీరు నీకు సుఖకరమగుగాక. కళ్లమందలి

పశువులకట్టుకట్ట నీకు సుఖకరమగుగాక. కాడి రంధ్రము నీకు సుఖకరమగుగాక. వందలకొలది మందిని పవిత్రముచేయు నీళ్ళు నీకు సుఖకరమగుగాక. పవిత్రురాలవగు నీవు పతినైన నాతో నీశరీరమును జేర్పుము.)

## యుగచ్ఛిద్రాభిషేకము

యుగమనగా బండికాడి. దానియొక్క ఛిద్రమునందు బంగారము నుంచి దాని మీదుగా వధువుయొక్క శిరస్సునందు "హిరణ్యవర్ణా" ఇత్యాది మంత్రముతో అభిషేకము చేయుట. దీనివలన కన్యశరీరముయొక్క వివర్ణత పోయి సురూపమేర్పడును.

సూ॥ ఉత్తరాభిః పంచభిస్స్నాపయిత్వా ।

తా॥ క్రింది యైదు మంత్రములను చెప్పి కొస కొక్కమారే అభిషేకించవలెను (స్నానము చేయించవలెను.)

### జలసూక్తమ్ - 1-33 అథర్వవేద సంహితా

మం॥ **హిరణ్యవర్ణాశ్శుచయః పావకాః ప్రచక్రముర్ హిత్వాఽవద్య మాపః ।**
**హిరణ్యవర్ణాశ్శుచయః పావకాః యాసు జాతః కశ్యపో యాస్వగ్నిః ।**
**యా అగ్నిం గర్భం దధిరే సువర్ణాస్తాస్త ఆపశ్శగ్గ్ం స్యోనా భవంతు ॥**
**యాసాగ్ం రాజా వరుణో యాతి మధ్యే సత్యా నృతే అప పశ్యన్జనానామ్ ।**
**యా అగ్నిం గర్భం దధిరే సువర్ణా స్తాస్త ఆపశ్శగ్గ్ం స్యోనా భవంతు ॥**
**యాసాం దేవా దివి కృణ్వంతి భక్షం యా అంతరిక్షే బహుధా నివిష్టాః ।**
**యా అగ్నిం గర్భం దధిరే సువర్ణాస్తా స్త ఆపశ్శగ్గ్ం స్యోనా భవంతు ॥**
**శివేన త్వా చక్షుషా పశ్యంత్వాపశ్శివయా తన్వోపస్పృశత త్వచం తే ।**
**ఘృతశ్చ్యుతశ్శుచయో యాః పావకాస్తా స్త ఆపశ్శగ్గ్ం స్యోనా భవంతు ॥**

అ॥ హిరణ్యవర్ణాః = బంగారముయొక్క కాంతివంటి కాంతి గల్గినట్టియు; శుచయః = పరిశుద్ధములగు నట్టియు; పావకాః = పవిత్రము చేయునట్టియునగు; ఆపః = ఉదకములు; ప్రచక్రముః = ప్రవహించుచున్నవి. అవద్యమ్ = పాపమును; హిత్వా = పోగొట్టి; ఆసు హి = ఈ ఉదకములయందు; పవిత్రాః = పవిత్రములగునట్టియు; వితతాః = వ్యాపించినట్టియు; శతమ్ = వందలకొలది అనగా అనేకములైన తీర్థములు (నద్యాద్యుదకములు) (సంతి) ఉన్నవి. హే వధు ! = ఓ చిన్నదానా! సవితా = ప్రేరకుడైన; దేవః = మహేశ్వరుడు; తాభిః = ఆ ఉదకములచేత; త్వామ్ = నిన్ను; పునాతు = పవిత్రురాలను జేయుగాక. యాసు = ఏ యుదకములయందు; కశ్యపః = సూర్యుడు; జాతః = పుట్టెనో; యాసు = ఏ ఉదకములయందు; అగ్నిః = అగ్ని; జాతః = పుట్టెనో; యాః = ఏ యుదకములు; అగ్నిమ్ = బడబాగ్నిని; గర్భమ్ = గర్భమును; దధిరే = ధరించినవో; హిరణ్యవర్ణాః = బంగారముయొక్క కాంతి గల్గినట్టియు; శుచయః = పరిశుద్ధములగునట్టియు; పావకాః = పవిత్రము చేయునట్టియు; సువర్ణాః =

యోగ్యమైన కాంతిగల్గినట్టియునగు; తాః = ఆ; ఆపః = ఉదకములు; హే వధు! = ఓ చిన్నదానా! తే = నీకు; శమ్ = (ఇహలోకమందు) సౌఖ్యమును జేయునవియును; స్యోనాః = (పరలోకమందు) సౌఖ్యమును జేయునవియును; భవంతు = అగుగాక. వరుణః = వరుణుడు; యాసామ్ = ఏ ఉదకములకు; రాజా = ప్రభువగుచు; జనానామ్ = జనులయొక్క; సత్యానృతే = నిజానిజములను; అవ పశ్యన్ = చూచుచున్ననవాడగుచు అనగా తెలిసిన వాడగుచు; మధ్యే = మధ్యలోకమందు; యాతి = సంచరించుచున్నాడో; తాః = ఆ, ఆపః = ఉదకములు; హే వధు ! = ఓ చిన్నదానా! తే = నీకు; శమ్ = ఐహిక సుఖకరములు; స్యోనాః = ఆముష్మిక సుఖకరములు; భవంతు = అగుగాక. యాసామ్ = ఏ ఉదకములయొక్క; భక్షమ్ = భక్షణమును; దివి = అంతరిక్షలోకమునందు; దేవాః = దేవతలు; కృణ్వంతి = చేయుచున్నారో; యాః = ఏ ఉదకములు; అంతరిక్షే = ఆకాశమునందు అనగా మేఘములందు; బహుధాః = అనేక ప్రకారములుగాను; భవన్తి = ఉన్నవో; తాః = ఆ, ఆపః = ఉదకములు; హే వధు = ఓ చిన్నదానా! తే = నీకు; స్యోనాః = సుఖకరములు; భవంతు = అగుగాక; ఘృతశ్చ్యుతః = నేతివంటి రసమును స్రవించునట్టియు; శుచయః = పరిశుద్ధములయినట్టియు; పావకాః = పవిత్రము చేయునట్టియునగు; యా ః =ఏ; ఆపః = ఉదకములు; సంతి = ఉన్నవో; తాః = ఆ, ఆపః = ఉదకములు; హే వధు! = ఓ చిన్నదాన! త్వామ్ = నిన్ను; శివేన = మంగళకరమైన; చక్షుషా = దృష్టిచేతను; పశ్యంతు = చూచుగాక. శివయా = మంగళమయిన; తన్వా = శరీరముచేతను; తే = నీయొక్క; త్వచమ్ = చర్మమును; ఉపస్పృశంతు = స్పృశించుగాక; తే = నీకు; స్యోనాః = సుఖకరములు, భవంతు = అగుగాక.

తా॥ బంగారురంగు గల్గిన శుద్ధములైన పవిత్రము చేయుచున్న నీళ్ళు ప్రవహించుచున్నవి. పాపములను పోగొట్టు పవిత్రములైన అనేక తీర్థములు ఈ నీటి యందున్నవి. ఓ కన్యా! ప్రేరకుడయిన దేవుడు వానిచే నిన్ను పవిత్రురాలను జేయుగాక.

బంగారురంగు కలిగిన శుద్ధములై పవిత్రముచేయు నీళ్ళు ప్రజాపతికిని ఇంద్రునికిని స్థానమైన నీళ్ళు గర్భమున అగ్నిని దాల్చిన నీళ్ళు నానారూపములైన ఆ నీళ్ళు కళ్యాణకరములగుగాక.

రాజగు వరుణుడు జనుల సత్యాసత్యముల వివేచన చేయుచు వేని మధ్యనుండెనో అట్టి నీళ్ళు మధువును గురిపించునవియును నిర్మలములును, పవిత్రములునగు నీళ్ళు నీకు కళ్యాణకరములగుగాక.

వేనిని దేవతలు స్వర్గమందు భక్షింతురో, ఏవి ఆకాశమున వివిధముగా నున్నవో, ఏవి నీటితో భూమిని తడుపుచున్నవో, అట్టి స్వచ్ఛమగు నీళ్ళు నీకు కళ్యాణకరములగుగాక.

ఓ చిన్నదానా! నేతివంటి రసమును స్రవించుచున్నవియు, పరిశుద్ధములయినవియు, పవిత్రము చేయునవియును ఉదకములు మంగళమైన దృష్టితో నిన్ను జూచుగాక. మంగళమయిన శరీరముతో నీ శరీరమును స్పృశించుగాక. నీకు సుఖకరములగుగాక.

మూ॥ పంచానామంతే సకృదేవ స్నాపయతి ।

తా॥ పై అయిదు మంత్రముల అంతమందు ఒకసారి స్నానము చేయించవలెను.

సూ॥ ఉత్తరయాఽహతేన వాససాచ్ఛాద్య ।

తా॥ క్రింది మంత్రము చెప్పి వధువునకు క్రొత్తచీర కప్పవలెను. అనగా కట్టించవలెను.

మం॥ **పరి త్వా గిర్వణో గిర ఇమా భవంతు విశ్వతో వృద్ధాయుమనువృద్ధయో జుషా భవంతు జుష్టయః ॥**

అ॥ హే గిర్వణః = స్తుతివాక్యములచేత సేవింపదగిన ఓ యింద్రుడా! (భగవంతుడా!) త్వా = నిన్ను; ఇమాః = ఈ నాసంబంధమైన; గిరః = స్తుతివాక్యములు; విశ్వతః = అంతటను; పరి + భవంతు = ఆవరించుగాక; వృద్ధాయుమ్ = దీర్ఘాయుర్దాయమునుగల, త్వా = నిన్ను; అను = అనుసరించి, వృద్ధయః = వృద్ధిగలవి; భవంతు = అవుగాక. జుష్టయః = (నా యొక్క) సేవలు; జుషాః = (నీకు) ప్రియములైనవి; భవంతు = అవుగాక.

తా॥ స్తుతింపదగిన ఓ యింద్రుడా! పెద్దల దగ్గరకు బోవు నిన్ను ఈ స్తుతివాక్యములు అంతట పరిగ్రహించుగాక. ఇవి ప్రవృద్ధములగుగాక. నీకు ప్రియములైనవియగుగాక.

ఇచ్చట కొందరు యోక్త్రబంధనచేసి మంగళసూత్రధారణ చేయుదురు. మరికొందరు దానికి వ్యతిరేకము చేయుదురు. రెండవపక్షమే శాస్త్రీయము. హేతువు – వివాహక్రమ బోధకవచనము లందు శ్లో॥ "ఆచ్ఛాద్య నూతనం వాసోవరోమాంగళ్యసూత్రకం । హిరణ్యామణి సంయుక్తం బధ్నీయాత్కన్యకాగళే" ॥ ఇత్యాదినా. ఆచారప్రాప్త మాంగళ్య ధారణను చెప్పెను గాన మాంగళ్యతంతుధారణ తరువాత యోక్త్రబంధనము చేయుటయే యుక్తము.

రెండు పళ్ళెములలో తెచ్చిన తలంబ్రాలు బియ్యము మీద మంగళసూత్రములుంచి పూజించి ముత్తైదువుల కంఠముల స్పృశింపజేసిన పిమ్మట వధువున కభిముఖుడై క్రింది శ్లోకమును చదువుచు రెండు సూత్రములను మూడేసి ముళ్ళు వేయవలెను.

### మంగళసూత్ర ధారణము

మూ॥ ప్రాణానాయమ్య పాణిగ్రహణాంగత్వేన మాంగళ్యదేవతాముద్దిశ్య మాంగళ్యదేవతా ప్రీత్యర్థం మాంగళ్యదేవతా పూజాం కరిష్యే ॥ మాంగళ్యపూజాం కృత్వా ॥

తా॥ ప్రాణాయామము చేసి అనగా సంకల్పముచేసి పాణిగ్రహణమునకు అంగముగా మాంగళ్యదేవతనుద్దేశించి మాంగళ్య దేవతయొక్క ప్రీతికొఱకు మాంగళ్య దేవతయొక్క పూజను చేసెదను. మాంగళ్యపూజను చేసి

శ్లో॥ మాంగళ్యతంతునానేన మమ జీవన హేతునా ।
కంఠే బధ్నామి సుభగే త్వం జీవ శరదాం శతమ్ ॥ (శరదశ్శతమ్)
మాంగళ్యధారణముహూర్తస్సుముహూర్తోఽస్తు ।

తా॥ నాజీవమునకు గుర్తైన యీ మంగళసూత్రమును నీ కంఠమున గట్టుచున్నాను. ఓ సుందరీ! నీవు నూరేండ్లు బ్రతుకుము – అని ముడులకు కుంకుమ పూయవలెను.

**మంగళసూత్రధారణము**

మాంగళ్య సూత్రమనగా శతమానమని లోకులు వ్యవహరింతురు. దీనిలోని అంతరార్థమేమనగా శతనిష్కపరిమితమైనట్టి సువర్ణమును ధరించి శత సం॥రములకు తక్కువ కాకుండగా ఆయుర్భాగ్యమును పెంపొందించుకొనుట మఱియు వారిరువురు సజీవులుగ నున్నంతకాలము స్త్రీ ధరించునట్టి యొక చిహ్నము.

మూ॥ మాంగళ్యధారణముహూర్తస్సుముహూర్తోఽస్తు

తా॥ మంగళసూత్రము ధరించు ముహూర్తము సుమూర్తము అగుగాక.

**యోక్త్రబంధనము**

మూ॥ ధృత్వా ఆచమ్య ।

కుశ అను పేరుగల తృణవిశేషముచే నిర్మింపబడిన ఒక త్రాడును వధువుయొక్క మొలకు "ఆశాసానా" అను మంత్రముతో ఆమెకు సౌమనస్యమును, సంతతిని, సౌభాగ్యమును కోరుచు భర్తచే అనుష్ఠింపబడెడి అగ్ని సంబంధమైన కర్మలయందు భర్తను అనుసరించెడి స్వభావము గలదై యుండుగాక అని బంధించుట.

ఇది మొదలు (అథైనాముత్తరయా) అను పాణిగ్రహణము వఱకు ఆపస్తంబులు చెప్పకున్నను ఆచారప్రాప్తమగుటవల్లను ఇతరస్మృతి సిద్ధమగుటవల్లను క్రమముగా చేయదగినదియే.

తా॥ క్రిందిమంత్రమును (ఆశాసానా అను దానిని) చెప్పి యోక్త్రమను త్రాడును (దర్భలతో పేనబడిన త్రాటిని) వధువు మొలకు కట్టవలెను. అభిముఖుడయి కట్టవలెను.

మం॥ **ఆశాసానా సౌమనసం ప్రజాగ్ం సౌభాగ్యం తనూమ్ । అగ్నేరనువ్రతా భూత్వా సంనహ్యే సుకృతాయ కమ్ ॥**

అ॥ వధూః = పెండ్లికుమార్తె; సౌమనసమ్ = మంచిమనస్సును; ప్రజామ్ = సంతానమును; సౌభాగ్యం = సువాసినీత్వమును; తనూమ్ = మంచిదేహమును; ఆశాసానా = కోరుచున్నదగుచు; అగ్నేః = అగ్నికి లేక భగవంతునకు; అనువ్రతా = అనుసరించి వ్రతముచేయుచున్నది. భూత్వా = అయి; (తిష్ఠతి = ఉండుచున్నది.) సుకృతాయ = వివాహమనెడి పుణ్యకర్మకొఱకు; యోక్త్రేణ = త్రాటిచేతను; సన్నహ్యే = కట్టుచున్నాను. (కం = నిరర్థకము)

తా॥ నిర్మల మనస్సును, సంతానమును, సౌభాగ్యమగు శరీరమును కోరుచున్నదై అగ్నినిగూర్చి వ్రతమును పూని యీ వధువున్నది. కనుక ఈమె సుఖముకొఱకు కట్టుచున్నాను.

మూ॥ (ఉత్తరేణ నాభిం నిష్టర్క్య గ్రంథిం కృత్వా ప్రదక్షిణం పర్యూహ్య దక్షిణేన నాభిమవస్థాపయతి।)

తా॥ బొద్దునకుత్తరముగా పీట ముడిని వేసి ప్రదక్షిణముగా (బొద్దుమీద నుండి జరిపి బొద్దునకు దక్షిణమున ఆ ముడియుండునట్లు చేయవలెను.)

మూ॥ తతః ఆర్ద్రాక్షతారోపణం కుర్యాన్ = ఆర్ద్రాక్షతలు తలయందుంచవలెను. పిమ్మట తలంబ్రాలు పోయించవలెను.

ఎట్లనగా:–

మూ॥ వధూశ్చ పూర్వం ప్రథమే తృతీయే వరశ్చ పూర్వం ద్వితుర్థయోస్తు ।
వధ్వా౭ ౭దౌ । తతో వరేణ చకార్యమ్ । కపిలావాచనాది మంగళాచారప్రాప్తం కుర్యాత్ ।
తస్యాయం ప్రయోగః –

తా॥ ముందు వధువు పిదప వరుడు ఈ పనిచేయును, అనగా వధువు ఒకటవసారి, మూడవసారియు మొదటను; వరుడు రెండవసారి, నాల్గవసారియు మొదటను చేయవలెను.

మొదట వధువు, తరువాత వరుడును చేయవలెను. పిమ్మట కపిలావాచనాదులను మంగళాచారములుగా వచ్చువానిని చేయవలయును. దాని విధానమిట్లు –

మూ॥ వరః పయసా వధ్వంజకా ద్విరుపస్తీర్య ద్విస్తండులానోప్య ద్విరభి ఘారయతి । వరాంజలావన్యః కుర్యాదేవమ్ । వధ్వంజలేరుపరిస్థాప్య సోదకం కలశమాదాయ బ్రాహ్మణైస్సహ ।

తా॥ వరుడు పాలను వధువు దోసిలియందు అభిఘరించి (తుడిచి) రెండు సార్లు బియ్యముంచి రెండుసార్లు పైనభిఘరించవలెను. ఈ ప్రకారమే మఱియొకరు వరుని దోసిలియందు ఉంచి నీరుగల కలశము తీసికొని బ్రాహ్మణులతో గూడ (ఈక్రిందచెప్పబోవు ఆశీర్వాక్యములను, అనువాకమును చెప్పవలెను.) కపిల గోవును స్మరింపచేయవలెను.

మూ॥ కపిలాగ్స్మారయంతు దక్షిణాః సాంతు । బహుదేయం చాస్తు । పుణ్యం వర్ధతాగ్ం శాంతిరస్తు। పుష్టిరస్తు । తుష్టిరస్తు । వృద్ధిరస్త్వవిఘ్నమస్తు । ఆయుష్యమస్త్వారోగ్యమస్తు । స్వస్తి శివం కర్మాస్తు । కర్మసమృద్ధిరస్తు । దంపత్యోర్నామజన్మనక్షత్రే * సగ్రహే దైవతే సహ సోమేన క్రియేతాగ్ం శాంతిరస్తు ।

* ఇచ్చట దంపతుల జన్మనక్షత్రోచ్చారణచేసి, ఆ నక్షత్రములు ఏరాశికి చెందినవో ఆరాశికెవరు అధిపతియో, ఆనక్షత్రములకే దేవతలో అవి ఉచ్చరించి, అనగా వధూ వరులు అశ్విని... పుష్యమి అయిన, దంపత్యోర్జన్మనక్షత్రే అశ్వినీ పుష్యనక్షత్రే కుజ చంద్ర సహితే, అశ్వినౌ బృహస్పతి దేవతే॥ సహ సోమేన క్రియేతామ్॥ అని యీప్రకారము ఉచ్చరించవలెను.

తా॥ దక్షిణలు రక్షించుగాక, ఎక్కువ ఇవ్వతగినది యగుగాక, పుణ్యము వర్ధిల్లుగాక. శాంతి యగుగాక. పుష్టి యగుగాక. తుష్టి యగుగాక, వృద్ధి యగుగాక, అవిఘ్న మగుగాక, ఆయుష్యమగుగాక, ఆరోగ్యమగుగాక, శుభకర్మ యగుగాక, కర్మ సమృద్ధి యగుగాక.

దంపతులయొక్క జన్మనక్షత్రములు, తద్రాశ్యధిపతులు, తదధిష్ఠానదేవతలు శుభమగుగాక–

శాంతియగుగాక.

మం॥ ప్రజాపతి స్త్రియాం యశః ముష్కయో రదధాద్యథ్సపం ।
కామస్య తృప్తిమానందం । తస్యాగ్నే భాజయేహ మా ॥
మోదః ప్రమోద ఆనందః । ముష్కయోర్నిహితస్సపః ।
సృత్వేవ కామస్య తృప్యాణి ॥ దక్షిణానాం ప్రతిగ్రహే ॥
మనసశ్చిత్తమాకూతిం ॥ వాచస్సత్యమశీమహి ।
పశూనాగ్ం రూపమన్నస్య । యశః శ్రీః శ్రయతాం మయి ॥
యథాహమస్యా అతృపగ్గ్ స్త్రియై పుమాన్ ।
యథా స్త్రీ తృప్యతి పుగ్ంసి ప్రియే ప్రియాః
ఏవం భగస్య తృప్యాణి । యజ్ఞస్య కామ్యః ప్రియః ।
దదామీత్యగ్నిర్వదతి । తథేతి వాయురాహ తత్ ।
హంతేతి సత్యం చంద్రమాః । ఆదిత్య స్సత్యమోమితి ।
అపస్తథ్సత్యమాభరన్ । యశో యజ్ఞస్య దక్షిణాం ।
(ప్రజా మే కామస్సమృద్ధ్యతామ్ ॥)

అ॥ ప్రజాపతిః = జగము సృజించిన బ్రహ్మ (ప్రజాపతి) ; స్త్రియామ్ = భార్యయందు గర్భరూపముగా ఉంచబడిన; యశః = యశస్సునకు కారణమైన వీర్యము; ముష్కయోః = అండములయొక్క; సపం = సంబంధమును; అదధాత్ = స్థాపించెను; ఆ సంబంధమెట్టిది? కామస్య = కామముయొక్క; తృప్తిమ్ = తృప్తికి కారణమయినది; ఆనందమ్ = సుఖమునకు కారణమయినది; హే అగ్నే! = ఓ యగ్నీ! ఇహ = ఈ వివాహకార్యమందు; మామ్ = నన్ను; తస్య = ఆ వీర్యముయొక్క సుఖమును; భాజయ = పొందింపుము; (ఇతి = అని) మోదః = వార్తాజన్యమైన సుఖవిశేషము; ప్రమోదః = దర్శనజన్య సుఖవిశేషము, ఆనందః = భోగజన్యమైన సుఖవిశేషము; సపః = పై అన్నిటియొక్క సంబంధము; ముష్కయోః = అండములందు; నిహితః = ఉంచబడినది. దక్షిణానామ్ = దక్షిణలను; ప్రతిగ్రహే = స్వీకరించగానే; కామస్య సృత్వా ఇవ = కామితార్థమును పొందియే; తృప్యాణి = తృప్తుడను అగుదును. మనసః = మనస్సు సంబంధమైన; చిత్తమ్ = విజ్ఞానమును; ఆకూతిమ్ = సంకల్పమును; వాచః = వాక్కుసంబంధమైన; సత్యం చ = సత్యవాక్యమును; అశీమహి = పొందుదుముగాక. పశూనామ్ = గవాదులయొక్క; రూపమ్ = అనేక విధములయిన స్వరూపమున్ను; అన్నస్య = అన్నమునకు సంబంధించిన కీర్తినిన్నీ; అశీమహి = పొందుదుము గాక. మయి = నన్ను; శ్రీః = ధనసమృద్ధి; శ్రయతామ్ = సేవించుగాక. అస్యై స్త్రియై = వివాహలబ్ధమైన యీ భార్య యందు; పుమాన్ అహమ్ = పురుషుడనైన నేను; యథా = ఏ విధముగా; అతృపమ్ = తృప్తి పొందియున్నానో; యథా = ఏవిధముగా; ప్రియాస్త్రీ = ప్రియురాలైన స్త్రీ; ప్రియే పుంసి = ప్రియుడైన పురుషుని యందు; తృప్యతి = తృప్తి పడుచున్నదో; ఏవమ్ అహమ్ = ఇట్లు నేను; భగస్య తృప్యాణి =

సౌభాగ్యముచేత తృప్తుడనగుదును. నేనెట్టి వాడను? యజ్ఞస్య = యజ్ఞమునకు; కామ్యః ప్రియః = కోరతగిన ప్రియుడను. (కావున యజ్ఞమునకు నేను ఇష్టుడను.) దదామి = ఈ కన్యను నేను ఇచ్చుచున్నాను అని; అగ్నిః వదతి = అగ్ని చెప్పుచున్నాడు. తత్ తథా ఇతి = అది అట్లే అవుగాక అని; వాయుః ఆహ = వాయువు చెప్పుచున్నాడు; చంద్రమాః = చంద్రుడు అయితే; తత్ సత్యం = అది నిజము; హంత ఇతి ఆహ = సంతోషము అని పల్కుచున్నాడు; ఆదిత్యః = సూర్యుడు; సత్యమ్ ఓమితి = సత్యమునంగీకరించుచున్నాడని ; ఆహ = చెప్పుచున్నాడు. యజ్ఞస్య దక్షిణాం = యజ్ఞసంబంధి దక్షిణారూపమయిన; యశః = యశస్సునకు కారణమైన; తత్ = ఆకన్యారూపమయిన వస్తువును; ఆపః సత్యమ్ అభరన్ = జలదేవత సత్యముగా తెచ్చినది. (ప్రజా = పుత్రోత్పత్తిరూప మయిన; మే కామః = నా కోరిక; సమృద్ధ్యతామ్ = పరిపూర్ణమగుగాక.)

తా॥ ప్రజాపతి స్త్రీయందలి కామతృప్తికారణము, ఆనందకారణము, యశఃకారణమునగు వీర్యమును వృషణములకు సంబంధించిన దానినిగా జేసెను. ఓ యగ్నీ! ఆ వీర్యమునకు ఇక్కడ నన్ను అర్హుని జేయుము.

వచనసుఖము, దర్శనసుఖము, సంభోగసుఖము, వీనికన్నిటికి కారణమగు వీర్యము వృషణముల యందుంచబడినది. దక్షిణలను మనస్సులను ప్రతిగ్రహించి కోరికలను పొంది తృప్తుడనగుచున్నాను.

మనస్సునందలి జ్ఞానమును సంకల్పముగ వాక్సత్యమును పొందుచున్నాను. పశుసంపదను అన్నకీర్తిని పొందుచున్నాను. సంపద ధనసమృద్ధి నన్ను ఆశ్రయించుగాక.

పురుషుడనైన నేను స్త్రీయందు తృప్తిపడినట్లు ఈ స్త్రీ యిష్టుడగు పురుషునియందు తృప్తిపడినట్లు నేను యజ్ఞమును కోరువాడను. యజ్ఞమునకు ప్రియుడైన వాడును అగు నేను సౌభాగ్యముచే తృప్తి పొందుచున్నాను.

ఈ కన్యక నిచ్చుచున్నానని అగ్ని పల్కుచున్నాడు. అట్లే అగుగాక యని వాయువనెను. సెబాసు, అట్లే అగుగాక యని చంద్రుడనెను. ఇది సత్యము. అంగీకరించితినని ఆదిత్యుడనెను.

యజ్ఞ దక్షిణారూపమును యశః కారణమును అగు ఆ కన్యను జలదేవత సత్యముగా పొందింప జేయుగాక.

పుత్రోత్పత్తిరూపమయిన నాకోరిక పరిపూర్ణ మగుగాక.

మూ॥ అన్యోన్యగ్ం శిరసి ( ఇతి వధూవరయోశ్శిరసి) తండులారోపణం కుర్యాత్ ।

తా॥ ఒకరి శిరమున ఒకరు ఈ క్రింద చెప్పబోవు రీతిగా తలంబ్రాలుంచుకొనవలెను.

మూ॥ పూర్వం వరో వధ్వాశ్శిరసి ప్రాపయేత్ ।

తా॥ తొలిసారి వరుడు ముందు వధువు శిరమున ఈ మంత్రము చెప్పి యుంచవలెను.

మం॥ **ప్రజామే కామస్సమృద్ధ్యతామ్ ।**

తా॥ నేగోరుచున్న సంతానము సమృద్ధి యగుగాక.

మూ॥ సంఘృతేన క్షీరేణ వధూవరయోరంజల్యోరుపస్తీర్య ... ... ఇత్యాది ॥

తా॥ ఇట్లు నేయి కలిపిన పాలతో వధూవరుల అంజలులందు ... ... యజ్ఞము నాకోరికను వృద్ధిపొందించుగాక.

మూ॥ ద్వితీయపర్యాయే వరస్య శిరసి పూర్వమ్ ।

తా॥ రెండవసారి ముందు వధువు వరుని శిరమున ఈ మంత్రము చెప్పి యుంచవలెను.

మం॥ **పశవో మే కామస్సమృధ్యతామ్ ।**

అ॥ పశవః = (పశువులు) పశురూపములయిన; మే కామః = నాయొక్క కోరిక; సమృధ్యతామ్ = పరిపూర్ణమగుగాక.

తా॥ నాకిష్టమైన పాడిపంటలు సమృద్ధమగుగాక.

మూ॥ తృతీయపర్యాయే వధ్వాశ్శిరసి పూర్వమ్ ।

తా॥ మూడవసారి వధూశిరమున ముందు ఉంచవలెను.

మం॥ **యజ్ఞో మే కామస్సమృధ్యతామ్ ।**

తా॥ యజ్ఞరూపమైన నా కోరిక సిద్ధిని పొందుగాక. (నా కిష్టమైన త్యాగము సమృద్ధమగుగాక.)

మూ॥ తూష్ణీం చతుర్థే అన్యోన్యం యుగవత్ ।

తా॥ నాల్గవ పర్యాయము అమంత్రముగా అనగా ప్రజాపతి ఇత్యాది మంత్రములులేకుండా, ఈ క్రింది మంత్రము చెప్పి ఒకరి శిరమున నొకరు ఒక్క మారుగానుంచుకొనవలెను.

మం॥ **శ్రీయో మే కామస్సమృధ్యతామ్ ॥**

తా॥ లక్ష్మీరూపమయిన నా కోరిక (నాకు కావలసిన ధనము) సమృద్ధియగుగాక.

### తలంబ్రాలు

సువాసినీ స్త్రీలచే తీసికొని రాబడిన కుంకుమతో గూడిన అక్షతలను ఒకరి శిరస్సున నొకరు ఉంచుకొనుట అప్పుడు వినియోగింపబడెడి "దదామీత్యగ్నిర్వదతి" ఇత్యాది మంత్రములచే అగ్ని వాయ్వాదిత్యులందఱు కన్యను వరునకిచ్చుటకు అంగీకరింపవలెనని ప్రార్థించుట. అక్షతలు అనగా నడుము విరుగని బియ్యము. వానివలె గృహస్థాశ్రమమునందు ఈ దంపతులకు మధ్య భంగము వాటిల్ల కూడదని కోరుట దీని ప్రయోజనము. మఱియు ఈ తలంబ్రాలనెడు క్రియ పరస్పరానురాగమును ఉత్తేజపఱచును.

ఈ క్రియ జరుగు సమయమున బాలురు, స్త్రీలు, పురుషులు అత్యంతానందముతో వీక్షింతురు. సీతాకళ్యాణమున గూడ ఈ తలంబ్రాల క్రియ జరిగినట్లు "జానక్యాః కమలామలాంజలిపుటే" అను

శ్లోకమువలన సీతాదేవియొక్క అంజలియందు అక్షతలు పద్మరాగములవలె ప్రకాశించి శ్రీరామచంద్రుని యొక్క శిరమునందుంచబడినవై ఇంద్రనీలములవలె ప్రకాశించినట్లు వర్ణింపబడినవి.

### రక్షాబంధనము

మూ॥ ప్రాణానాయమ్య । పాణిగ్రహణాంగత్వేన ఆవయో రక్షార్థం రక్షాబంధనం కరిష్యే ।
రక్షాబంధనదేవతాభ్యో నమః। ధ్యానావాహనాది షోడశోపచారపూజాం కుర్యాత్ ॥

తా॥ ప్రాణాయామముచేసి అనగా సంకల్పముచేసి పాణిగ్రహణమునకు అంగముగా మాయిర్వురి యొక్క రక్షణకొఱకై రక్షాబంధనమును చేసెదను అనవలెను.

రక్షాబంధన దేవతలకు నమస్కారము. ధ్యానావాహనాది షోడశోపచారముల పూజ చేయవలెను.

మం॥ **ఓం విశ్వేత్తా తే సవనేషు ప్రవచ్యా యా చకర్థమఘవన్నింద్ర సున్వతే ।**
**పారావతం యత్పురు సంభృతం వస్వపావృణోశ్శరభాయ ఋషిబంధవే ॥**

అ॥ హే మఘవన్ ఇంద్ర! = ఓ యింద్రుడా! త్వమ్ = నీవు; సవనేషు = యజ్ఞములందు; సున్వతే = సోమాభిషవమును చేయునట్టి; యజమానాయ = యజమానునికొఱకు; యా = ఏ కర్మలను; చకర్థ = చేసితివో; తే = నీకు; తా = ఆకర్మలు; ప్రవాచ్యా = చెప్పవలసినవి; విశ్వేత్ = అనంతములుగా నున్నవి. కిం చ = మఱియు; త్వమ్ = నీవు, పారావతమ్ = పరావన్నామకు- డగు ఒక శత్రువునకు సంబంధించిన; యత్ వసు = ఏధనము గలదో; తత్ = దానిని; ఋషిబంధవే = ఋషులు బంధువులుగాగల లేక ఋషులకు బంధువైన; శరభాయ = శరభుడను పేరుగల ఋషికి; అపావృణోః = దాచియున్నావు; పురు సంభృతం యథా = ఆ ధనము అధికముగా; సంపాదింపబడినది యెట్లగునో అటులననియర్థము.

తా॥ తన దగ్గరకు వచ్చిన యింద్రుని చూచి సంతుష్టుడై ఋషి ఇంద్రుని వివిధకర్మలను దానమున్ను "విశ్వేత్తా తే" అను రెండు ఋక్కులతో స్తోత్రము చేయుచున్నాడు.

ఓ ఇంద్రుడా! నీవు యజ్ఞములందు సోమరసమునిచ్చెడి యజమానునికొఱకు ఏ కర్మలను చేసితివో యాకర్మలు చెప్పదగినవి అనంతములుగనే యున్నవి. మఱియు పరావత్తు అను పేరుగల శత్రవునకు సంబంధించిన ధనమేది యున్నదో దానిని శరభుడను పేరుగల ఋషికొఱకు అధికముగా సంపాదించునట్లు చేసినావు.

ఈ 'విశ్వేత్తా తే' అను మంత్రమునకు బదులు ఎక్కువమంది ఈ క్రింది మంత్రమును రక్షాబంధనమునకు చదువుచున్నారు.

మం॥ **బృహత్సామ క్షత్రభృద్వృద్ధవృష్ణియం త్రిష్టుభౌజశ్శుభితముగ్రవీరమ్ ।**
**ఇంద్ర స్తోమేన పంచదశేన మధ్యమిమం వాతేన సగరేణ రక్ష ॥**

అ॥ బృహత్ = బృహత్ అను పేరుగల; సామ = ఏ సామమున్నదో; తత్ = అది; త్రిష్టుభా = ఆ పేరుగల ఛందస్సుతో గూడ (పిపర్తు అనునది అనువృత్తిగా వచ్చును.) పిపర్తు = మమ్ములను

పాలించుగాక అని యర్థము. ఆ సామ యెటువంటిది? క్షత్రభృత్ = బలమును ధరించునది; వృద్ధవృష్ణియమ్ = ఉత్థితపుంస్కమనునది; ఓజః = బలమును గల్గించునది; శుభితమ్ = శోభించునది; ఉగ్రవీరమ్ = తీవ్రమైన పుత్రునొసగునది; హే ఇంద్ర = ఓ యింద్రుడా! పంచదశేన = పంచదశమను పేరుగల; స్తోమేన = స్తోమముతోను; సగరేణ = సగర అను పేరుగల; వాతేన = వాతముతోను కూడిన వాడవై; ఇమం మధ్యం = అతీతానాగతముల మధ్యనున్న ఈ మాశరీరమును; రక్ష = పాలింపుము.

తా॥ బృహత్ అను పేరుగల ఒక సామము గలదు. అది బలమును ధరించునది. ఉత్థితపుంస్కమైనది, బలమును కల్గించునది. శోభించునది, తీవ్రమైన పుత్రునొసగునది.

అట్టి సామము త్రిష్టుప్ అను ఛందస్సుతోగూడ మమ్ములను పాలించుగాక అని యర్థము. ఓ యింద్రుడా! పంచదశ అను పేరు గల్గిన స్తోమముతోను, సగర అను పేరుగల వాతముతోను కూడిన వాడవై అతీతానాగతముల మధ్యనున్న ఈ మా శరీరమును రక్షింపుము. త్రిలోక రక్షకుడైన యింద్రుని, శరీరరక్షణ నిమిత్తమై ప్రార్థన చేయబడినది. “బృహత్సామ” అను మంత్రము చేత.

మం॥ **విశ్వేత్తా తే త్వృచా పుంసాం బధ్నీ యాద్దక్షిణే కరే ।**
**అథ వామకరే స్త్రీణాం బృహత్సామేతి మంత్రతః ॥**
**సంకల్పానంతరం తస్య ముఖ్యకాల ఇతి స్మృతః ॥**
**హస్తగ్రహణకాలో వా ముఖ్యకాల ఇతి స్మృతః ॥**

తా॥ ‘విశ్వేత్తా తే’ అను ఋక్కు చదివి పురుషుల దక్షిణ కరమున కట్టవలెను.

‘బృహత్సామ’ అను మంత్రమును చదివి స్త్రీల వామకరమున కట్టవలెను. సంకల్పమయిన తరువాత దానికి ముఖ్యకాలమని చెప్పబడినది. హస్తగ్రహణ కాలముగాని ముఖ్యకాలమని చెప్పబడినది.

రాత్రి నాల్గవ జామున విప్పవలెను.

విశ్వేత్తా తే అను మంత్రమును చెప్పించి (వరుని చేతికి పురోహితుడు కట్టవలెను.)

బృహత్సామ రక్ష వధ్వా వామకరే బధ్నాతి – (వరుడీ మంత్రమును చెప్పుచు వధూవామ హస్తమున గట్టవలెను.)

మూ॥ రక్షాబంధనముహూర్తస్సుముహూర్తోఽస్తు ।

తా॥ రక్షాబంధన ముహూర్తము సుముహూర్త మగుగాక.

మూ॥ అగ్నే విశ్వేభిరితి బ్రహ్మగ్రంథిం కుర్యాత్ ।

అ॥ ‘అగ్నే విశ్వేభిః’ అను మంత్రముచే బ్రహ్మగ్రంథిని వేయవలెను.

మం॥ **అగ్నే విశ్వేభిః స్వనీకదేవై రూర్ణావంతం ప్రథమః సీద యోనిమ్ ।**
**కులాయినం ఘృతవంతం సవిత్రే యజ్ఞం నయ యజమానాయ సాధు ॥**

అ॥ హే స్వనీక = మంచి జ్వాలగల ఓ అగ్నీ ! విశ్వేభిః = సమస్త; దేవైః = దేవతలతోగూడ; ఊర్ణావంతం = (గొఱ్ఱె లేక మేక) ఉన్నిగల; యోనిం = ఉత్తరవేది లక్షణమైన స్థానమును (న) ప్రథమః = సర్వదేవతలలో ముఖ్యుడవైన నీవు; సీద = కూర్చుండుము; ఆ యోని అనగా స్థానమెట్టిది? కులాయినమ్ = గృహముకల్గిన గుగ్గులు మొ॥ సంభారములతో గూడినది. ఘృతవంతం = (వ్యాఘారణ) ఆజ్యముగల; (ఆజ్యముతో గూడినది) (ఇట్లు ఉత్తరవేదియందు కూర్చున్న నీవు) సవిత్రే = హవిస్సులను ప్రేరేపించెడు; యజమానాయ = యజ్ఞముచేయునట్టి వానియొక్క; యజ్ఞమ్ = యజ్ఞమును; సాధు = బాగుగా (చిత్తశుద్ధిగల్గునట్లుగా) (కపటము లేకుండగా) నయ = దేవతలకు అందజేయుమా! తాత్పర్యము స్పష్టము. ఒకరి మతమున తాత్పర్యమీక్రింది విధముగ నున్నది –

తా॥ ఓయగ్నీ! మొదటివాడవై సేనలుగల సమస్త దేవతలతో గూడ మాజన్మను రక్షింపుడు. గృహముగల నేయిగల సాధువైన యజ్ఞమునకు సవితకై పొందుము.

కొందఱు బ్రహ్మముడి సదక్షిణాఫలతాంబూలములను వధూవరులచేలాంచలములకు గట్టి ఆ రెండు కొనలను గలిపి యీ దిగువ అను వాక్యమును చెప్పుచు వేయుదురు.

మం॥ **యోగక్షేమస్య క్లప్త్యై । యుక్తం క్రియాతా ఆశీః కామే యుజ్యాతా ఇతి । ఆశిషస్సమృద్ధ్యై । గ్రంథిం గ్రధ్నాతి । ఆశిష ఏవాస్యాం పరిగృహ్ణాతి । పుమాన్ వై గ్రంథిః । స్త్రీపత్నీ । తన్మిథునమ్ । మిథునమేవాస్య తద్యజ్ఞే కరోతి ప్రజననాయ ।**
**ప్రజాయతే ప్రజయా పశుభిర్యజమానః । అథో అర్ధో వా ఏష ఆత్మనః । యత్పత్నీ । యజ్ఞస్య ధృత్యా అశిథిలం భావాయ । సుప్రజసేస్త్వావగ్ం సుపత్నీరుపనేదిమేత్యాహ । యజ్ఞమేవ తన్మిథునీకరోతి । ఊనేతిరిక్తం ధీయాతా ఇతి ప్రజాత్యై ।**
**మహీనాం పయోస్యోషధీనాగ్ం రస ఇత్యాహ । రూపమేవాస్యై తన్మహిమానం వ్యాచష్టే । తస్యతే క్షీయమాణస్య నిర్వపామి దేవ యాజ్యాయా ఇత్యాహ । ఆశిష మే వైతామాశాస్తే**

అ॥ యోగక్షేమస్య = అప్రాప్యవస్తువు ప్రాప్తించుట యోగము; ప్రాప్తరక్షణమము క్షేమము, వానియొక్క; క్లప్త్యై = సిద్ధికొఱకు; యుక్తమ్ = (మయాశాస్త్రీయం కర్మ) నాచే శాస్త్రీయ కర్మ; క్రియతే = చేయబడుచున్నది. ఆశీః = సౌమనస్యాది రూపమైన ఈ ఆశీస్సు; కామే = ఫలమందు; యుజ్యాతా ఇతి = ప్రయోగింపబడును అని; ఆశిష = ఆశీస్సుయొక్క; సమృద్ధ్యై = సమృద్ధి కొఱకు పైవిధముగా చేయవలయును. అపుడు ఆశీస్సు సమృద్ధమగును. గ్రంథిమ్ = ముడిని; గ్రధ్నాతి = వేయుచున్నాడు. అస్యామ్ = దీనియందు; ఆశీష ఏవ = ఆశీస్సులనే; పరిగృహ్ణాతి = పరిగ్రహించుచున్నాడు. పుమాన్ వై = పురుషుడు. గ్రంథిః = ముడి (గ్రంథిశబ్దము పుల్లింగము పత్నీశబ్దము స్త్రీలింగము) స్త్రీ = ఆడుది, పత్నీ = భార్య; తత్ మిథునమ్ = ఆయిరువురును జంట; అస్య మిథునమేవ తత్ = ఈమిథునముయొక్క జంట అనునది; యజ్ఞే = యజ్ఞమునందు; ప్రజననాయ = సృష్టిని (ఉత్పత్తి); కరోతి = చేయును; యజమానః = యజ్ఞము చేయువాడు;

పశుభిః = పశువులచే; ప్రజయా = సంతానముగా; ప్రజాయతే = పుట్టుచున్నాడు. సమృద్ధుడగుచున్నాడు; అథో = పిమ్మట; ఏషః = ఇది; ఆత్మనః = తనయొక్క; అర్థో వా = సగము భాగము; యత్ = ఏది. యజ్ఞస్య = యజ్ఞమును; ధృత్వా = ధరించుటచేత; అశిథిలం భావాయ = శిథిలమై యుండకుండుటకు; పత్నీ = పత్నియై యుండునో (సౌమనస్యము మొ॥ ఆశీస్సులన్నియు యోక్త్రగంథిచేత ఆమె యందు పరిగ్రహింపబడి యుండును. యజ్ఞకర్తకు అర్ధ స్వరూపముగదా పత్ని. అందువలన తదీయగ్రంథిచేత యజ్ఞము ధరింపబడును. శిథిలము కాదు.) త్వామ్ ఉపసేదిమ = ఓ అగ్నీ ! మేము నీవద్దకు వచ్చుచున్నాము, సుప్రజసః = మంచి సంతానముగలవారమై; సుపత్నీః = మంచి పతిగలవారమై; ఇతి ఆహ = అని పల్కెను.

యజమేవ తత్ మిథునీకరోతి = మంచి పతిగలది అని చెప్పుట వలన యజ్ఞమును మిథునముగలదిగా చేయును. అట్టి మిథునమునందు పతిచే కర్మ అనుష్ఠానము చేయబడినపుడు పూర్ణమగును. యజ్ఞాంగము పతిచే అనుష్ఠానము చేయబడనపుడు తక్కువది అనగా అసంపూర్ణము అగును.

ఊనే = అసంపూర్తి యున్నపుడు; అతిరిక్తమ్ = పూర్ణత యనునది; ప్రజాత్యై = ప్రజననమునకు

ధీయతే ఇతి = పొందబడును అని అనగా అచట ఊనప్రదేశము యజ్ఞాంగము పతిచే అనుష్ఠానము చేయబడనపుడు ఈ పత్నిచే ధరింపబడుచున్నది అనగా పూర్తిచేయబడుచున్నది.

ఇందువలన ఊన్న పత్నీ పూరయతి అనగా అసంపూర్ణమును పత్ని సంపూర్ణము చేయును అనెడు ప్రయోజనముచేత పత్ని ప్రవేశించునపుడే ఆ మిథునము ప్రజననమునకు సంపన్నమగునని భావము.

మహీనాం = గోవులయొక్క; పయః అసి = పాలు అయి యున్నావు. ఓషధీనాం రసః అసి = ఓషధుల రసమై యున్నావు; ఇతి ఆహ = అని చెప్పెను.

(ఓ ఆజ్యమా! నీవు ఆవుల పాలు అయి యున్నావు. సాక్షాత్తుగా తజ్జన్యమగుటవలన.)

ఓషధుల రసమైనావు, పరంపరగా తజ్జన్యమగుటవలన అట్టి క్షయరహితమైన నీయొక్క స్వరూపము దేవయాగముకొఱకు పాత్రలో నిర్వహించుచున్నావు.

అస్య రూపమేవ = దీనియొక్క రూపమే; ఏతన్మహిమానం వ్యాచష్టే = దీని మహిమను చెప్పుచున్నది. అక్షీయమాణస్య = క్షయమునొందని; తస్య తే = అట్టి నీయొక్క స్వరూపమును; దేవయజ్యాయై = దేవయాగముకొఱకు; నిర్వపామి = నిర్వహించుచున్నాను. ఇతి ఆహ = అని పల్కెను. ఏతామేవ ఆశిషమ్ = ఈ ఆశీస్సునే; ఆశాస్తే = ఆశించును.

మం॥ **యో వై తాం బ్రహ్మణో వేద అమృతేనావృతాం పురీమ్ ।**
**తస్మై బ్రహ్మ చ బ్రహ్మా చ ఆయుః కీర్తిం ప్రజాం దదుః ॥**

అ॥ బ్రహ్మణః = సత్యం జ్ఞానమనంత మిత్యాది శ్రుతి ప్రతిపాదితమైన వస్తువునకు సంబంధించిన; అమృతేన = పరమానందముతో; ఆవృతామ్ = ఆవరింపబడిన; తాం పురీం = ఆ పట్టణమును;

యోవై = ఏ పురుషుడైనను; వేద = తెలిసికొనునో; తస్మై = ఆ తెలిసికొన్నవానికి (విద్వాంసునకు); బ్రహ్మ చ = పరమాత్మయును; బ్రహ్మా చ = ప్రజాపతియును చకారములవలన ఇతర సర్వ దేవతలున్ను; ఆయుః = దీర్ఘాయుష్యమును; కీర్తిమ్ = సత్కీర్తిని; ప్రజామ్ = సత్సంతానమునున్ను; దదుః = ఇచ్చెదరు.

తా॥ సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ అను వేదము ప్రతిపాదించిన వస్తువునకు సంబంధించిన పరమానందము గల్గిన ఆ బ్రహ్మపురిని తెలిసికొన్న వానికి పరమాత్మయు, ప్రజాపతియు, సర్వదేవతలున్ను దీర్ఘాయుష్య సత్కీర్తి సత్సంతానాదులను అనుగ్రహింప గలరు.

అట్లె నాకును ఇచ్చెదరుగాక.

మూ॥ బ్రహ్మగ్రంథిముహూర్తస్సుముహూర్తోఽస్తు ॥

తా॥ బ్రహ్మగ్రంథి ముహూర్తము సుముహూర్తము అగుగాక.

మూ॥ తతః ఆశీర్వాదః. మంగళహారతి

తా॥ పిమ్మట ఆశీర్వాదము చేయవలయును. చివర మంగళహారతి ఈయవలయును.

---

సూ॥ అథైనాముత్తరయా దక్షిణే హస్తే గృహీత్వా అగ్నిమభ్యానీయ తూష్ణీం దక్షిణహస్తే గృహీత్వా ॥

తా॥ పిమ్మట ఈ చిన్నదానిని వరుడు వధువు కుడిచేతియందు కుడిచేతితో పట్టుకొని ముందు మంత్రము ("పూషా త్వేతో నయతు" అను దానిని) చెప్పుచు గృహ్యాగ్ని కభిముఖముగా తీసుకురావలెను. అగ్ని సమీపమందు మంత్రరహితముగా మరల కుడిచేయి గ్రహించవలెను.

## అథ వివాహ ప్రధాన హోమః

## (పిమ్మట వివాహప్రధానహోమము)

మం॥ **పూషా త్వేతో నయతు హస్తగృహ్యాశ్వినౌ త్వా ప్రవహతాగ్ం రథేన ।**
**గృహాన్గచ్ఛ గృహపత్నీ యథాఽసో వశినీ త్వం విదధమావదాసి ॥**

అ॥ హే వధు! = ఓ చిన్నదానా! త్వా = నిన్ను; పూషా = సూర్యుడు లేక పోషకుడగు భగవంతుడు; హస్తగృహ్యా = హస్తమును బట్టుకొని; ఇతః = ఇక్కడనుంచి; నయతు = (అగ్నిసమీపమును) పొందించుగాక. అశ్వినౌ = అశ్వినీదేవతలు; త్వా = నిన్ను; రథేన = రథముచేతను; ప్రవహతామ్ = నడిపించెదరుగాక. గృహపత్నీ = గృహయజమానివి; యథా ఆసః = ఎట్లు అగుదువో; తథా = ఆ విధముగా; గృహాన్ = నా సంబంధమైన గృహములను; గచ్ఛ = పొందుము; త్వమ్ = నీవు; వశినీ = గృహజనులయొక్క స్వాధీనముకలదానవగుచు; విదధమ్ = గృహకార్యములను (యజ్ఞసంబంధమగు సలహాను) ఆవదాసి = చెప్పుము.

తా॥ ఓ చిన్నదానా! సూర్యుడును అశ్వినీదేవతలును రథముచే నిన్ను నాగృహమును పొందించెదరుగాక. నీవు నాగృహమునకు యజమానురాలవై (గృహకార్యములను బాగుగా నెరవేర్పుము). యజ్ఞసంబంధమగు సలహాను చెప్పుము.

సూ॥ ఆపరేణాగ్నిం కటమాస్తీర్య తస్మిన్నుపవిశత ఉత్తరోవరః ॥

తా॥ అగ్నికి పడమట చాపను పఱచి దానియం దా దంపతులు ఉత్తర వరుడుగా కూర్చుండవలెను.

మూ॥ వరః ఆచమ్య ... ... ఓం భూః ... ఏవం గుణ ... ... శుభతిథౌ అనయా నవోఢయా వధ్వాసహ శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం మమాయుష్యాభివృద్ధ్యర్థం వివాహ ప్రధానహోమం కరిష్యే॥

తా॥ వరుడు ఆచమనముచేసి ... ... ఓం భూః ... ... ఇటువంటి గుణములుగల ... ... శుభతిథి యందు ఇప్పుడే క్రొత్తగా పెండ్లియాడిన యావధువుతోగూడ శ్రీపరమేశ్వరుని ప్రీతికొఱకు మాకు ఆయువు వృద్ధి పొందుటకు వివాహ ప్రధానహోమము చేయుదును.

మూ॥ తదంగమగ్ని ప్రతిష్ఠాపనం కరిష్యే ॥

తా॥ దానికి అంగమైన అగ్ని ప్రతిష్ఠాపనము చేయుదును.

## అగ్ని ప్రతిష్ఠ

నూతన వధూవరులిద్దఱు శాస్త్రవిధి ననుసరించి అగ్నిని ప్రతిష్ఠించవలెను. తరువాత ఆ యగ్ని సమీపమునకు వివాహ వేదికనుండి పెండ్లికుమార్తెను పెండ్లి కుమారుడు చేతితో పట్టుకొని తీసికొని వెళ్ళుచు, "నాకు గృహపాలకురాలుగా అధిపతిరాలుగాఉండి నాకెల్లప్పుడు పుణ్యకార్యములం దాభిముఖ్యమును చూపవలెను" అని "పూషా త్వేతో నయతు" అను మంత్రముతో కోరుట.

మూ॥ ఓం భూర్భువస్సువరోమిత్యగ్నిం ప్రజ్వాల్య ।

తా॥ ఓం భూర్భువస్సువరోమ్ అని అగ్నిని ప్రజ్వలింపచేసి,

మం॥ **ఓం చత్వారి శృంగా త్రయో అస్య పాదా ద్వే శీర్షే సప్త హస్తాసో అస్య ।**
**త్రిధా బద్ధో వృషభో రోరవీతి మహో దేవో మర్త్యాగ్ం ఆవివేశ ॥**

అ॥ అస్య = ఈయజ్ఞాత్మకుడగు అగ్నికి; చత్వారి శృంగాః = నాల్గువేదములు శృంగస్థానీయములు; త్రయః అస్య + పాదాః = ఈ అగ్నికి మూడు సవనములు మూడు పాదములు; ద్వేశీర్షే = బ్రహ్మౌదనము ప్రవర్గ్యము అనునవి రెండు శిరస్సులు; సప్త హస్తాసః = ఏడు ఛందస్సులు హస్తములు.

హస్తములు అనుష్ఠానమునకు ముఖ్యసాధనములు. ఛందస్సులు కూడ దేవతాప్రీణనమునకు ముఖ్యసాధనములగుటచే హస్త వ్యవహారము.

త్రిధా బద్ధః = మంత్ర బ్రాహ్మణ కల్పములతో మూడు విధములుగా బంధింపబడెను. వృషభః = ఫలములను వర్షించునది; రోరవీతి = మిక్కిలి గర్జించుచున్నది.

ఋగ్యజుస్సామ ఉక్థములగు శస్త్రయాగస్తుతిరూపములైన హోత్రాద్యుత్పాదిత ధ్వనులతో ఇది స్తుతించుచున్నది.

ఏవం = ఇట్లు; మహో దేవః మర్త్యాన్ అవివేశ ।

## సూర్యపక్షమున అర్థము

అస్య = ఈ ఆదిత్యునకు; చత్వారి శృంగాణి = నాలుగు దిక్కులు; త్రయః అస్య పాదాః = మూడు వేదములు పాదములు; ద్వే శీర్షే = పగలురాత్రియును రెండు శిరస్సులు; సప్త అస్య హస్తాసః = ఏడు రశ్మిలు ( ఆరు ఋతువులు, ఒక సాధారణము) త్రిధా బద్ధః = క్షిత్యాది మూడుస్థానములందు అగ్న్యాద్యాత్మకముగా సంబద్ధమయినది. గ్రీష్మవర్షా హేమంతములను మూటిచే బద్ధము. వృషభః రోరవీతి = వృష్ట్యాది ద్వారా శబ్దము చేయుచున్నది. స మహః దేవః = ఆ మహాదేవుడు; మర్త్యాన్ ఆవివేశ = వారికి నియంతగా ఆవేశించెను.

తా॥ ఈ యగ్నికి నాలుగు వేదములు కొమ్ములు. ప్రాతస్సవనము, మధ్యాహ్నసవనము, సాయంసవనము అనునవి మూడు పాదములు. బ్రహ్మౌదనము, ప్రవర్గ్యము అనునవి రెండు శిరస్సులు. ఛందస్సులు ఏడుచేతులు, మంత్రకల్పబ్రాహ్మణములను మూటిచే కట్టబడినదై కోరికలను వర్షించునదై యీ యగ్ని యెక్కువ ధ్వని చేయుచున్నది. మహాత్ముడగు దేవుడు అగ్ని మర్త్యులను ప్రవేశించుచున్నాడు.

మూ॥ అగ్నిమిద్ధ్వా = తూర్పుగా మొదలుగల దర్భలతో అగ్నిని గప్పుచున్నాడు.

శ్లో॥ సప్త హస్తశ్చతుశ్శృంగస్సప్త జిహ్వో ద్విశీర్షకః ।
త్రిపాత్ప్రసన్నః వదనస్సుఖాసీనశ్శుచిస్మితః ।
స్వాహాం తు దక్షిణే పార్శ్వే దేవీం వామే స్వధాం తథా ।
బిభ్రద్దక్షిణహస్తైస్తు శక్తిమన్నం స్రుచం స్రువమ్ ॥
తోమరం వ్యంజనం వామైర్ఘృతపాత్రం తు ధారయన్ ।
మేషారూఢం జటాబద్ధం గౌరవర్ణం మహౌజసమ్ ॥
ధూమధ్వజం లోహితాక్షం సప్తార్చిస్సర్వకామదమ్ ।
ఆత్మాభిముఖమాసీనమేవం ధ్యాయేద్ధుతాశనమ్ ॥

మం॥ **ఏష హి దేవః ప్రదిశోను సర్వాః పూర్వో హి జాతస్స ఉ గర్భే అంతః । స విజాయమానస్స జనిష్యమాణః ప్రత్యఙ్ముఖాస్తిష్ఠతి విశ్వతో ముఖః ॥ఇతి ప్రాచ్యాం సాక్షతోదకం నినీయ।**

తా॥ అగ్ని ఏడు చేతులు, నాలుగు కొమ్ములు, ఏడు నాలుకలు, రెండు శిరస్సులు, మూడు కాళ్ళు, నిర్మలమయిన ముఖము గలవాడై శుచిస్మితుడై దక్షిణ పార్శ్వమున స్వాహాదేవిని, వామభాగమున స్వధాదేవిని ధరించి నాలుగు దక్షిణ హస్తములచే శక్తి, అన్నము, స్రుక్కు, స్రువము అను హోమపాత్రలను, వామహస్తములు మూడింటిచేత తోమరమును, విసనకఱ్ఱను, నేతిపాత్రను బూనినవాడై మేకనెక్కి, జడలు కట్టుకొని, పచ్చనికాంతి, అధికతేజస్సు, పొగ యను పతాకము, ఎఱ్ఱనికన్నులు, ఏడు జ్వాలలు కలిగి అన్ని కోరికలు నిచ్చువాడు తన కభిముఖముగా నున్న యగ్నిని ఇట్టి రూపముగల వానినిగా ధ్యానింపవలయును.

దేవుడైన (ప్రకాశించు) యాయగ్ని, సమస్త దిక్కులందు వ్యాపించి, ముందుగా పుట్టియున్నాడు గదా! ఆ యగ్నియే బ్రహ్మాండగర్భమందున్నాడు. అతడే పుట్టువాడు, పుట్టబోవువాడును. ఆ యగ్నియే అభిముఖుడై విశ్వతోముఖుడై యున్నాడు.

(అని తూర్పుదిక్కున సాక్షతోదకము తీసికొని)

మూ॥ ప్రాఙ్ముఖాగ్నే! మమాభిముఖో భవ సుముఖో భవ సుప్రసన్నో భవ వరదో భవ యథోక్త జిహ్వయా హవిర్గృహాణ ॥

తా॥ తూర్ముముఖముగల ఓ యగ్నీ! నాకు అభిముఖుడవగుము. సుముఖుడవగుము. సుప్రసన్నుడ వగుము. వరదుడవగుము. (వరపుత్రదుడవగుము). ఇదివఱకు చెప్పబడిన నాలుకతో హవిస్సును గ్రహింపుము.

మం॥ **ఓం భూర్భువస్సువః । ఓం తత్సవితుర్వరేణ్యమ్ భర్గో దేవస్య ధీమహి । ధియో యో నః ప్రచోదయాత్ ॥** ఈ గాయత్రీ మంత్రము నుచ్చరింపవలెను.

మూ॥ సోదకేన పాణినా ప్రదక్షిణమగ్నిం పరిసమూహ్య । అగ్నిమలంకృత్య ।

తా॥ నీళ్లచేతితో అగ్నికి ప్రదక్షిణముగా నీళ్లు చల్లి అలంకరించి

మం॥ **అగ్నయే నమః । హుతవహాయ నమః । హుతాశినే నమః । కృష్ణవర్త్మనే నమః । దేవముఖాయ నమః । సప్తజిహ్వాయ నమః । వైశ్వానరాయ నమః । జాత వేదసే నమః ॥**

తా॥ అగ్నికి నమస్కారము. హుతవహునకు నమస్కారము. కృష్ణవర్త్మకు నమస్కారము, దేవముఖునకు నమస్కారము, సప్తజిహ్వునకు నమస్కారము, వైశ్వానరునకు నమస్కారము. జాతవేదసునకు నమస్కారము.

మూ॥ ప్రాగాది దర్భైరగ్నిం పరిస్తృణాతి ।

తా॥ అగ్నికి నాలుగుప్రక్కల తూర్పుగా గొనలు గల్గునట్లు దర్భలు పఱచ వలయును.

మూ॥ దక్షిణోత్తరైరుత్తరాధరైః । ప్రాగుదగగ్రైర్వా ।

తా॥ అగ్నికి దక్షిణపు తట్టునందును ఉత్తరపుతట్టునందును తూర్పు కొనలు గల్గునట్లుగాను, అగ్నికి తూర్పుతట్టునందును పడమటి తట్టునందును ఉత్తరపు గొనలు గల్గునట్లుగాను దర్భలను పఱచవలయును. దక్షిణపరిస్తరణమును తూర్పు పడమరలయందు వేసిన పరిస్తరణముల మీదుగా వేయవలయును. ఉత్తర పరిస్తరణమును తూర్పు పడమర వేసిన పరిస్తరణముల క్రింద యుండునట్లుంచవలెను.

మూ॥ ఉత్తరేణాగ్నిం ప్రాగగ్రాన్దర్భాన్ తృగ్‌స్తీర్య । ద్వంద్వం న్యంచి పాత్రాణి ప్రయునక్తి । దర్వాజ్య స్థాల్యౌ ప్రోక్షణపూర్ణపాత్రే ఇధ్మస్రువావితి ।

తా॥ అగ్నికి ఉత్తరముగా తూర్పుకొనలు కల్గునట్లు దర్భలను పఱచి వాటి మీద పాత్రలను జంటగా బోరగిలి యుండునట్లు ఉంచవలయును.

శ్లో॥ వధ్వంజలిం హోమవిధానదర్వీం ద్వితీయదర్వీం సహ చాజ్యధాన్యా ।
ప్రోక్షార్ధపాత్రేణ సహ ప్రణీతామిధ్మం చ శమ్యాః సహ లాజమశ్మ ॥

తా॥ దర్వి, ఆజ్యపాత్రము, ప్రోక్షణీపాత్రము, ప్రణీతపాత్రము, సమిత్తు, ఇతరదర్వి అనునవి.
(మొదటి వరుసలో, వధువుయొక్క దోసిలి సృక్కు, సృశము, నాజ్యస్థాలియును, రెండవవరుసలో ప్రోక్షణ పాత్రతోగూడ పూర్ణ పాత్రయును, మూడవవరుసలో నిధ్మము, కాడిసీలలు, (శమ్యలు) పేలములు, రాయియు, నాసాదన చేయవలెను.)

మూ॥ వధూహస్తయోస్సాదనప్రోక్షణతపనసమ్మార్జనాని కరోతి ॥

తా॥ వధువుయొక్క దోసిలిని సుక్రువములతో పాటు ఆసాదించుట, ప్రోక్షించుట. కాచుట, తుడుచుట చేయవలెను.

మూ॥ సూ॥ అప్రచ్ఛిన్నాగ్రౌ అనంతర్గర్భౌ దర్భౌ ప్రాదేశమాత్రే పవిత్రే కురుతే ।
(సమౌసాగ్రౌ ద్వౌ దర్భౌ ప్రాదేశమాత్రౌ పవిత్రే కృత్వా) తృణం కాష్ఠం వాఽన్తర్ధాయ ఛినత్తి । ననఖేన । ఆప ఉపస్పృశ్య । అద్భిరనుమృజ్య । ప్రోక్షణ్యామవధాయ । ప్రోక్ష్య । తస్యామప ఆనీయ । హస్తయోరంగుష్ఠోపకనిష్ఠికాభ్యాముత్తానాభ్యాముదగగ్రే గృహీత్వా । ప్రాచీ స్త్రీరుత్పూయాభిమంత్ర్య । సపవిత్రేణ పాణినా పాత్రాణి సంస్పృశ్య ।
పాత్రాణ్యుత్తానాని కృత్వా ॥

తా॥ చక్కగా కనబడుచున్న కొనలు గల లోపల గర్భములేని రెండు దర్భలను అంగుష్ఠమాత్రపు కొలతగల రెండు పవిత్రములను చేయవలెను. అవి చేయునపుడు తృణముగాని కట్టెగాని అడ్డుగానుంచుకొని ఛేదింప వలయును. గోటితో ఛేదింపరాదు. చేతితో నీటిని తాకి ఆ పవిత్రములను నీటితో తుడిచి ప్రోక్షణీ పాత్రయందుంచి నీటిని ప్రోక్షించి ఆ పాత్రయందు నీరు పోసి చేతులందలి బొటనవ్రేలితోను చిటికెన వ్రేలికి ప్రక్కనుండు వ్రేలితోను ఉత్తరపు కొనలుగల పవిత్రములను చేతికి దీసి కొని తూర్పుగా మూడుసార్లు ముందుకు త్రోసి అభిమంత్రించి పాత్రములను ఎత్తి వెలికిలగా త్రిప్పిపెట్టి

మూ॥ ఇధ్మం చ విస్రస్య । త్రిః ప్రోక్ష్య । శేషముత్సిచ్య (త్సృజ్య) । పునః పూరయిత్వా । ప్రోక్షణీం దక్షిణతో నిధాయ । పూర్ణపాత్రమాదాయ । పూర్వవత్కృత్వా । అపరేణాగ్నిం పవిత్రాం తర్హి తే ఆప అనీయ । ఉదగగ్రాభ్యాం పవిత్రాభ్యాం ప్రాచీస్త్రీ (స్త్రి) రుత్పూయ । ముఖసమముద్ధృత్య । సమం ప్రాణైర్హృత్వా । ఉత్తరేణాగ్నిం దర్భేషు సాదయిత్వా । దర్భైః ప్రచ్ఛాద్య । బ్రాహ్మణం దక్షిణతో నిషాద్య ॥

తా॥ ఇధ్మమును (కట్టిన త్రాటిని) వదల్చి, మూడుసార్లు నీరు ప్రోక్షింపవలెను. మిగిలిన నీటిని వదలి పూర్ణపాత్రను తీసికొని అగ్నికి పడమరగానున్న పవిత్రములచేత కప్పబడిన పాత్రమునందు ఉదకము పోసి ఉత్తరపు కొనలుగల రెండు పవిత్రములచేత మూడుసార్లు ముందుగా త్రోసి

ప్రాణస్థానములగు ముఖనాసికములకు సమముగా ఆ పాత్రను పైకి ఎత్తి అగ్నికి ఉత్తరముగా ఆ పాత్రను దర్భలందుంచి దానిమీద దర్భలచేత గప్పి అగ్నికి దక్షిణముగా దర్భలపైని ఒక బ్రాహ్మణుని కూర్చుండబెట్టి

మూ॥ అస్మిన్ ప్రధానహోమాఖ్యే కర్మణి త్వం బ్రహ్మా భవ । బ్రహ్మణః ఇదమాసనమ్ ।

తా॥ ఈ ప్రధానహోమ కర్మయందు నీవు బ్రహ్మవగుము. బ్రహ్మకిది ఆసనము.

మూ॥ ఆజ్యస్థాలీమాదాయ । ఆజ్యం విలాప్య । అపరేణాగ్నిం పవిత్రాం తర్హి తాయా మాజ్యస్థాల్యా మాజ్యం నిరుప్య । ఉదీచోఽంగారాన్నిరూహ్య తేష్వధిశ్రిత్య జ్వలతా తృణేనాధోగామిన్యా దీప్త్యా ఆజ్యే ప్రతిఫలీకృత్య । ద్వే దర్భాగ్రే తృణమంతర్ధాయ ప్రచ్ఛిద్య । ప్రక్షాళ్య । ఆప ఉపస్పృశ్య । ప్రత్యస్య ఆజ్యే ప్రాశ్య । లాజైస్సహ త్రిః పర్యగ్ని కృత్వా । ఉదగుద్వాస్య।అంగారాన్ ప్రత్యూహ్య॥

తా॥ అని నేతిపాత్ర తీసికొని నేయి రాచి కాచి మురికి తీసివేసి అగ్నికి పడమరగా పవిత్రముచేత కప్పబడిన నేతి పాత్రయందు నేతిని పోసి అగ్నికి ఉత్తరముగానున్న అగ్నినుండి కొంచెము అగ్నిని బయటకు తీసి ఆ నిప్పులమీద ఆజ్యపాత్ర పెట్టి మండుచున్న తృణము తీసి క్రిందుగా ప్రసరించిన కాంతిచేత నేతియందు ప్రతిబింబము కలుగునట్లు చేసి రెండు దర్భకొనలను త్రుంచి నీటిలో కడిగి తాను నీటిని తాకి ఆజ్యమందు ఆ రెండు దర్భ తునకలను ఉంచి వెలిగించి ఆ పాత్రకు మూడుసార్లు చుట్టి ఆజ్యపాత్రను ఉత్తరపు తట్టుగా పెట్టి నిప్పులను నిప్పులో పోసి

మూ॥ ఉదగగ్రాభ్యాం పవిత్రాభ్యాం పునరాహారమాజ్యం త్రిరుత్పూయ । ప్రాగారభ్య పశ్చాన్నీత్వా ప్రాగేవ సమాప్తిః । పవిత్రగ్రంథిం విస్రస్య । ప్రక్షాళ్య । ప్రాగగ్రమగ్నౌ పవిత్రే అను ప్రహరతి । యేన జుహోతి తదగ్నౌ ప్రతితప్య । త్రిభిర్దర్భాగ్రైస్సమ్మృజ్య । పునః ప్రతితప్య । ప్రోక్ష్య । నిధాయ । దర్భానద్భిః సగ్ంస్పృశ్యాగ్నౌ ప్రహరతి । ఇధ్మమాదాయ । పరిధీన్పరిదధాతి । ఇధ్మరజ్జుం పూర్ణపాత్రే నిధాయ । అణీయాన్ ద్రాఘీయాన్ దక్షిణార్థ్య ః । అణీయో హ్రసిష్ఠ ఉత్తరార్థ్యః । ఉదగగ్రం మధ్యమం ప్రాగగ్రమితరం । మధ్యమ పరిధిముపస్పృశ్య । పురస్తాదూర్ధ్వ ఆ ఘూర సమిధావాదధాతి ।

తా॥ ఉత్తరపు కొనలు గల రెండు పవిత్రములచేత మాటిమాటికి పైకెత్తి మూడుసార్లు తనకు ముందుగా ఆరంభించి యెదురుగా తీసికొని పోయి తిరిగి ముందుగా తీసికొని వచ్చి పవిత్రముల యొక్క ముడి విప్పి ఆ పవిత్ర దర్భలను కడిగి వానిని అగ్నిలో తూర్పు కొనలు గల్గునట్లు హోమము చేయవలయును. హోమము చేయు పాత్రాదికమును అగ్నిలో కాచి దర్భలచే తుడిచి మరల ఆదర్పి మొ॥ వానిని కాచి ప్రోక్షించి తనకు ఎదురుగా పఱచిన దర్భల మీద ఉంచి దర్భలను నీటిచే తాకించి అగ్నిలో హోమము చేయ వలయును. సమిధను తీసికొని అందులో పొడుగైన సమిధలను అనగా పరిధులను నడుమనుండి పరిధి లావుగాను దక్షిణముగా నుంచి పరిధి మిక్కిలి సన్నముగాను పొట్టిగాను మధ్యపరిధి ఉత్తరపు కొనగాను తక్కిన పైన

చెప్పిన రెండు పరిధులు తూర్పుకొనలు గలిగినవిగాను ఉంచవలయును. రెండు అఘార సమిధలను (హోమము చేయు సమిధలను) దీసికొని నడిమి పరిధిని తాకించి అగ్ని యందుంచవలయును.

మం॥ **అదితేఽను మన్యస్వ ।** (ఇతి దక్షిణతః ప్రాచీమ్)

అ॥ అదితే = దేవతలకు తల్లియగు ఓ యదితీ! అను మన్యస్వ = నన్ను అనుమతింపుము;
అని చెప్పుచు దక్షిణమునుండి తూర్పుగా పరిషేచనము చేయవలయును.

మం॥ **అనుమతేఽను మన్యస్వ ।** (ఇతి పశ్చాదుదీచీమ్)

అ॥ అనుమతే! = చతుర్దశీయుక్త పూర్ణిమనాటి ఒక కళ తక్కువయైన పూర్ణిమాభిమానిని యగు ఓ దేవతా! అను మన్యస్వ = అనుమతింపుము (అని పడమరనుండి ఉత్తరము దాక.)

మం॥ **సరస్వతేఽను మన్యస్వ ।** (ఇత్యుత్తరతః ప్రాచీమ్)

అ॥ సరస్వతి! = ఓ సరస్వతీ ! అను మన్యస్వ = అనుమతింపుము. (ఉత్తరమునుండి తూర్పుదాక)

మం॥ **దేవ సవితః ప్రసువ ।** (ఇతి సమంతాత్ పరిషిచ్య)

అ॥ దేవ! సవితః! = ఓ సూర్య భగవానుడా! ప్రసువ = మమ్ము పరిగ్రహింపుము. అని అగ్నిచుట్టు పరిషేచనము చేయవలయును.

మూ॥ స్రువేణేధ్మమభిఘార్య । ఇధ్మమలంకృత్య । స్వయమలంకృత్య । బ్రహ్మాణమలంకృత్య ।

మం॥ **ఓం చత్వారి శృంగా ... ... ఆవివేశ ॥**

తా॥ స్రువముతో ఇధ్మమందభిఘరించి ఇధ్మముమీద అక్షతలుంచి తాను శిరమున ధరించి బ్రహ్మ శిరమున జల్లి యీ క్రిందిమంత్రమును జదివి వినయముగా నగ్నియందుంచవలెను.
"చత్వారి శృంగా" అను మంత్రమునకు అర్థతాత్పర్యములు పూర్వోక్తములు చూడ వలయును.

మూ॥ అస్మిన్ వివాహప్రధానహోమే బ్రహ్మన్ ఇధ్మమాథాత్స్యే । అథత్స్వ ।

తా॥ ఈ తిథియందు హోమమందు సమిదా ధానము చేయుదును. అని సమిధములను హోమము చేయవలయును. బ్రహ్మ అథానము చేయుము అని పల్కవలెను.

మూ॥ ఇధ్మాధానముహూర్తస్సుముహూర్తోఽస్తు ।

తా॥ సమిధలను వేయు ముహూర్తము సుముహూర్తమగుగాక.

అఘారమనగా వాయవ్యమూల మొదలుకొని ఆగ్నేయమూలవఱకు, నిఋతిమూలమొదలుకొని ఈశాన్య మూలవఱకు నేతిని ధారగా పోయుట.

మూ॥ అఘారావాఘారయతి దర్శపూర్ణమాసవత్తూష్ణీమ్ ।

తా॥ దర్శపూర్ణమాసమువలె మంత్రము లేకయే చేయవలెను.

మూ॥ ఇతర దర్వీమాదాయ । ఉత్తరపరిధిసంధిమన్వహృత్య ప్రజాపతిం మనసాధ్యాయన్ దక్షిణతః ప్రాంచమృజుగ్ం సంతతమాఘారయతి । వాయవ్యాదాగ్నేయాంతమ్ । (జుహుయాత్) ప్రజాపతయ ఇదం న మమ ॥ ఇత్యుక్త్వా ।

తా॥ ఇతరదర్విని తీసికొని ఉత్తరముగా నున్న పరిధిమూలసంధిమొదలుకొని దక్షిణపు పరిధిసంధి వఱకు ప్రజాపతిని మనస్సులో ధ్యానించుచు దక్షిణమునుండి తూర్పువఱకు ఋజువుగాను సంతతముగాను వాయువ్యమునుండి ఆగ్నేయమువఱకు అఘారించ వలయును అనగా హోమము చేయవలెను. ఈ హోమము ప్రజాపతికొఱకు, నాకు కాదు అని చెప్పి.

మూ॥ ప్రధానదర్వీమాదాయ ద్వితీయమైంద్రమితరపరిధిసంధిమన్వవహృత్య ప్రాగుదంచం పూర్వవదా-ఘారయతి । నైఋత్యాదీశానాంతమ్ । (జుహుయాత్) ఇంద్రాయేదం న మమ । అథాజ్య భాగౌ జుహోతి ।

తా॥ ప్రధానదర్విని చేత బట్టుకొని రెండవదియగు ఇంద్రదేవతాకమగు మంత్రమును చెప్పి యితర పరిధి అనగా నిఋతిదిక్కుననుండు పరిధులయొక్క మూలసంధి మొదలు ఈశాన్యదిక్కు వఱకు నేతితో హోమము చేయవలయును. ఈ హోమము ఇంద్రునికొఱకు, నాకు గాదు అని చెప్పవలయును.

మూ॥ ఏకం, ద్వే, త్రీణి, చత్వారి । (ఇత్యాజ్యం గృహీత్వా) అగ్నయే స్వాహా । ఇత్యుత్తరార్ధ పూర్వార్ధే అగ్నయ ఇదం న మమ ॥

తా॥ దర్విలోనికి నేతిని ఒకటి, రెండు, మూడు, నాలుగు మార్లు తీసికొని ఆజ్యభాగములను హోమము చేయవలయును. అగ్ని కర్పితమగు గాక! అగ్నయే స్వాహా, అని ఉత్తరార్ధ పూర్వార్ధములను అగ్నియొక్క ఈశాన్యభాగమందు అగ్నయే ఇదం న మమ = ఈ హోమము అగ్నికొఱకు, నాకు గాదు అని చెప్పి హోమము చేయవలయును.

మూ॥ ఏకం, ద్వే, త్రీణి, చత్వారి । సోమాయ స్వాహా । దక్షిణార్ధ పూర్వార్ధే సోమాయేదం న మమ ।

తా॥ ఒకటి, రెండు, మూడు, నాలుగు సోమున కర్పితమగుగాక. అని దక్షిణార్ధ పూర్వార్ధములయందు అగ్నిమూలయందు హోమము చేయవలయును. సోమునకిది, నాకుగాదు. (ఉపదేశించిన రీతిగా ప్రధానాహుతులను హోమము చేసి ఆఖ్యాతానములను, రాష్ట్రభృత్తులను, ప్రాజాపత్య-మును, వ్యాహృతులను, స్విష్టకృతులను హోమము చేయవలెను. జయాది హోమము చేయవలయును.)

మూ॥ అథైనామాదితో ద్వాభ్యామభిమంత్రయేత ।

తా॥ పిమ్మట ఈ చిన్నదానిని (హృదయమును) అను వాక్యము యొక్క మొదటి రెండు మంత్రములచే నభిమంత్రింపవలెను. ఈ క్రియ నభిముఖుడై చేయుటాచారము.

మం॥ **సోమః ప్రథమో వివిదే గంధర్వో వివిధ ఉత్తరః ।**
**తృతీయో అగ్నిష్టే పతిస్తురీయస్తే మనుష్యజాః ।**
**సోమోఽదదద్గంధర్వాయ గంధర్వోఽదదదగ్నయే ।**
**రయిం చ పుత్రాగ్ంశ్చాదదగ్నిర్మహ్యమథో ఇమామ్ ॥**

అ॥ సోమః = చంద్రుడు; ప్రథమః = మొదటి పెనిమిటి యయి; త్వామ్ = నిన్ను, వివిదే = పొందెను; గంధర్వః = విశ్వావసువను గంధర్వుడు; ఉత్తరః = వాని తరువాత పెనిమిటియై; త్వామ్ = నిన్ను, వివిదే = పొందెను. అగ్నిః = అగ్నిదేవుడు; తే = నీకు; తృతీయః = మూడవవాడైన; పతిః = పెనిమిటి అయ్యె. మనుష్యజాః = మనుష్యునివలనఁ బుట్టిన; అహం = నేను; తే = నీకు; తురీయః = నాల్గవవాడనైన; పతిః = పతిని. సోమః = చంద్రుడు; త్వాం = నిన్ను; గంధర్వాయ = గంధర్వునికొఱకు; అదదత్ = ఇచ్చెను; గంధర్వః = గంధర్వుడు; అగ్నయే = అగ్నికొఱకు; అదదత్ = ఇచ్చెను. అథోః = అనంతరమందు; అగ్నిః = అగ్ని; మహ్యమ్ = నాకొఱకు; రయిం చ = ధనమును; పుత్రాంశ్చ = పుత్రులను; ఇమామ్ = ఈ చిన్నదానవైన నిన్నును; అదాత్ = ఇచ్చెను.

తా॥ ఓ చిన్నదానా! చంద్రుడు నిన్ను ముందుగా వరియించెను. అటు మీదట విశ్వావసువను గంధర్వుడు నిన్ను వరియించెను. వారి యిద్దరియనంతరముల అగ్నిదేవుడు వరియించినందున మూడవ పెనిమిటి యయ్యెను. ఆ దేవతలు పొందిన పిమ్మట మనుష్యజాతియందు పుట్టిన నేను పొందినవాడనగుటచే నాల్గవ పెనిమిటి యయ్యెదను.

చంద్రుడు ముందుగా ఈ చిన్నదానిని పొంది విశ్వావసువను గంధర్వునకిచ్చెను. ఆ గంధర్వుడు అగ్నిదేవునకిచ్చెను. ఆ యగ్ని దేవుడీ చిన్నదానిని నాకొఱకిచ్చి దీనియందు సంతానము కల్గునట్లుగాను, మాకు భాగ్యము గల్గునట్లుగాను అనుగ్రహించెను.

మూ॥ అథాఽస్యై దక్షిణేన నీచాహస్తేన దక్షిణముత్తానగ్ం హస్తం గృహ్ణీయాద్యది కామయేత స్త్రీరేవ జనయేయమిత్యంగులీరేవ గృహ్ణీయాద్యది కామయేత పుగ్ంస ఏవ జనయేయమిత్యంగుష్ఠమేవ । సోభీవాంగుష్ఠమభీవ లోమాని గృహ్ణాతి ॥

తా॥ పిదప వెల్లకిలగా నుండు వధువు కుడిచేతిని వరుడు క్రిందివైపు అడ్డము చేసికొని తన కుడిచేతితో పైవ్రేళ్లను మాత్రము గ్రహింపవలయును. స్త్రీ సంతానమును గోరినచో బొటనవ్రేలినిగాక మిగతా వ్రేళ్లను పట్టుకొనవలయును. పురుష సంతానమును గోరినచో బొటనవ్రేలియందలి రోమములు పైకి ఉండునట్లు వధువు చేతిని పట్టుకొనవలయును.

మూ॥ గృహ్ణామి త ఇత్యేతాభిశ్చతసృభిః ॥

తా॥ క్రింది నాలుగు మంత్రములు చెప్పి కొననే చేయిపట్టుకొనుట

మం॥ **గృహ్ణామి తే సుప్రజా స్త్వాయహస్తం మయా పత్యా జరదష్టిర్యథాఽసః ।**

**భగో అర్యమా సవితా పురంధిర్మహ్యం త్వాఽదుర్గార్హపత్యాయ దేవాః ।**
**తే హ పూర్వే జనాసో యత్రపూర్వవహో హితాః ।**

**మూర్ధన్వాన్ యత్ర సౌభ్రవః పూర్వో దేవేభ్య ఆతవత్ ॥ సరస్వతి ప్రేదమవ సుభగే వాజినీవతి। తాం త్వా విశ్వస్య భూతస్య ప్రగాయామస్యగ్రతః । య ఏతి ప్రదిశస్సర్వా దిశోను పవమానః । హిరణ్యహస్త ఐరంమ్మస్స త్వా మన్మనసం కృణోతు ॥ అంతే హస్తగ్రహణమ్ ।**

**ప్ర+ఇదమ్+అవ = ప్రేదమవ**

అ॥ పత్యా = పెనిమిటినైన; మయా = నాతోగూడ; యథా = ఏ విధముగా; జరదష్టిః = ముసలితనమును; ఆసః = పొందెదవో; తథా = ఆవిధముగా; సుప్రజాస్త్వాయ = యోగ్యమైన సంతానము గల్గుటకొఱకు; తే = నీ యొక్క, హస్తమ్ = హస్తమును; గృహ్ణామి = పట్టుకొను చున్నాను; పురంధిః = విశేషమైన జ్ఞానముగల; అర్యమా = అర్యముడు; భగః = భగుడు; సవితా = సవితృడు అనుపేర్లుగల; దేవాః = దేవతలు; గార్హపత్యాయ = గృహస్థాశ్రమము కొఱకు; త్వామ్ = నిన్ను; మహ్యమ్ = నాకొఱకు; అదుః = ఇచ్చిరి. తే హ = ఆపూర్వోక్తమైన భగుడు మొ॥ వారును; పూర్వవహః = వివాహమునకు పూర్వమందు కర్తలైన వారును; పూర్వే జనాసః = పూర్వులైన తండ్రి మొ॥ మనుష్యులును; యత్ర = ఏగార్హపత్యాశ్రమ విషయమై; హితాః = ప్రయత్నమును కలవారై యుండిరో; మూర్ధన్వాన్ = ప్రధానుడైనవాడును; దేవేభ్యః = దేవతలకంటె; పూర్వః = మొదటివాడును; సౌభ్రవః = అదితి కుమారుడునగు అగ్నిదేవుడు; యత్ర = ఏగార్హపత్యవేదికయందు; ఆతపత్ = అంతట ప్రకాశించుచుండునో; సుభగే ! = ఓ సౌభాగ్యవంతురాలా! వాజినీవతి! = స్తోత్రములు గలదానా! సరస్వతి! = ఓ సరస్వతీ దేవీ! ఇదం = ఈ పాణిగ్రహణమును; ప్రావ = మిక్కిలి రక్షింపుము; తాం త్వా = ఆ పూర్వోక్తమయిన నిన్ను; విశ్వస్య భూతస్య = సమస్త జంతువులలో; అగ్రతః = ముందుగా; ప్రగాయామసి = స్తోత్రమును చేయుచున్నాము. హిరణ్యహస్తః = భక్తులకు ఇచ్చునట్టి బంగారము హస్తమందు కలవాడును; ఐరమ్మః = అన్నమును గల్గింపజేయునట్టి అగ్నిదేవునికి మిత్రుడునగు; యః పవమానః = ఏ వాయువు; సర్వాదిశః ప్రదిశశ్చ = అన్నిదిక్కులను విదిక్కులను; అను ఏతి = క్రమముగా వ్యాపించుచున్నాడో; సః = అటువంటి వాయువు; త్వా = నిన్ను; మన్మనసమ్ = నాయందు మనస్సుకలదానివిగా; కృణోతు = చేయుగాక.

తా॥ ఓ కన్యా! భర్తనైన నాతోపాటు ముసలితనము పొందువఱకు సత్సంతానముకొఱకు నిన్ను గ్రహించుచున్నాను. ఎక్కువ ప్రజ్ఞగల భగదేవత, అర్యముడు, సవిత అను దేవులు గృహస్థా-శ్రమము పొందుటకొఱకు నిన్ను నా కొసగిరి.

ఆ దేవతలు ప్రాచీనులైన జనులు గృహస్థాశ్రమమందుండి వారు పూర్వము వివాహము చేయించువారు. దేవతలలో మొదటివాడగు సూర్యుడు (అగ్ని అని గాని చెప్పవచ్చును) ముఖ్యుడై గృహస్థాశ్రమమందు అంతట ఉండి తపించెను.

ఓ సరస్వతీ! ఈ పాణిగ్రహణకర్మమును చక్కగా రక్షింపుము. అన్నము గల లేక స్తోత్రార్హురాలవగు ఓ సౌభాగ్యవంతురాలా! సమస్త ప్రాణులముందు నిన్ను స్తుతింతును.

వాయువు దిక్కులకు ఉపదిక్కులకును పోవుచున్నవాడై హిరణ్యహస్తుడవు అగ్నిసఖుడవునగు నిన్ను నా యందు ప్రసన్నమైన మనస్సు గల దానినిగా జేయునుగాక అనునది.

**పాణిగ్రహణము**

అగ్ని సమీపమునందు అగ్ని సాక్షిగా "గృహ్ణామి తే" ఇత్యాది నాల్గు మంత్రములతో వధువుయొక్క హస్తమును మంచి సంతానముకొఱకును, యోగ్యమైన కర్మలను చేయుటకొఱకును గ్రహించుచున్నానని చెప్పి వరుడు గ్రహించుట. ఈ ప్రయోజనమును సూచించుటకొఱకే వివాహమున కాదియందు వధూవరులుభయులచేత "ఆవాభ్యాం కర్మాణి కర్తవ్యాని, ప్రజాశ్చ ఉత్పాదయితవ్యా" అని సంకల్పము చేయించెదరు.

మూ॥ అథైనాముత్తరేణాగ్నిం దక్షిణేన పదా ప్రాచీముదీచీం వా దిశమభి ప్రక్రమయతి (ఏకమిష ఇతి) సఖేతి సప్త మే పదే జపతి ॥

తా॥ పిమ్మట నా చిన్నదానిని అగ్నికుత్తరమున కుడికాలితో తూర్పునకు గాని ఉత్తరమునకుగాని "ఏకమిషే" అను నేడు వాక్యములచే నేడడుగులు నడిపించి ఏడవయడుగులో "సఖా సప్త పదా భవ" మొదలు "ఏహి సూనృతే" వఱకు చతుఃస్వరముతో వరుడు జపము చేయవలెను.

మం॥ **ఏకమిషే విష్ణుస్త్వాన్వేతు । ద్వే ఊర్జే విష్ణుస్త్వాన్వేతు । త్రీణి వ్రతాయ విష్ణుస్త్వాన్వేతు । చత్వారి మాయోభవాయ విష్ణుస్త్వాన్వేతు । పంచ పశుభ్యో విష్ణుస్త్వాన్వేతు । షట్ ఋతుభ్యో విష్ణుస్త్వా-న్వేతు । సప్త సప్తభ్యో హోతాభ్యో విష్ణుస్త్వాన్వేతు ।**

అ॥ ఏకమ్ = ఒక అడుగున; ఇషే = అన్నసమృద్ధి గలుగుటకొఱకు; త్వా = నిన్ను విష్ణుః = విష్ణుమూర్తి; అన్వేతు = అనుసరించి నడచుగాక. ఊర్జే = బలము కలుగుటకొఱకు; ద్వే = రెండడుగులను, త్వా = నిన్ను; విష్ణుః = విష్ణువు; అన్వేతు = అనుసరించి నడచుగాక. వ్రతాయ = వ్రతముకొఱకు; త్రీణి = మూడడుగులు; త్వా = నిన్ను, విష్ణుః = విష్ణువు; అన్వేతు = అనుసరించి వెళ్లుగాక. మాయోభవాయ = కర్మసంబంధమైన సుఖముకొఱకు; చత్వారి = నాల్గడుగులు; త్వా = నిన్ను; విష్ణుః = విష్ణుమూర్తి; అన్వేతు = అనుసరించి నడచుగాక. పశుభ్యః = పశుసమృద్ధికొఱకు; పంచ = అయిదడుగులు; త్వా = నిన్ను; విష్ణుః = విష్ణుమూర్తి, అన్వేతు = అనుసరించి నడచుగాక. ఋతుభ్యః = ఋతు సంపత్తులకొఱకు; షట్ = ఆరడుగులను; విష్ణుః = విష్ణుమూర్తి; త్వా = నిన్ను; అన్వేతు = అనుసరించి నడచుగాక. సప్తభ్యః = ఏడుగురైన; హోతాభ్యః = హోతలకొఱకు; త్వా = నిన్ను; సప్త = ఏడడుగులను; విష్ణుః = విష్ణువు; అన్వేతు = అనుసరించి నడచుగాక.

తా॥ ఓ చిన్నదానా! నీవు నన్నుసరించి నడువుము. విష్ణుమూర్తి నీవు నడచు మొదటి అడుగువలన అన్నమును, రెండవ అడుగువలన బలమును, మూడవ అడుగువలన కర్మమును, నాల్గవ

అడుగువలన కర్మసుఖమును, అయిదవ అడుగువలన పశుసమృద్ధిని, ఆరవ అడుగువలన ఋతుసంపత్తును, ఏడవ అడుగువలన యజ్ఞమును (సహాయము చేయుటకు) చేయించుటకు హోత, ప్రశాస్త, బ్రాహ్మణాచ్ఛంసి, పోత, నేష్ట, అచ్ఛావక, ఆగ్నేధ్ర అను ఏడుగురు ఋత్విక్కులను గలుగజేయుగాక.

మం॥ **సఖా సప్తపదా భవ । సఖాయౌ సప్తపదా బభూవ ।**
**సఖ్యం తే గమేయగ్ం । సఖ్యాత్తే మా యోషగ్ం । సఖ్యాన్మే మా యోష్ఠాః ।**
**సమయాన సంకల్పావహై సంప్రియౌ రోచిష్ణూ సుమనస్యమానౌ ।**
**ఇషమూర్జమభిసంవసానౌ సం నౌ మనాగ్ంసి సంవ్రతా సము చిత్తాన్యాకరమ్ ॥**
**సా త్వమస్యమూహమమూహమస్మి సా త్వం ద్యౌరహం పృథివీ త్వగ్ం రేతోఽహగ్ం**
**రేతోభృత్త్వం మనోఽహమస్మి వాక్త్వగ్ం సామాహమస్మృక్త్వగ్ం సా మామనువ్రతా భవ ।**
**పుగ్ంసే పుత్రాయ వేత్తవై శ్రియై పుత్రాయ వేత్తవ ఏహి సూనృతే ॥**

అ॥ సప్తపదా = ఏడడుగులు కూడ నడచిన దానవై; సఖా = స్నేహితురాలవు; భవ = అగుము. సప్తపదా = ఏడడుగులు కూడ నడచిన మనమిద్దఱము; సఖాయౌ = స్నేహితులము; బభూవ = అయ్యెదము. తే = నీయొక్క; సఖ్యమ్ = స్నేహమును; గమేయమ్ = పొందెదను. తే = నీయొక్క; సఖ్యాత్ = స్నేహమువలన; మాయోషమ్ = వియోగమును పొందను. మే = నాయొక్క; సఖ్యాత్ = స్నేహమువలన; మాయోష్ఠాః = వియోగమును పొందకుము. సంప్రియౌ = పరస్పరము ప్రేమకలవారమై; రోచిష్ణూ = అనుకూలమైన దాంపత్యముచే ప్రకాశించువారమై; సుమనస్యమానౌ = మంచిమనస్సులు గలవారమై; ఇషమ్ = అన్నమును; ఊర్జం = బలమును; అభిసంవసానౌ = కలసి అనుభవించువారమై; సమయాన = కలసికొందము; సంకల్పావహై = ఈ కార్యమిట్లు చేయవలయునని ఆలోచించు కొందము. నౌ = మనయొక్క; మనాంసి = మనస్సులను; సమాకరమ్ = కలసికొనునట్లుగా చేసికొందము; తథా = ఆ విధముగా; వ్రతాని = వ్రతములను; చిత్తాని = బాహ్యేంద్రియములను; సమాకరమ్ = కలసికొనునట్లుగా చేసికొందము; త్వమ్ = నీవు; సా = ఋగ్వేదము; అసి = అయితివి. అహమ్ = నేను; ద్యౌః = ఆకాశమయితిని; త్వమ్ = నీవు; పృథివీ = భూమివైతివి; అహమ్ = నేను, రేతః = వీర్యమునుంచువాడను; త్వమ్ = నీవు, రేతోభృత్ = రేతస్సును భరించుదానవు; అహమ్ = నేను; మనః = మనస్సును; అస్మి = అయితిని; త్వమ్ = నీవు; వాక్ = వాక్కువు; అసి = అయితివి; అహమ్ = నేను; సామ = సామవేదము, అస్మి = అయితిని; త్వమ్ = నీవు; ఋక్ = ఋగ్వేదమయితివి; సా = అటువంటి; త్వమ్ = నీవు; మామ్ = నన్నుగురించి; అనువ్రతా = అనుకూలమైన వ్రతముగలదానవై; భవ = అగుము; సూనృతే! = సత్యవాక్కులు గలదానా! పుంసే పుత్రాయ వేత్తవై = పురుష సంతతి పొందుటకును; శ్రియై పుత్రాయ వేత్తవై = భాగ్యముగల సంతతి పొందుటకొఱకును; ఏహి = ఇటు రమ్ము.

తా॥ ఓ చిన్నదానా! మనమిద్దఱము ఏడడుగులు కూడ నడచుటవలన స్నేహము గలవారమైతిమి. కనుక నీ స్నేహమును పొందితిని. నీ స్నేహమునుండి నిన్ను విడువను. నా స్నేహమునుండి నన్ను విడువకుము. మన మిద్దఱము పరస్పరము ప్రేమగలవారమై, అనుకూలమైన దాంపత్యము లభించుటచే ప్రకాశించువారమై, మంచి మనస్సులు గలవారమై, సమానమయిన ఆహార బలములు గలవారమై యీకార్య మెట్లు చేయవలయునని ఆలోచన చేసికొనుచు, మన యుభయుల మనస్సుల నేకముచేసికొని ధర్మ కార్యాదులను చేయుచు గూడి యుందుము, నేను సామవేదమును నీవు ఋగ్వేదము నయితివి. అనగా ఋగ్వేదసామవేదముల వలెనే అవినాభావముగా నుందుము. సంయోగక్రియలబట్టి యూర్ధ్వ మందుండుటచే ఆకాశ సమానుండను. నీవు క్రిందుగ నుండుటచే భూమితో సమానురాలవయితివి. నేను వీర్యము నుంచు వాడను. నీవారేతస్సు గ్రహించుదానవు. ఇంద్రియములలో ప్రధానమైన మనస్సు నేనైతిని. ఆ మనస్సువలన రాబడిన వాక్కు నీవయితివి. ఓ సత్యవాక్కులు గలదానా! అటువంటి నీవు నేఁజేయుధర్మకార్యములకు అనుకూలమైనదానవై యుండుము. నీవలన భాగ్యముగల కుమారుని పొందవలయును గాన ఇటు రమ్ము.

## సప్తపది

వధూవరులిద్దరు ఒకరితోకలిసి ఒకరు అగ్ని సమీపమునకు చేరునట్లు "ఏకమిషే" ఇత్యాది ఏడుమంత్రములతో ఏడడుగులు వేయుట. ఇది వివాహమున మిక్కిలి గమనింపదగిన ప్రధాన విషయము. ఇది జరిగినగాని వివాహము పూర్తియగునట్లు గణింపబడదు. పరస్పరము భార్యాత్వము, పతిత్వమును దీనివల్లనే సంభవించును. అందువలననే గాంధర్వాది వివాహములయందుగూడ

"నోదకేన న వా వాచా కన్యాయాః పతిరుచ్యతే ।
పాణిగ్రహణసంస్కారాత్ పతిత్వం సప్త మే పదే ॥

అనగా ఉదకపూర్వకమైన దానముచేత, వాఙ్మాత్రముచేత పతిత్వమేర్పడదనియు, శాస్త్రీయమైన పాణిగ్రహణ సంస్కారమువలన, సప్తపది అను సంస్కారమువలన పతిత్వ మేర్పడుననియు దీని భావము. ఇంతేకాదు. కన్యకు పితృకులమునుండి గోత్రనివృత్తి సప్తపది సంస్కారమువలననే కలుగునని

స్వగోత్రాద్భ్రశ్యతే నారీ వివాహాత్సప్త మే పదే "

అను వచనమువలన స్పష్టమగుచున్నది. సప్తపది వలననే వివాహమైనట్లు – అని రాజకీయ న్యాయాలయములందును తీర్పు ఇచ్చుచున్నట్లు విజ్ఞులకు తెలిసిన విషయమే. మఱియు సప్తపది సమయమున ఏడవ అడుగునందు జపించు మంత్రమువలన ఈ క్రింది అభిప్రాయము స్పష్టమగుచున్నది. మనమిద్దఱము పరస్పరము సఖ్యమును పెంపొందించుకొనవలెననియు, ఎన్నడు విముక్తులము కాకూడదనియు, గృహస్థాశ్రమములలో చేయు పనులన్నియు పరస్పరము ఆలోచించుకొని సంకల్పించవలెననియు, పరస్పరము ప్రీతితోగూడిన వారము, పరస్పరాశ్రయముచేత దీప్తిగలవారము కాగలము అనియు, మంచి మనస్సుతోగూడిన వారము, మనకున్న ద్రవ్యమును సమానహక్కుతో

అనుభవించగలవారమనియు, మన ఉభయులయొక్క బాహ్యేంద్రియ అంతరింద్రియ వ్యాపారములను సంయోజనము చేయగల వారమనియు ప్రతిజ్ఞ చేయుట.

మూ॥ ప్రాగ్ఘోమాత్ సబ్రహ్మాణం ప్రదక్షిణమగ్నిం కృత్వా యథాస్థానముపవిశ్య అన్వారబ్ధాయా ముత్తరాహుతీర్జుహోతి । సోమాయ జనివిదే స్వాహేత్యేతైః ప్రతిమంత్రగ్ం షోడశాజ్యాహుతీ ర్హుత్వా ।

తా॥ హోమమునకు ముందుగా బ్రహ్మతోగూడిన యగ్నికి ప్రదక్షిణము చేసి తగినచోట కూర్చుండి "సోమాయ జనివిదే స్వాహా" అనువానిచే ప్రతిమంత్రమున పదునారు ఆజ్యాహుతులను హోమముచేసి

మూ॥ ఏకం – ద్వే – త్రీణి – చత్వారి

తా॥ ఒకటి, రెండు, మూడు, నాలుగు

మం॥ **సోమాయ జనివిదే స్వాహా । సోమాయ జనివిద ఇదమ్ ।**

అ॥ జనివిదే = వధువును పొందిన; సోమాయ = చంద్రునికొఱకు; స్వాహా = హవిస్సు నిచ్చుచున్నాను.

తా॥ ముందుగా ఈ వధువును పొందిన చంద్రునికొఱకు ఆజ్యాది హవిస్సు నిచ్చుచున్నాను. వధువును పొందిన సోమునకు హుతమగుగాక.

మం॥ **... ... ... గంధర్వాయ జనివిదే స్వాహా । గంధర్వాయ జనివిద ఇదమ్ ।**

అ॥ జనివిదే = ఆ చంద్రునియనంతరము ఈ వధువును పొందిన; గంధర్వాయ = విశ్వావసువను గంధర్వునికొఱకు; స్వాహా = హవిస్సు నిచ్చుచున్నాను.

తా॥ చంద్రుడు పొందిన పిమ్మట వధువును పొందిన విశ్వావసువను గంధర్వునికొఱకు హవిస్సునిచ్చు చున్నాను.

మం॥ **... ... ... అగ్నయే జనివిదే స్వాహా । అగ్నయే జనివిద ఇదమ్ ।**

అ॥ జనివిదే = గంధర్వుని తరువాత వధువును; అగ్నయే = అగ్నిదేవునికొఱకు; స్వాహా = హవిస్సు నిచ్చుచున్నాను.

తా॥ గంధర్వుని యనంతరము వధువును పొందిన అగ్ని దేవునకు హవిస్సు నిచ్చు చున్నాను.

మం॥ **... ... కన్యలా పితృభ్యో యతీపతిలోకమవదీక్షామదాస్థ స్వాహా । వధ్వై సూర్యాయా ఇదమ్ ।**

తా॥ కన్యలా = కన్యక, పితృభ్యః = తండ్రి గృహమునుండి; పతిలోకమ్ = భర్తృవంశమును గుఱించి; యతీ = వెళ్లుచున్నదియై; దీక్షామ్ = కన్యకా వ్రతమును; అవాదాస్థ = సమాప్తి పొందించు చున్నది. స్వాహా = చక్కగా హుతమగు గాక; వధ్వై సూర్యాయై ఇదమ్ = వధువైన సూర్యకిది.

తా॥ ఈ చిన్నది కన్యకా వ్రతమును ముగించి వివాహమును చేసికొని పిమ్మట తండ్రి గృహము నుండి పతి గృహమునకు వెళ్లుచున్నది.

మం॥ **ప్రేతో ముంచాతి నాముతస్సుబద్ధామముతస్కరత్ ।**
**యథేయమింద్ర! మీఢ్వస్సుపుత్రా సుభగా సతి స్వాహా ॥**
**ఇంద్రాయ మీఢుష ఇదమ్ ॥ (ప్ర+ఇతః = ప్రేతః)**

అ॥ ఇంద్రా! = ఓ యింద్రుడా! మీఢ్వః = వర్షము కురియజేయు; త్వమ్ = నీవు; ఇమామ్ = ఈ చిన్నదానిని; ఇతః = ఈ తండ్రి గృహమునుండి; ప్రముంచాతి = విడిచి పెట్టించుము. అముతః = ఈ పతి గృహమునుండి; న ప్రముంచాతి = విడిచి పెట్టింపకుము. కింతు = ఇకనేమంటే; యథా = ఏ ప్రకారముగా; ఇయమ్ = ఈ స్త్రీ; సుపుత్రా = మంచి కుమారుడు గలదై; సుభగా = ఐశ్వర్యముగలదై; సతి = అగునో; తథా = ఆ విధముగా; ఆముతః = ఈ పతి గృహహునందు; సుబద్ధామ్ = అనురాగముచే బంధింపబడిన దానినిగా; కరత్ = చేయుము. మీఢుషే ఇంద్రాయ ఇదమ్ = వర్షించు ఇంద్రునకిది.

తా॥ వర్షమును కురిపించి సస్యములను వృద్ధి పొందించునట్టి ఓ యింద్రుడా! ఈ చిన్నదానిని వివాహము చేసికొనిన పిమ్మట పుట్టి నింటిపై ఆపేక్షలేనిదిగాను పతి గృహమునందే ఆపేక్ష గలిగి ప్రేమ గలదాని గాను, యోగ్యులైన తనయులు గలదానిగాను. భాగ్యములు గల దానిగాను జేయుము.

మం॥ **ఇమాం త్వ మింద్ర! మీఢ్వస్సుపుత్రాగ్ం సుభగాం కృ(రు) ।**
**దశాఽస్యాం పుత్రానాధేహి పతిమేకాదశం కృధి స్వాహా ॥**
**ఇంద్రాయ మీఢుష ఇదమ్ ॥**

తా॥ ఇంద్ర ! = ఓ యింద్రుడా! మీఢ్వః = వర్షము కురియజేయు; త్వమ్ = నీవు; ఇమామ్ = ఈ చిన్నదానిని; సుపుత్రామ్ = యోగ్యమైన తనయులుగలదానినిగాను; సుభగామ్ = భాగ్యముగల దానినిగాను; కురు = చేయుము. (కురు అని గాని కృణు అని గాని పాఠము) అస్యామ్ = ఈ స్త్రీయందు, దశ = పదిమంది; పుత్రాన్ = కుమారులను; అధేహి = ఉంచుము; పతిం మామ్ = పతియైన నన్ను; ఏకాదశమ్ = పదునొకండవవానినిగా; కృధి = చేయుము. స్వాహా = చక్కగా హుతమగుగాక. మీఢుషే ఇంద్రాయ ఇదమ్ = వర్షము కురియు ఇంద్రునకిది.

తా॥ ఓయింద్రుడా! ఈస్త్రీని మంచి పుత్రులుగల దానినిగాను, భాగ్యము గలదానినిగాను చేసి, దీనియందు దీర్ఘాయుష్మంతులయిన పది మంది కుమారులను గల్గజేసి పుత్రులయొక్క సంఖ్యచే పదునొకండవ వానిగా నని నన్ను జీవింప చేయుము.

మం॥ **అగ్నిరైతు ప్రథమో దేవతానాగ్ం సోఽస్యై ప్రజాం ముంచతు మృత్యుపాశాత్ ।**
**తదయగ్ం రాజా వరుణోఽనుమన్యతాం యథేయగ్ం స్త్రీ పౌత్రమఘం న రోదాద్స్వాహా ॥**
**అగ్నీ వరుణాభ్యామిదమ్ ॥**

అ॥ దేవతానామ్ = దేవతలలో; ప్రథమః = మొదటివాడైన; అగ్నిః = అగ్నిదేవుడు; అస్యై = ఈ చిన్నదానియొక్క; ప్రజామ్ = సంతానమును; మృత్యుపాశాత్ = యమపాశమునుండి; ముంచతు = విడచిపెట్టుగాక; అనగా బహుకాలము జీవించియుండునట్లు చేయుగాక; ఇయమ్ = ఈ; స్త్రీ = ఆడుది; యథా = ఏప్రకారముగా; మోచితా = మృత్యువువలన విడిచి పెట్టింపబడినదై; పౌత్రమ్ = పుత్రసంబంధమైన; అఘమ్ = వ్యసనమునుగుఱించి; న రోదాత్ = దుఃఖించదో, అయమ్ = ఈ, రాజా = రాజగు; వరుణః = వరుణదేవుడును; తత్ = ఆ అగ్నిచే చేయబడిన కార్యమునే; అనుమన్యతామ్ = అంగీకరించుగాక; స్వాహా = ఇది బాగుగా హుతమగుగాక. అగ్నీ వరుణాభ్యామిదమ్ = అగ్ని వరుణులకిది.

తా॥ దేవతలలో మొదటివాడగు అగ్నిదేవుడువచ్చి ఈ చిన్నదానిని, ఈ చిన్నదానియొక్క సంతానమును మృత్యువునకు చెందకుండునట్లుచేసి యీమెకు పుత్రసంబంధమైన దుఃఖమును గలుగకుండునట్లుచేయుగాక. ప్రభువగు వరుణదేవుడును అగ్నిదేవునిచే చేయబడిన యీకార్యమునే అంగీకరించుగాక.

మం॥ **ఇమామగ్నిస్త్రాయతాం గార్హపత్యః ప్రజామ్యస్యై నయతు దీర్ఘమాయుః ।**
**అశూన్యోపస్థా జీవతామస్తు మాతా పౌత్రమానందమభిప్రబుధ్యతామియగ్గ్ం స్వాహా ॥**
**అగ్నయే గార్హపత్యాయేదమ్ ।**

అ॥ గార్హపత్యః = వివాహసంబంధమయిన; అగ్నిః = అగ్నిదేవుడు; ఇమామ్ = ఈ స్త్రీని; త్రాయతాం = రక్షించుగాక; అస్యై = ఈ చిన్నదానియొక్క; ప్రజామ్ = సంతానమును; దీర్ఘమ్ = విశేషమయిన; ఆయుః = ఆయుస్సును; నయతు = పొందించుగాక; ఇయమ్ = ఈ స్త్రీ, అశూన్యోపస్థా = పుత్రులచే అలంకరింపబడిన తొడలుగలదై; జీవతామ్ = చిరకాలము జీవించియుండు పుత్రులచే; మాతా = తల్లి; అస్తు = అవుగాక. ఇయమ్ = ఈస్త్రీ; పౌత్రమ్ = పుత్రసంబంధమైన; ఆనందం = ఆనందమును; అభిప్రబుధ్యతామ్ = పొందుగాక.

తా॥ వివాహసంబంధమైన అగ్నిదేవుడు ఈ చిన్నదానిని, ఈ చిన్నదానికి కలుగు సంతానమును దీర్ఘాయుర్దాయమొసగి రక్షించుగాక. ఈ చిన్నదానియొక్క తొడలు తనయులచే అలంకరింపబడుగాక. ఈ చిన్నదాని సంతానము చిరకాలము జీవించియుండుటచే తత్సంబంధమైన సంతోషమును ఆనందమును ఈ చిన్నది యెల్లప్పుడు పొందుచుండుగాక.

మం॥ **మాతే గృహే నిశి ఘోష ఉత్థాదన్యత్ర త్వద్రుదత్యస్సంవిశంతు ।**
**మా త్వం వికేశ్యుర ఆవధిష్ఠా జీవపత్నీ పతిలోకే విరాజ పశ్యంతీ ప్రజాగ్ం**
**సుమనస్యమానాగ్ం స్వాహా ॥ అగ్నయే గృహపతయ ఇదమ్ । (కేషాం చిత్వారః)**
**వధ్వై సూర్యాయా ఇదమ్ ॥**

అ॥ తే = నీయొక్క; గృహే = గృహమందు; నిశి = రాత్రియందు; ఘోషః = రోదన ధ్వని; మా ఉత్థాత్ = పుట్టకుండు గాక. రుదత్యః = ఏడ్చునట్టి స్త్రీలు; త్వత్ = నీకంటె; అన్యత్ర =

మరియొక స్థలమందు; సంవిశంతు = నివసింతురుగాక; త్వమ్ = నీవు; వికేశీ = తల విరియబోసికొన్న దానవై; ఉరః = ఱొమ్మును, మావధిష్ఠాః = కొట్టుకొనకుము. జీవపత్నీ = జీవించియుండు పెనిమిటి గలదానివై; పతిలోకే = భర్తృగృహమందు; సుమనస్యమానామ్ = క్షేమముగల; ప్రజామ్ = సంతానమును; పశ్యంతీ = చూచుచున్నదానవై; విరాజ = ప్రకాశించుము. అగ్నయే గృహపతయే ఇదమ్ = గృహపతియగు అగ్నికిది. (కొందఱి పాఠములో) వధ్వై సూర్యాయై ఇదమ్ = వధువైన సూర్యకిది.

తా॥ ఓ చిన్నదానా! మన గృహమందు రాత్రియందైనను రోదన ధ్వని పుట్టకుండుగాక. రోదనము చేయువారైన నుండిరేని వారు నీవుండు చోటున నుండక దూరముగా మఱియొక స్థలమందుండు గాక. నీవు తలవిరియబోసికొని యే కారణము చేతనైనను వక్షస్థలము గొట్టుకొనకుము. యోగ్యమైన సంతానమును బొంది యా సంతానమును చిరకాలము జీవించి యుండగా పతిని జూచి సంతోషించుచు ప్రకాశించు చుండుము.

మం॥ **ద్యౌస్తే పృష్ఠగ్ం రక్షతు వాయురూరు అశ్వినౌ చ స్తనంధయంతగ్ం సవితాభిరక్షతు ।**
**ఆవాసనః పరిధానాద్బృహస్పతిర్విశ్వేదేవా అభిరక్షంతు పశ్చాత్ స్వాహా ॥**
**ద్యువాయ్వశ్వి సవితృ బృహస్పతి విశ్వేభ్యో దేవేభ్య ఇదమ్ ॥**

అ॥ తే = నీయొక్క; పృష్ఠమ్ = వెనుకభాగమును; ద్యౌః = ఆకాశము; రక్షతు = రక్షించుగాక. వాయుః = వాయువు, తే = నీయొక్క; ఊరూ = తొడలను; రక్షతు = రక్షించుగాక. అశ్వినౌ చ = అశ్వినీ దేవతలును; స్తనమ్ = స్తనములను; రక్షతాం = రక్షించుగాక, సవితా = సూర్యుడు; ధయంతమ్ = పాలుత్రాగు కుమారుని; అభిరక్షతు = రక్షించుగాక. బృహస్పతిః = బృహస్పతి; పరిధానాత్ = ధరించిన, ఆవాసనః = వస్త్రమువలన (వస్త్రమును) అభిరక్షతు = రక్షించుగాక. విశ్వేదేవాః = విశ్వేదేవతలు; పశ్చాత్ = వెనుకటి భాగమును; అభిరక్షంతు = రక్షించు గాక. ద్యు = ఆకాశము, వాయు = వాయువు; అశ్వి = అశ్వినీ దేవతలు; సవితృ = సూర్యుడు; బృహస్పతి = బృహస్పతి; విశ్వేభ్యః దేవేభ్యః ఇదమ్ = విశ్వదేవతలకు ఇది.

తా॥ ఓ చిన్నదానా! నీకటి ప్రదేశమును ఆకాశము, తొడలను వాయువును, స్తనమును అశ్వినీదేవతలును, కుమారుని సూర్యుడు, ధరించిన వస్త్రమును బృహస్పతియు, వెనుక భాగమును విశ్వే దేవతలును రక్షింతురుగాక, చక్కగా హుతమగుగాక. ఆకాశ, అశ్వినీ, బృహస్పతి, విశ్వేదేవతలకిది.

మం॥ **అప్రజస్తాం పౌత్రమృత్యుం పాప్మానముత వాఽఘం శీర్ష్ణ స్రుజమివోన్ముచ్య ద్విషద్భ్యః ప్రతి ముంచామి పాశగ్గ్ం స్వాహా ॥ వధ్వై సూర్యాయా ఇదమ్ ॥**

అ॥ అప్రజస్తామ్ = సంతానము లేక పోవుటను; పౌత్రమృత్యుమ్ = పుత్రసంబంధమయిన మరణమును; పాప్మానమ్ = పాపమును; ఉత = ఇంతియేకాదు; అఘమ్ = పాపమువల్లనైన

వ్యసనమును; శీర్ష్ణః = శిరస్సునుండి; స్రజమివ = మాలికనువలెనే; ఉన్ముచ్య =తీసి; ద్విషద్భ్యః = శత్రువులకొఱకు; పాశమివ = పాశమును వలె; ప్రతిముంచామి = విడిచి పెట్టించుచున్నాను. స్వాహా = చక్కగా హుతమగుగాక. వధ్వై సూర్యాయై ఇదమ్ = వధువగు సూర్యకు ఇది.

తా॥ సంతానములేమి, పుత్రులు కలిగి నశించుటయు, మఱియు ఇతరమైన పాపముగాని, ఆపాప నిమిత్తమైన వ్యసనముగాని మొదలగు నేదోషములు గలవో అట్టి దోషములను శిరస్సునుండి మాలికను తీసి వృక్షము మొ॥ వానియందుంచిన రీతిగా బంధించు త్రాటిని వలెనే నాశత్రువులకొఱకు విడిచి పెట్టుచున్నాను. స్వాహా, వధువయిన సూర్యకిది.

మం॥ **ఇమం మే వరుణ శృధీ హవమద్యా చ మృడయ ।**
**త్వామవస్యురాచకే స్వాహా ॥ వరుణాయేదం న మమ ॥**

అ॥ వరుణ ! = ఓ వరుణుడా! మే = నా యొక్క; ఇమమ్ = ఈ; హవమ్ = పిలుపును; శృధి = వినుము. అద్యా చ = ఇప్పుడే; మృడయ = సంతోషపెట్టు. అవస్యుః = రక్షణమును గోరినవాడనై; త్వామ్ = నిన్ను, ఆచకే = స్తోత్రము చేయుచున్నాను. స్వాహా = చక్కగా హుతమగు గాక. వరుణాయ ఇదం న మమ = వరుణునకు ఇది, నాకు గాదు.

తా॥ ఓ వరుణదేవుడా! నేను నిన్ను పిలుచునట్టి పిలుపును విని నన్నిప్పుడే సుఖపెట్టుము. నన్ను రక్షించుటకొఱకు నిన్ను స్తోత్రము చేయుచున్నాను. చక్కగా హుతమగుగాక. వరుణునకిది నాకు గాదు.

మం॥ **తత్త్వా యామి బ్రహ్మణా వందమానస్తదాశాస్తే యజమానో హవిర్భిః ।**
**అహేడమానో వరుణేహ బోధ్యురుశగ్ంస మా న ఆయుః ప్రమోషీస్స్వాహా ॥**
**వరుణాయేదం న మమ ॥**

అ॥ వరుణ ! = ఓ వరుణుడా! ఉరుశంస ! = అనేకులు స్తోత్రము చేయదగినవాడా! నః = మాయొక్క; ఆయుః = ఆయుస్సును; మా ప్రమోషీః = హీనపఱపకుము. అహేడమానః = కోపములేనివాడవై; ఇహ = ఈ కర్మమునందు నేజేయు స్తోత్రమును; బోధి = తెలిసికొనుము. తత్ = అనంతరము; త్వా = నిన్ను; యామీ = యజమానుడు; బ్రహ్మణా = వేదముచేతను; వందమానః = నమస్కరించు చున్నవాడై; హవిర్భిః = ఆజ్యాది హవిస్సులచే తృప్తిపఱచుచు; తత్ = నేను కోరునట్టిదానినే; ఆశాస్తే = కోరుచున్నాడు. స్వాహా = చక్కగా హుతమగు గాక. వరుణాయ ఇదమ్ = వరుణునకు ఇది; మమ న = నాకు గాదు.

తా॥ అందఱిచే కొనియాడదగిన ఓ వరుణుడా! మా యాయుస్సును భంగపఱపకుము. మేము చేయునట్టి కర్మములయందు మా పిలుపును కోపము లేనివాడవై వినుము. అనంతరము నా మనస్సునందుండు కోరికలను వేడుచున్నాను. కర్మములనుజేయు ప్రతియజమానుడును నేగోరునట్టి దానినే వేడుచున్నాడు. చక్కగా హుతమగు గాక. వరుణునకు ఇది. నాకు గాదు.

మం॥ **త్వం నో అగ్నే! వరుణస్య విద్వాన్దేవస్య హేడోఽ వయాసిసీష్ఠాః ।**
**యజిష్ఠో వహ్ని తమశ్శోశుచానో విశ్వా ద్వేషాగ్ంసి ప్రముముగ్ధ్యస్మత్ స్వాహా ॥**
**అగ్నీవరుణాభ్యామిదం న మమ ॥**

అ॥ అగ్నే! = ఓ అగ్నిదేవుడా! దేవస్య = దేవుడైన; వరుణస్య = వరుణునకు; నః = మా విషయమై; యత్ = ఏ; క్రోధః = కోపముగలదో; తమ్ = ఆ కోపమును. అవయాసి సీష్టాః = మళ్లిపోవులాగున చేయుము. యజిష్ఠః = మిక్కిలి పూజింపబనవాడవై; వహ్నితమః = హవిస్సులను మోయుచున్న వాడవై; శోశుచానః = మిక్కిలి ప్రకాశించుచు; విశ్వాద్వేషాంసి = శత్రువులకు మాయందుండు అన్ని విరోధములను; అస్మత్ = మావలన; ప్రముముగ్ధి = విడిచిపెట్టించుము. స్వాహా = చక్కగా హుతమగుగాక. అగ్నీవరుణాభ్యాం ఇదమ్ = అగ్నికి వరుణునకు ఇది. మమ న = నాకు కాదు.

తా॥ ఓ యగ్నిదేవుడా! వరుణదేవునకు మాయందుండు కోపమును పోగొట్టుము. యజ్ఞాది కార్యములందు పూజింపఁబడు వాడవును, దేవతల హవిస్సులను మోయుచుండెడివాడవును, మిక్కిలి ప్రకాశించువాడవును అగు నీవు శత్రువులు మాకు జేయు విరోధ కార్యములు మమ్ములను పొందక వ్యర్థమగునట్లు చేయుచుండుము. చక్కగా హుతమగుగాక. అగ్ని వరుణుల కిది. నాకు గాదు.

మం॥ **సత్వం నో అగ్నే ఽవమో భతీవో నేదిష్ఠో అస్యా ఉషసో వ్యుష్టౌ**
**అవయక్ష్వ నో వరుణగ్ం రరాణో వ్రీహి మృడీకగ్ం సుహవో న ఏధి స్వాహా ॥**
**అగ్నీవరుణాభ్యామిదం న మమ ॥**

అ॥ అగ్నే = ఓ అగ్నిహోత్రుడా! అవమః = దేవతలలో మొదటివాడవును; నః = ఆ పూర్వోక్తమైన; ఊతినేదిష్ఠః = రక్షించుటచే సమీపమునందుండువాడవై, భవ = అగుము. అస్య = ఈ; ఉషసః = ప్రాతఃకాలముయొక్క; వ్యుష్టౌ = అవిర్భావము కలిగియుండగా అనగా నిప్పుడేయనుట. రక్ష = రక్షింపుము. వరుణమ్ = వరుణుని; అవయక్ష్వ = కోపము వదలు వానినిగాజేయుము. నః = మాకొఱకు; రరాణః = ఇష్టముల నిచ్చుగాక. మృడీకమ్ = సుఖపెట్టు హవిస్సును; వహి = భక్షించుగాక. సుహవః = మంచి వాహనము గలవాడవై వచ్చి; నః = మమ్ములను; ఏధి = వృద్ధి పొందించుము.

తా॥ ఓ అగ్నిదేవుడా! దేవతలలో మొదటి వాడవును, అప్రసిద్ధమైన నీవు మమ్ములను రక్షించుట కొఱకు ఎల్లప్పుడు మావద్దనుండుము. వరుణుని మాయందు కోపము లేనివానినిగా జేయుము. యజ్ఞాదుల యందు మేమిచ్చునట్టి యాజ్యాదిహవిస్సును భుజించి మంచి వాహనముగల వాడవై వచ్చి మాకోర్కెలను నిండింపుము. చక్కగా హుతమగుగాక. అగ్ని వరుణులకిది. నాకు గాదు.

మం॥ **త్వమగ్నే అయాస్యయాసన్మనసా హితః । అయాస్సన్ హవ్యమూహిషేఽయా నో ధేహి భేషజగ్గ్ం స్వాహా ॥ అయసేఽగ్నయ ఇదమ్ ॥**

అ॥ అగ్నే! = ఓ అగ్నిహోత్రుడా! త్వమ్ = నీవు; అయాః = భక్తులచే పొందదగినవవాడవు; అసి = అయితివి. అయాస్సన్ = భక్తులచే పొందదగినవాడవగుచు; మనసా = మనస్సుచేత; హితః = ధ్యానింపబడుచున్నావు. అయాస్సన్ = భక్తులచే పొందదగిన వాడవగుచు; హవ్యమ్ = మా వంటివారిచే ఇయ్యబడెడి ఆజ్యాది హవిస్సును; ఊహిషే = దేవతలకొఱకు మోసికొనిపోవు చున్నావు. అయాః = భక్తులచే పొందదగిన నీవు; నః = మాకొఱకు; భేషజమ్ = దుఃఖనివృత్తి కరమైన ఔషధమును; ధేహి = కలుగజేయుము; స్వాహా = చక్కగా హుతమగుగాక. అయసే అగ్నయే ఇదమ్ = భక్తులచే పొందదగిన అగ్నికిది.

తా॥ ఓ యగ్నిహోత్రుడా! నీవు భక్తులచే పొందదగినవాడవు గాన నిన్ను మేము మనస్సుచే ధ్యానించు చున్నాము. మాచే నియ్యబడు ఆజ్యాది హవిస్సును దేవతల కొఱకిచ్చినట్టివాడవు. దుఃఖనివృత్తి కరమైన మందును మాకు గలుగజేయుము. చక్కగా హుతమగుగాక. భక్తులకు పొందదగిన అగ్నికిది.

సూ॥ అథైనాముత్తరేణాగ్నిం దక్షిణేన పదాఽశ్మానమాస్థాపయత్యా తిష్ఠేతి ॥

తా॥ పిమ్మట నీచిన్నదానిచేత నగ్ని కుత్తరమున కుడికాలితో క్రింది మంత్రము చెప్పి ఱాతిని త్రొక్కించ వలెను.

## అగ్నికి ప్రదక్షిణము చేయుచు ఱాతిని త్రొక్కించుట

అగ్నికి ప్రదక్షిణముచేయుచు ఒకఱాయిని (ఱాతిని) వధువుచేత "**అతిష్ఠేమమశ్మానమ్**" ఇత్యాది మంత్రములచే త్రొక్కించెదరు. దీని భావము ఈఱాయివలె వధువు గృహస్థాశ్రమములో స్థిరముగా నుండవలెనని కోరుట.

## ప్రధానహోమము

కొన్ని మంత్రములలో అగ్నియందు ఆజ్యమును హోమము చేయుట – భావబంధమేర్పడునట్లు, దీర్ఘాయుష్మంతులగునట్లు, ఐహికాముష్మికములగు అనేక విధములయిన ఫలములను అగ్నిదేవత యనుగ్రహించుగాక – అని హోమసాధన మంత్రములతో ప్రార్థించుట. ఈ క్రియచే అగ్నికి ధార్యాగ్నిత్వము సిద్ధించును. ఇదియు వివాహమునందు వివాహసిద్ధికి ప్రధానమైనది.

మం॥ **అతిష్ఠేమమశ్మానమశ్మేవ త్వగ్గ్ం స్థిరా భవ । అభితిష్ఠ పృతన్యతస్సహస్వ పృతనాయతః ॥**

అ॥ ఇమమ్ = ఈ; అశ్మానమ్ = ఱాతిని; అతిష్ఠ = (ఎక్కుము) అధిష్ఠించుము; త్వమ్ = నీవు; అశ్మేవ = ఱాతివలెనే; స్థిరా = శాశ్వతమైనదానివై; భవ = ఉండుము; పృతన్యతః = యుద్ధము చేయు కోరికగలవారిని; అభితిష్ఠ = ఎదుర్కొనుము; పృతనాయతః = యుద్ధము చేయుచుండెడు వారిని; సహస్వ = సహింపుము.

తా॥ ఓ చిన్నదానా! నీవు ఈ ఱాతిని అధిష్ఠించుము. నీవు ఱాయివలెనే శాశ్వతముగా నుందువు. యుద్ధము చేయువారల నెదుర్కొని ఆ యార్భాటమును సహించి యుద్ధము చేయుము.

**లాజహోమము**

సూ॥ అథాస్యా అంజలావుపస్తీర్య ద్విర్లాజానోప్యం భిఘారయతి । తస్యాస్సోదర్యో లాజానావ పతీత్యేకే । త్రిర్జమదగ్నీనామ్ ॥

తా॥ ఆ తరువాత ఈ చిన్నదానియొక్క దోసిటియందు ఉపస్తరణ చేసి రెండు సార్లు పేలాలుంచి అభిఘరించవలెను. ఆ చిన్నదాని సోదరుడు పేలాలుంచవలెనని కొందరి మతము.

(ఈకేచిత్పక్షమే ఆచారములోనున్నది. ఈ హోమమున గూడ పంచార్షేయులు మూడుసార్లు లాజలుంచ వలెను.)

సూ॥ జుహోతీయం నారీతి ॥

తా॥ "ఇయం నారీ" యను మంత్రమును జెప్పి వరుడే దేవతీర్థముగా (దేవతీర్థమనగా వ్రేళ్లకొనల నుండి యనుట) (స్రుక్కువలెనుండి) హోమము చేయించవలెను.

మం॥ **ఇయం నార్యుపబ్రూతే పూల్యాన్యావపంతికా । దీర్ఘాయురస్తు మే పతిర్జీవాతు శరదశ్శతగ్ం స్వాహా ॥ వధ్వై సూర్యాయా ఇదమ్ ॥**

అ॥ ఇయమ్ = ఈ; నారీ = స్త్రీ; పూల్యాని = పేలాలను; ఆవపంతికా = హోమము చేయుచున్నదై; మే = నా యొక్క; పతిః = పెనిమిటి; దీర్ఘాయుః = దీర్ఘాయువుగలవాడై; అస్తు = అగుగాక, శతమ్ = నూరైన; శరదః = సంవత్సరములను, జీవాతు = జీవించుగాక; ఇతి = అని; ఉపబ్రూతే = పల్కుచున్నది.

తా॥ ఈ చిన్నది పేలాలను హోమము చేయుచు నాభర్త చిరాయువు గల వాడై నూఱు స॥రముల పర్యంతము జీవించి యుండవలయునని మనంబున దలచుచున్నది. చక్కగా హుతమగుగాక. వధువగు సూర్యకిది.

సూ॥ ఉత్తరాభిస్తిసృభిః ప్రదక్షిణమగ్నిం కృత్వాఽశ్మానమాస్థాపయతి యథా పురస్తాత్ ॥

తా॥ తరువాత మూడు ఋక్కులచే అగ్నిని ప్రదక్షిణము చేసి ఇది వరకువలెనే ఱాతిని ఎక్కించవలెను.

మం॥ **తుభ్యమగ్రే! పర్యవహన్ థ్సూర్యాం వహతు నాసహ । పునః పతిభ్యో జాయాం దా అగ్నే ప్రజయా సహ ॥**

మం॥ **పునః పత్నీమగ్నిరదాదాయుషా సహ వర్చసా । దీర్ఘాయురస్యా యః పతిస్స ఏతు శరదశ్శతమ్॥**

మం॥ **విశ్వా ఉత త్వయా వయం ధారా ఉదన్యా ఇవ । అతిగాహేమహి ద్విషః ॥**

మం॥ **అతిష్ఠేమమశ్మాంతమశ్మేవ త్వగ్గ్ం స్థిరా భవ ।**
**అభితిష్ఠ పృతన్యతస్సహస్వ పృతనాయతః ॥**

అ॥ అగ్నే! = ఓ అగ్నిదేవుడా! తుభ్యమ్ = నీ కొఱకు; అగ్రే = ముందుగా; సూర్యామ్ = వివాహాధిష్ఠాన దేవతయగు సూర్యయనుదానిని; వహతు నాసహ = పితృకులమందుండిన చిన్నదానితోగూడ; పర్యవహన్ = ఇచ్చిరి; పునః = ఇప్పుడు; పతిభ్యః = పతియైన నాకొఱకు; ప్రజయా సహ = సంతానముతోగూడ; జాయామ్ (జాయాః) = భార్యగా; దాః = ఇమ్ము.

అ॥ పునః = తిరిగి; అగ్నిః = అగ్నిదేవుడు; ఆయుషా = ఆయుర్దాయముతోడను; వర్చసా హ = వర్చసుతోడను; పత్నీమ్ = భార్యను; అదాత్ = ఇచ్చుగాక; అస్యాః = ఈ స్త్రీయొక్క; యః = ఏ; పతిః = పెనిమిటిగలడో; సః = అతడు; దీర్ఘాయుః = చిరకాలాయుర్దాయముగలవాడై; శతమ్ = నూరైన; శరదః = సం॥రములు; ఏతు = జీవించియుండుగాక.

అ॥ ఉత = అంతేకాదు; అగ్నే! = ఓ అగ్నిదేవుడా! వయమ్ = మేము; త్వయా = నీ సహాయముతో గూడినవారమై; అధ్యాహారము వృషభాదయః = ఎద్దు మొదలయినవి; ఉదన్యాః = ఉదక సంబంధమయిన; ధారా ఇవ = ప్రవాహములవలెనే; విశ్వాః = సమస్తమైన; ద్విషః = శత్రువులను; అతిగాహేమహి = అతిక్రమించి యుండగలము.

అ॥ ఇమమ్ = ఈ; అశ్మానమ్ = ఱాతిని; అతిష్ఠ = అధిష్ఠించుము; త్వమ్ = నీవు; అశ్మేవ = ఱాయివలెనే; స్థిరా = శాశ్వతమైనదానవై; భవ = ఉండుము. పృతన్యతః = యుద్ధముచేయుకోరిక గలవారిని; అభితిష్ఠ = ఎదుర్కొనుము. పృతనాయతః = యుద్ధము చేయుచుండెడివారిని; సహస్వ = సహించుము.

తా॥ ఓ అగ్నిదేవుడా! ఈ చిన్నదానిని తండ్రి మొ॥వారు వివాహాధిష్ఠాన దేవతయగు సూర్యయను దేవతతోగూడ పూర్వమందు నీకిచ్చిరి. ఇప్పుడీ చిన్నదానిని నాకు భార్యగాజేసి దీనియందు నావలన సంతానము పొందునట్లు చేయుము.

తా॥ అగ్నిదేవుడు ఈ చిన్నదానిని దీర్ఘాయువు కాంతి గలదానినిగా జేసి తిరిగి నాకొఱకు భార్యగా నిచ్చుగాక. ఈ చిన్నదానియొక్క పెనిమిటియు చిరకాలాయువు గలిగి నూఱు సం॥రముల పర్యంతము జీవించి యుండుగాక.

తా॥ ఓ యగ్నిదేవుడా! మేము నీ సహాయముగలవారమై యెద్దు మొ॥వి జలప్రవాహములను వలెనే సమస్తమైన శత్రువులను లక్ష్యము చేయక అతిక్రమించి యుండగలము.

తా॥ ఓ చిన్నదానా! నీవు ఈ ఱాతిని అధిష్ఠించుము. నీవు ఱాయివలెనే శాశ్వతముగా నుందువు. యుద్ధము చేయువారల నెదుర్కొని యాయార్భాటమును సహించి యుద్ధము చేయుము.

సూ॥ హోమశ్చోత్తరయా పునః పరిక్రమణమ్ ॥

తా॥ ముందు మంత్రము చెప్పి లాజహోమమున్ను, పిమ్మట మునుపటి వలెనే ప్రదక్షిణమున్ను చేయవలెను.

మూ॥ అస్యా అంజలావుపస్తీర్య ద్విర్లాజానోప్య అభిఘారయతి ॥

తా॥ వధువుయొక్క అంజలియందు రెండు సార్లు పేలాలుంచి నేతిని అభిఘరించుచున్నాడు. ఆమె సోదరుడు పేలాలుంచునని కొందఱు, "అర్యమణమ్" అను మంత్రముతో హోమము చేయును.

మం॥ **అర్యమణం ను దేవం కన్యా అగ్నిమయక్షత । స ఇమాం దేవో అధ్వరః ప్రేతో ముంచాతి నాముతస్సుబద్ధామముతస్కరథ్స్వాహా ॥ అర్యమ్ణేఽగ్నయ ఇదమ్ ।**

అ॥ అర్యమణమ్ = శీఘ్రముగా సంచరించునట్టి; అగ్నిం దేవమ్ = అగ్నిదేవుని; కన్యాః = కన్యకలు (స్త్రీలు); పూర్వమ్ = పూర్వమందు; అయక్షత = పూజించిరి. అధ్వరః = హింసింపని; సః = ఆ; దేవః = అగ్నిదేవుడు; ఇమామ్ = ఈస్త్రీని; ఇతః = ఈ తండ్రి గృహమునుండి; ప్రముంచాతి = విడిచి పెట్టించుగాక. అముతః = భర్తృగృహమునుండి; న ముంచాతి = విడిచి పెట్టింపకుండు గాక; కింతు = ఇకనేమనగా; అముతః = పతిగృహమునందు; ఇమామ్ = ఈస్త్రీని; సుబద్ధామ్ = మిక్కిలి అనురాగము కల దానినిగా; కరత్ = చేయుగాక; స్వాహా = చక్కగా హుతమగుగాక, అర్యమ్ణే అగ్నయే ఇదమ్ = అర్యమయగు అగ్నికి ఇది.

తా॥ పూర్వమందు స్త్రీలు అగ్నిదేవుని పూజించి తమకు ఇష్టమైన భర్తలను పొందిరి. లోకోపకారుడైనట్టి అగ్నిదేవుడీచిన్నదానిని వివాహమైన పిమ్మట తండ్రి గృహమునందపేక్ష వదలించి భర్తృగృహము నకు పంపి అచ్చటనే విశేషానురాగము గలదానిగాఁ జేయుచుండుగాక, చక్కగా హుతమగుగాక, అర్యముడగు అగ్నికిది.

మం॥ **తుభ్యమగ్రే ... ... ... మహి ద్విషః ।**

మం॥ **అతిష్ఠేమం ... ... ... పృతనాయతః ।**

అ॥తా॥ పూర్వోక్తములు.

మూ॥ హోమశ్చోత్తరయా పునః పరిక్రమణమ్ ।

తా॥ ముందు మంత్రమును చెప్పి లాజహోమమున్ను, పిమ్మట మునుపటి వలెనే ప్రదక్షిణమున్ను చేయవలెను.

మూ॥ అస్యా (వధ్వాః) అంజలావుపస్తీర్య ద్విర్లాజనోప్యా, భిఘారయతి

తా॥ పూర్వోక్తము.

(త్వమర్యమా అను మంత్రముచే హోమము చేయును.)

మం॥ **త్వమర్యమా భవసి యత్కనీనాం నామ స్వధావథ్స్వర్యం బిభర్షి ।**
**అంజంతి వృక్షగ్ం సుధితం న గోభిర్యద్దంపతీ సమనసా కృణోషి స్వాహా**
**అర్యమ్ణే అగ్నయ ఇదమ్ ॥**

అ॥ యత్ = ఏ హేతువువలన, కనీనామ్ = కన్యకలకు; స్వధావత్ = అన్నయుక్తమైన; స్వర్యం = స్వర్గఫలమును; బిభర్షి = భరించితివో; తత్ = ఆ హేతువువలన; త్వమ్ = నీవు; అర్యమా =

దాతవు; భవసి = అయియుంటివి. యథా = ఏ ప్రకారముగాను, గోభిః = ఆజ్యాదులచేత; వృక్షమ్ = వృక్షము; న సుధితమ్ = వృద్ధి పొందదో; వృక్షమ్ = వృక్షమును; జలేన = జలముచేత; అంజంతి తడుపుదురో; యత్ = ఏ హేతువువలన; దంపతీ = భార్యాభర్తలను; సమనసా = సమానమైన మనసుగల వారినిగా; కృణోషి = చేయుచున్నావో; తత్ = ఆ హేతువువలన దాతవు.

తా॥ ఓ అగ్ని దేవుడా! ఏ హేతువువలన స్త్రీలను మేమును స్వధా స్వాహా శబ్దయుక్తములైన హవిస్సులు స్వర్గము నీయధీనములైనవో వృక్షము ఆజ్యాదులచే పెరుగక జలముచే నేరీతి పెరుగునో ఆ తీరుగా ఎట్లు దంపతులను అన్యోన్యానురాగముగల వారినిగా జేయుచున్నావో ఆ హేతువువలన నీవు దేవతలలో దాతవై యుంటివి. చక్కగా హుతమగు గాక. అర్యమయగు అగ్నికిది.

మం॥ **తుభ్యమగ్రే పర్యవహ ... ... మహి ద్విషః ॥ అగ్నయ ఇదమ్ ॥**

అ.తా॥ పూర్వోక్తములు.

మూ॥ ఇధ్మసన్నహవాన్యద్భిః సగ్ం స్పృశ్యాగ్నౌ ప్రహరతి । రుద్రాయ తంతిచరాయేదం (న మమ) ॥ అస్య కర్మణః హోమప్రతిష్ఠా సిద్ధ్యర్థమృద్ధికామః జయాదిహోమం కరిష్యే । జయాది ప్రతి పద్యతే । బ్రహ్మ విసర్జనాంతం కృత్వా । స్రువేణాజ్యమాదాయ । జయాదిహోమం కుర్యాత్ ।

తా॥ సమిధను ఇధ్మసన్నహనమును నీటితో తడిపి అగ్నియందు వేయును. తంతి చరుడగు రుద్రునకిది, నాకు గాదు. ఈ కర్మకు హోమప్రతిష్ఠ సిద్ధించుటకొఱకు వృద్ధికాముడనై జయాది హోమప్రతిష్ఠ సిద్ధించుటకొఱకు వృద్ధికాముడనై జయాది హోమమును చేయుదును. స్రువముతో నేయి తీసికొని జయాది హోమముచేయవలయును. (జయాది బ్రహ్మవిసర్జనమయిన పిదప)

మూ॥ ఉత్తరాభ్యాం యోక్త్రం విముచ్య ॥

తా॥ క్రింది రెండు ఋక్కులు చెప్పి వధువు మొలకుగట్టిన త్రాడు విప్పవలెను.

మం॥ **ప్ర త్వా ముంచామి వరుణస్య పాశాద్యేన త్వాబధ్నాత్సవితా సుకేతః ।**
**ధాతుశ్చ యోనౌ సుకృతస్య లోకే స్యోనం తే సహ పత్యా కరోమి ॥**

మం॥ **ఇమం విష్యామి వరుణస్య పాశం యమబధ్నీత సవితా సుశేవః ॥**
**ధాతుశ్చ యోనౌ సుకృతస్య లోకేఽరిష్టాం త్వా సహ పత్యా కృణోమి ॥**

అ॥ సవితా = అన్నింటిని ప్రేరేపణ చేయువాడును; సుకేతః = మంచి చిత్తము గలవాడును అగు వరుణుడు; యేన = ఏ పాశముచే; త్వా = నిన్ను; అబధ్నాత్ = బంధించెనో; వరుణస్య = వరుణదేవునియొక్క; తస్మాత్ = ఆ; పాశాత్ = రజ్జువువలన; త్వా = నిన్ను; ప్రముంచామి = విడిచిపెట్టించుచున్నాను. సుకృతస్య = పుణ్యమునకు; యోనౌ = కారణమైన; ధాతుః = బ్రహ్మయొక్క; లోకే = లోకమునందు; పత్యా = పతియైన; మయా సహ = నాతోగూడ; తే = నీకు; స్యోనమ్ = సుఖకరమగుస్థానమును; కరోమి = చేయుచున్నాను.

అ॥ సవితా = అన్నింటిని ప్రేరణ చేయువాడును; సుశేవః = భక్తులకు సుఖమునిచ్చువాడును అగు వరుణుడు; యమ్ = ఏ పాశమును; అబధ్నీత = బంధించెనో; వరుణస్య = వరుణునియొక్క; ఇమమ్ = ఈ; పాశమ్ = పాశమును; విష్యామి = విప్పుచున్నాను. సుకృతస్య = పుణ్యమునకు; యోనౌ = కారణమైన; ధాతుః = బ్రహ్మయొక్క; లోకే = లోకమునందు; పత్యా సహ = పతియైన నాతోగూడ; త్వామ్ = నిన్ను; అరిష్టామ్ = నాశము లేనిదానివిగా; కృణోమి = చేయుచున్నాను.

తా॥ ఓ చిన్నదానా! వరుణదేవుడేపాశముచే నిన్ను బంధించెనో యట్టి పాశమునుండి నిన్ను వదలించునట్లుగా ఈత్రాటిని విప్పుచున్నాను గాన కల్మషరహితులమై మనమిద్దఱము పుణ్యములచే సుఖమును గలుగజేయునట్టి బ్రహ్మలోకమునందు వసింపగలము.

తా॥ అన్ని జీవములను ప్రేరేపించువాడును భక్తులకు సుఖము నిచ్చు వాడును అగు వరుణదేవుడే పాశముచే బంధించెనో ఆ పాశమునుండి నిన్ను విడిపించునట్లు నీనడుమునుండి ఈత్రాటిని విప్పుచున్నాను. కాబట్టి పుణ్యమునకు కారణభూతమైన బ్రహ్మలోకమునందు మనమిద్దఱము నాశనములేనివారమై యుందుము.

**॥ హరిం ఓమ్ తత్సత్ ॥**

(లాజహోమమందు కన్యయొక్క అన్నగారికి వస్త్రాభరణములు ఇయ్యవలెను. ఇది లోకాచారము)

॥ వివాహ ప్రధానహోమస్సమాప్తః ॥

వివాహ ప్రధానహోమము సమాప్తమైనది.

---

## అథ వివాహ ప్రవేశహోమః

## ప్రవేశహోమము

వధువుతో వరుడు తనయింటికి వచ్చిన పిమ్మట లేదా కన్యాదాతయొక్క అనుమతితో కన్యపితయొక్క గృహమందుగాని తిరిగి అగ్నియందు కొన్ని హోమములను చేయుచు, అగ్నిని గృహయజమానిగా ఉండి, ప్రజాపత్యైశ్వర్యాదులను వృద్ధిపఱచి, దీర్ఘాయుర్భాగ్యముతో గూడిన సర్వ సంపదలను చేకూర్చవలసినదిగా ప్రార్థించుట. ఈ క్రియచే అగ్నికి గృహ్యాగ్నిత్వము సిద్ధించును. ఇదియును ప్రధానమైన కర్మ.

మూ॥ ఆచమ్య… ప్రీత్యర్థమ్ అనయా నవోఢయా వధ్వా సహ వివాహ ప్రవేశహోమం కరిష్యే ।

అగారస్యేశాన ప్రదేశే । వరవధ్వౌ దక్షిణోత్తరావుపవిశతః ।

తా॥ ఆచమనముచేసి … ప్రీతికొఱకు ఈ నవోఢయగా స్త్రీతో గూడ వివాహప్రవేశహోమమును చేయుదును.

ఇంటికి ఈశాన్యప్రదేశమున వరవధువులు దక్షిణోత్తరములుగా కూర్చుందురు.

మూ॥ అగ్నేరుపసమాధానిన్ద్యాజ్య భాగాంతేఽన్వారబ్ధాయా ముత్తరా ఆహుతీర్హుత్వా ॥

ఏకం, ద్వే, త్రీణి, చత్వారి; (పంచ)

తా॥ ప్రజ్వలింపజేయుట మొదలు "సోమాయేదం" వఱకు చేసి తనను వధువు తాకుచుండగా ముందు చెప్పబోవు నాహుతుల జేయవలెను. ఒకటి, రెండు, మూడు, నాలుగు; (ఐదు)

(అగ్న్యుపసమాధానము మొదలు ఆజ్యభాగమువఱకు చేరిన పిమ్మట "అగన్గోష్ఠమ్" అను ప్రతిమంత్రము నందును పదమూడు ఆజ్యాహుతులను హోమము చేయవలయును.)

**మం॥ ఆగన్గోష్ఠం మహిషీ గోభిరశ్వైరాయుష్మత్పత్నీ ప్రజయా స్వర్విత్ ॥
బహ్వీం ప్రజాం జనయంతీ సురత్నేమమగ్నిగ్ం శతహిమాస్సపర్యా త్స్వాహా ॥**

అ॥ ఆయుష్మత్పత్నీ = చిరాయుష్మంతుడైన పతిగల; మహిషీ = నా భార్య; గోభిః = ఆవులతోడను; అశ్వైః = గుఱ్ఱములతోడను; గోష్ఠమ్ = నాగృహమునుగూర్చి; ఆగన్ = వచ్చినదై; బహ్వీమ్ = విశేషమయిన; ప్రజామ్ = సంతానమును; జనయంతీ = కనునదై; ప్రజయా = సంతానముచేత; స్వర్విత్ = స్వర్గమును పొందగలదియగుచు; సురత్నా = అధికమైన ధనముగలది యగుచు; ఇమమ్ = ఈ; అగ్నిమ్ = అగ్నిని (గార్హపత్యాగ్నిని) ; శతహిమాః = నూఱు సం॥రములు; సపర్యాత్ = పరిచర్యంజేయుగాక, స్వాహా = చక్కగా హుతమగుగాక, అగ్నయే ఇదమ్ = అగ్నికి ఇది.

తా॥ ఈ చిన్నది చిరాయువు గల్గిన భర్త గలదియై తలిదండ్రులిచ్చిన ఆవులు గుఱ్ఱములు వీనితోడ నాగృహమునకు వచ్చునది యగుచు, విశేషమయిన సంతానముగలది యగుచు, "అపుత్రస్య గతిర్నాస్తి", అను న్యాయంబున సంతానము గలది యగుటచే స్వర్గలోకమును బొందగలదియు విశేషమయిన భాగ్యము గలదియునై ఈ గార్హపత్యాగ్ని నూఱు సం॥రముల పర్యంతము సేవించుచు చిరంజీవియై యుండుగాక. చక్కగా హుతమగుగాక. అగ్నికి ఇది.

**మం॥ అయమగ్నిర్గృహపతిస్సుసగ్ం సత్పుష్టి వర్ధనః । యథా భగస్యాభ్యాం దదద్రయిం పుష్టిమథో ప్రజాగ్ం స్వాహా ॥ అగ్నయే గృహపతయ ఇదమ్ ॥**

అ॥ అయమ్ = ఈ; అగ్నిః = అగ్నిదేవుడు; గృహపతిః = నా గృహమును రక్షించువాడై; సుసం సత్పుష్టి వర్ధనః = సభయొక్కయు నాయొక్కయు వృద్ధిని పోషించువాడై; భగస్య యథా = భగునకువలెనే అనగా దేవతలకు వలెనే; అభ్యామ్ = దంపతులమైన మా యిద్దఱికొఱకును; రయిమ్ = ధనమును; పుష్టిమ్ = వృద్ధిని; అథో = అనంతరము; ప్రజామ్ = సంతానమును; దదత్ = ఇచ్చుగాక. స్వాహా = చక్కగా హుతమగు గాక. అగ్నయే గృహపతయే ఇదమ్ = గృహపతియగు అగ్నికి ఇది.

తా॥ ఈ అగ్ని మా గృహమును రక్షించువాడై మా సంఘమునకును మాకును పుష్టినొసంగువాడై దేవతలకువలెనే మన యిద్దఱికొఱకును ధనమును, సంతానమును పుష్టిని గలుగజేయుగాక. చక్కగా హుతమగుగాక. గృహపతియగు అగ్నికి ఇది.

మం॥ **ప్రజాయా అభ్యాం ప్రజాపత ఇంద్రాగ్నీ శర్మ యచ్ఛతమ్ । యథైనయోర్న ప్రమీయాతా ఉభయోర్జీవతోః ప్రజాస్స్వాహా ॥ ఇంద్రాగ్నిభ్యామిదమ్ ॥**

అ॥ ప్రజాపతే = ఓ బ్రహ్మా! అభ్యామ్ = ఈ మా యిద్దఱియొక్క; ప్రజాయై = సంతానముకొఱకు; శర్మ = సుఖమును; యచ్ఛ = ఇమ్ము; ఇంద్రాగ్నీ ! = ఓ యింద్రాగ్నులారా! యువామ్ = మీరిద్దఱు; శర్మ = సుఖమును; యచ్ఛతమ్ = ఇందు; యథా = ఏ ప్రకారముగా; ఏనయోః = ఈ; ఉభయోః = ఇద్దఱును; జీవతోః = బ్రతికియున్న వారగుచుండగా; ప్రజాః = సంతానమును; న ప్రమీయాతై = మృతినొందదో; స్వాహా = చక్కగా హుతమగుగాక. ఇంద్రాగ్నిభ్యామిదమ్ = ఇంద్రాగ్నులకిది.

తా॥ ఓ బ్రహ్మా! ఓ ఇంద్రుడా! ఓ అగ్నీ! దంపతులమైన మేమిద్దఱము బ్రతికియున్నంత పర్యంతము మా సంతానము మృతినొందకుండు రీతి రక్షించి వారికి సుఖమును గలుగఁజేయుము.

మం॥ **తేన భూతేన హవిషాఽయమాప్యాయాతాం పునః । జాయాం యామస్మా ఆవాక్షుస్తాగ్ం రసేనాభి వర్ధతాగ్ స్వాహా ॥ ఇంద్రాగ్నిభ్యామిదమ్ ॥**

అ॥ తేన = అటువంటి; భూతేన = పొందబడిన; హవిషా = హవిస్సుచేత; అయమ్ = ఈ అగ్ని; పునః = మాటిమాటికి; ఆప్యాయతామ్ = తృప్తినొందుగాక; అస్మై = ఈ నాకొఱకు; యామ్ = ఏ స్త్రీని; జాయామ్ = భార్యగా; ఆవాక్షుః = ఇచ్చిరో; తామ్ = ఆ భార్యను; రసేన = ఆజ్యాదిరసముచేతను; అభివర్ధతామ్ = వృద్ధిని పొందించుగాక; ఇంద్రాగ్నిభ్యామిదమ్ = ఇంద్రాగ్నులకిది.

తా॥ యజ్ఞాదికర్మముల మాటిమాటికి నేనిచ్చునట్టి ఆజ్యాది హవిస్సుచే తృప్తినొంది అగ్నిదేవుడు నాకు భార్యగా ఏర్పడియున్నస్త్రీకి ఆజ్యాదులను గలుగజేసి పోషించుచుండుగాక. చక్కగా హుతమగుగాక. ఇంద్రాగ్నులకిది.

మం॥ **అభి వర్ధతాం పయసాఽభిరాష్ట్రేణ వర్ధతామ్ । రయ్యా సహస్రపోషనేమౌస్తామనపేక్షితౌ స్వాహా ॥ ఇంద్రాగ్నిభ్యామిదమ్ ॥**

అ॥ ఇయం = ఈస్త్రీ; పయసా = క్షీరములచేతను; అస్మాన్ = మమ్ము; అభివర్ధతామ్ = వృద్ధి నొందించుగాక; రాష్ట్రేణ = గృహక్షేత్రాదులచేత; అభివర్ధతామ్ = వృద్ధినొందించుగాక; సహస్రపోషనా = అనేకులను పోషింపజాలిన; రయ్యా = ధనముచేతను; అభివర్ధతామ్ = వృద్ధినొందించుగాక; ఇమౌ = ఈ దంపతులు; అనపేక్షితౌ = ఇతరాపేక్షలేనివారై ; స్తామ్ = ఉందురుగాక; స్వాహా = చక్కగా హుతమగుగాక; ఇంద్రాగ్నిభ్యామిదమ్ = ఇంద్రాగ్నులకిది.

తా॥ ఈ చిన్నది మమ్ములను క్షీరములు, గృహక్షేత్రములు, ధనము మొ॥ వానిచే పోషించుచుండుగాక. అనగా అవి యన్నియు సమృద్ధిగా నుండుగాక అని యర్థము. ఈ దంపతులకన్నియు గలుగజేసి అన్యాపేక్ష లేకుండు నట్లు చేయవలయును. చక్కగా హుతమగుగాక. ఇంద్రాగ్నులకిది.

మం॥ **ఇహైవస్తం మా వియోష్టం విశ్వమాయుర్వ్యశ్నుతమ్ । మహ్యా ఇంద్ర స్వస్తయే స్వాహా ॥ ఇంద్రాయేదమ్ ॥**

అ॥ అంతరాత్మానౌ = ఓ అంతఃకరణలారా! ఇహైవ = ఈ గృహములందే; స్తమ్ = ఉండుడు; మా వియోష్టమ్ = విడిపెట్టి పోకుడు. విశ్వమ్ = అధికమైన; ఆయుః = ఆయుస్సును; అనగా నూటపదియాఱు సంవత్సరములు; వ్యశ్నుతమ్ = పొందుడు; ఇంద్రః = దేవేంద్రుడు; మహ్యై = విశేషమయిన; స్వస్తయే = సుఖస్థితికొఱకు; భవంతు = అగుగాక. స్వాహా = చక్కగా హుతమగుగాక; ఇంద్రాయ ఇదమ్ = ఇంద్రునకిది.

తా॥ ఈ మంత్రమునందు దంపతులిద్దఱు తమ యంతఃకరణములతో చెప్పుచున్నారు. ఓ మనస్సులారా! ఈ గృహమందే నివసించి యుండుడు. విడిచిపెట్టి పోకుడు. పరమాయుర్దాయ మయిన నూటపదియాఱు సం॥రముల పర్యంతము జీవించియుందురుగాక. ఇంద్రుడును మీసుఖముకొఱకు ప్రయత్నపడును గాక. చక్కగా హుతమగుగాక. ఇంద్రునకిది.

మం॥ **ధ్రువైధి పోష్యా మయి మహ్యం త్వాऽదాద్బృహస్పతిః । మయా పత్యా ప్రజాపతీ సంజీవ శరదశ్శతగ్ం స్వాహా ॥ బృహస్పతయ ఇదమ్ ॥**

అ॥ హే వధు! = ఓ చిన్నదానా! త్వమ్ = నీవు; మయా = నాచేత; పోష్యామ్ = పోషింపబడ దగినదానవై; మయి = నా యందు; ధ్రువా = నిశ్చల భక్తిగలదానవై; ఏధి = వృద్ధిపొందుము. బృహస్పతిః = బృహస్పతి; త్వా = నిన్ను, మహ్యమ్ = నా కొఱకు; ఆదాత్ = ఇచ్చెను. పత్యా = పతియైన; మయా = నాచేత; ప్రజాపతీ = సంతానము గలదానవై; శతమ్ = నూఱు; శరదః = సం॥రములు; సంజీవ = మిక్కిలి జీవింపుము. స్వాహా = చక్కగా హుతమగు గాక. బృహస్పతయే ఇదమ్ = బృహస్పతికి ఇది.

తా॥ ఓ చిన్నదానా! నీవు నావలన పోషింపబడుచు నాయందు నిశ్చలమైన భక్తిగలదానవై వృద్ధిపొందుము. బృహస్పతి నిన్ను నాకొఱకిచ్చెను. కాబట్టి నావలన సంతానమునొంది నీవు నూఱు సం॥రముల పర్యంతము జీవింపుము. చక్కగా హుతమగుగాక. బృహస్పతికి ఇది.

మం॥ **త్వష్టా జాయామజనయత్త్వష్టాऽస్యై త్వాం పతిమ్ । త్వష్టా సహస్రమాయూగ్ంషి దీర్ఘమాయుః కృణోతు వాగ్ స్వాహా ॥ త్వష్ట్ర ఇదమ్ ॥**

అ॥ త్వష్టా = బ్రహ్మ; ఇమామ్ = ఈ స్త్రీని; జాయామ్ = భార్యనుగా; అజనయత్ = పుట్టించెను. త్వష్టా = బ్రహ్మ; అస్యై = ఈ చిన్నదానికొఱకు; త్వామ్ = నిన్ను; పతిమ్ = భర్తనుగా; అజనయత్ = పుట్టించెను. త్వష్టా = బ్రహ్మ; వామ్ = మీ ఇద్దరికొఱకు; సహస్రమ్ =

అనేకమైన; ఆయూంషి = ధనములను; దీర్ఘమ్ = విశేషమయిన; ఆయుః = ఆయుర్దాయమును; కృణోతు = చేయుచుండుగాక; స్వాహా = చక్కగా హుతమగుగాక. త్వష్ట్రే ఇదమ్ = త్వష్ట కిది.

తా॥ ఓ అంతఃకరణమా! బ్రహ్మ యీ చిన్నదానిని నాకు భార్యగాఁ బుట్టించెను. నన్ను ఈ చిన్నదానికి పెనిమిటిగాఁ బుట్టించెను. ఆ బ్రహ్మదేవుడు మాయిద్దఱకును విశేషమయిన ధనమును గలుగజేసి చిరాయుర్దాయమును చేయుగాక. చక్కగా హుతమగుగాక. త్వష్టకిది.

మం॥ **ఇమం మే వరుణ ... ... రాచకే స్వాహా । వరుణాయేదమ్ ॥ ప్రాగుక్తమ్ ।**

మం॥ **తత్త్వా యామి ... ... ప్రమోషీ స్స్వాహా ॥ వరుణాయేదమ్ ॥ ప్రాగుక్తమ్ ।**

మం॥ **త్వన్నో అగ్నే ... ... ముగ్ధ్యస్మత్స్వాహా ॥ అగ్నీవరుణాభ్యామిదమ్ ॥ ప్రాగుక్తమ్ ।**

మం॥ **సత్త్వం నో ... ... ఏధి స్వాహా ॥ అగ్నీవరుణాభ్యామిదమ్ ॥ ప్రాగుక్తమ్ ।**

మం॥ **త్వమగ్నే ... ... భేషజగ్గ్ స్వాహా అయసేఽగ్నయ ఇదమ్ ॥ ప్రాగుక్తమ్ ।**

మం॥ **సమిధమిధ్మసన్నహనం ... ... విసర్జనాంతే । ప్రాగుక్తమ్ ।**

సూ॥ ఉత్తరయా చర్మణ్యుపవిశత ఉత్తరో వరః ।

తా॥ ముందు ఋక్కు (ఇహగావః అను మంత్రము) చెప్పి ఇదివరకే పఱచియుంచిన యెద్దు చర్మముమీద నుత్తర వరుడుగా నిద్దరును కూర్చుండవలెను. (చర్మము వాడుటాచారములేదు.)

మం॥ **ఇహగావః ప్రజాయధ్వమిహాశ్వా ఇహ పూరుషాః ।**
**ఇహో సహస్రదక్షిణో రాయస్పోషో నిషేదతు ॥**

అ॥ హే గావః = ఓ ధేనువులారా! ఇహ = ఈ గృహమునందు; ప్రజాయధ్వమ్ = ప్రసవింపుడు. అశ్వాః = ఓ గుఱ్ఱములారా! ఇహ ప్రజాయధ్వమ్ = ఈ గృహమునందు ప్రసవింపుడు. పూరుషాః = ఓ పురుషులారా! ఇహ = ఈ గృహమందు; ప్రజాయధ్వం = ప్రసవింపుడు అనగా ప్రసవకారణము కందు. ఇహో = ఇక్కడనే; సహస్రదక్షిణః = విశేషముగా ధర్మము చేయుటకు తగిన; రాయస్పోషః = ధనవృద్ధి, నిషేదతః = ఉండుగాక.

తా॥ ఓ ధేనువులారా! ఓ గుఱ్ఱములారా! ఓ పురుషులారా! ఈ గృహములందే సంతానము కలవారలై కుటుంబవృద్ధి ధనవృద్ధి గల్గియుందురు గాక.

సూ॥ అథాస్యాః పుగ్గం స్యోర్జీవ పుత్రాయాః పుత్రమంక ఉత్తరయోపవేశ్య ॥

తా॥ పిమ్మట పురుషలను మాత్రమే కని బిడ్డలందఱును క్షేమముగా నున్న యొక్క ఇల్లాలి కుమారుని ముందు మంత్రము ( సోమేనాదిత్యా అను మంత్రము) చెప్పి వధూసమీపమున గూర్చుండ బెట్టవలెను.

మం॥ **సోమేనాదిత్యా బలినస్సోమేన పృథివీ దృఢా।అథో నక్షత్రాణామేషాముపస్థే సోమ ఆధి(హి) తః॥**

అ॥ ఆదిత్యా ః = దేవతలు; సోమేన = సోమరసముచేత; బలినః = బలము గలవారు; పృథివీ = భూమి; సోమేన = లతావిశేషముచేత; దృఢా = దృఢమయినది, అథో = అనంతరము; ఏషామ్ = ఈ; నక్షత్రాణామ్ = నక్షత్రములయొక్క; ఉపస్థే = తొడయందు; అయమ్ = ఈ; బాలః = పిల్లవాడు; ఉపవిశతు = కూర్చుండుగాక.

తా॥ దేవతలు సోమపానముచే బలముగలవారైరి. భూమియు సోమలత మొ॥వానిచే దృఢమై యున్నది. ఈనక్షత్రములయొక్క తొడయందనగా సమీపమునందు చంద్రుడును ఏర్పఱుపబడెను. (ఇక్కడ సోమశబ్దము చంద్రపరముగాను లతాపరముగాను శ్లేషింపబడినది.) ఈ ప్రకారము ఈ పిల్లవాడు నీతొడయందు గూర్చుండుగాక యని యొక పిల్లవానిని వధువు తొడయందు గూర్చుండబెట్ట వలయును.

సూ॥ తస్మై ఫలాన్యుత్తరేణ యజుషా ప్రదాయ ।

తా॥ ముందు ఋక్కు (ప్రస్వస్థః అనుదానిని) చెప్పి అతనికి ఫలప్రదానము చేయవలెను.

మం॥ **ప్రస్వస్థః ప్రేయం ప్రజయా భువనే శోచేష్ట ।**

అ॥ హే ఫలాని = ఓఫలములారా! యూయమ్ = మీరు; ప్రస్వః = ప్రసవించు స్వభావముగలవారు; స్థ = అయితిరి; తథా = ఆ విధముగా; ఇయమ్ = ఈ స్త్రీ; భువనే = లోకమునందు; ప్రజయా = సంతానముచేత; శోచేష్ట = ప్రకాశించుగాక.

తా॥ ఓ ఫలములారా! మీరేప్రకారముగా చెట్లను పుట్టించు స్వభావముగల వారలో ఆప్రకారమే ఈ చిన్నదియు సంతానముగలదై ప్రకాశించుగాక యని ఆ పిల్లవానికి ఫలముల నీయవలెను.

సూ॥ ఉత్తరే జపిత్వా వాచం యచ్ఛతః ఆ నక్షత్రేభ్యః ।

తా॥ క్రింది రెండు ఋక్కులు జపించి నక్షత్రదర్శన మగువఱకు నాదంపతులు మౌనముగా నుండవలెను.

మం॥ **ఇహ ప్రియం ప్రజయా తే సమృధ్యతా మస్మిన్గృహే గార్హపత్యాయ జాగృహి ।**
**ఏనా పత్యా తన్వగ్ం సగ్ంసృజ స్వాధా జీవ్రీ విదథమావదాథ ॥**

అ॥ ఇహ = ఈ గృహమునందు; ప్రజయా = సంతానముచేత; తే = నీకు; ప్రియమ్ = ప్రీతి; సమృధ్యతామ్ = అధికము కాబడుగాక; అస్మిన్ = ఈ; గృహే = గృహమునందు; గార్హపత్యాయ = గృహపతిధర్మముకొఱకు; జాగృహి = జాగ్రత్తగలదానవగుము. ఏనా = ఈ; పత్యా = పతియైన నాతోగూడ; తన్వమ్ = నీశరీరమును; సంసృజస్వ = సంభోగకాలమందు కలిసికొను నట్లు చేయుము. అథ = అనంతరము; జీవ్రీ = ముసలిదానవగుచు; విదథమ్ = అనేక విషయములను; తనయాదీనాం = పుత్రులు మొ॥ వారికి; ఆవథ = చెప్పుచుండుము.

తా॥ ఓ చిన్నదానా! ఈ గృహమందు నివసించి కాపురము చేయుచు సంతాన సమృద్ధికలదాన వగుము. ఈ గృహమునందుండియే గృహస్థుని ధర్మమగు అతిథ్యభ్యాగతులను పూజించు చుండుము. పతియైన యీనాతోడను సంభోగకాలమందు ఆలింగనాదులచే నీశరీరమును నాశరీరముతో గూర్చుచుండుము. అనంతరము ముసలిదానవగుచు ఈ కార్యమిట్లు చేయవలయునని నీపుత్రులు మనుమలు మొ॥వారికి బోధించుచుండుము.

మం॥ **సుమంగలీరియం వధూరిమాగ్ం సమేత పశ్యత । సౌభాగ్యమస్యై దత్వా యథాస్తం విపరేతన॥**

అ॥ ఇయమ్ = ఈ; వధూః = ఆడుది; సుమంగలీః = చిరకాలము సువాసినీత్వము పొందుగాక; ఇమామ్ = ఇటువంటిస్త్రీని; సమేత = వచ్చి; పశ్యత = చూతురుగాక; అస్యై = ఈ చిన్నదాని కొఱకు; సౌభాగ్యమ్ = సౌభాగ్యమును; దత్వా = ఇచ్చి; అథ = అనంతరము; అస్తమ్ = మీమీయిండ్లకు; విపరేతన = స్వేచ్ఛగా వెళ్ళుదురుగాక.

తా॥ బహుకాలమువఱకు సువాసినీత్వము గల్గియుండెడి ఈ చిన్నదానిని మీరందఱు వచ్చి చూచి యీ చిన్నదానికొఱకు ఆయుర్భాగ్యముల నొసగి అనంతరము మీయిండ్లకు స్వేచ్ఛగా చనుడు. వివాహమును జూడవచ్చిన వారినుద్దేశించి యీమంత్రము చెప్పబడినది.

సూ॥ ఉదితేషు నక్షత్రేషు ప్రాచీముదీచీం వా దిశముపనిష్క్రమ్య ఉత్తరాభ్యాం యథాలింగం ధ్రువమరుంధతీం చ దర్శయతి ॥

తా॥ నక్షత్ర దర్శనమైన పిమ్మట తూర్పుగాగాని ఉత్తరముగాగాని బయలుదేరి క్రింది మంత్రలింగమును బట్టి ధ్రువుని మొదటి మంత్రముచేతను, అరుంధతిని రెండవమంత్రముచేతను జూపవలెను.

మం॥ **ధ్రువక్షితిర్ధ్రువయోనిర్ధ్రువమసి ధ్రువతస్థితమ్ ॥**
**త్వం నక్షత్రాణాం మేథ్యసి స మా పాహి పృతన్యతః ॥**

**సప్తర్షయః ప్రథమాం కృత్తికానామరుంధతీం యద్ధ్రువతాగ్ం హ నిన్యుః షట్ కృత్తికా ముఖ్యయోగం వహంతీయమస్మాకమేధత్వష్టమీ ॥**

అ॥ ధ్రువక్షితిః = నాశరహితమైన నివాసముగలదానవు; ధ్రువయోనిః = నాశనములేని కారణముగల దానవు; త్వమ్ = నీవు; ధ్రువతఃస్థితమ్ = ఇతరనక్షత్రములకు నాశనరహితత్వము సూచించుచు; ధ్రువమ్ = నాశనములేనిదానవు; అసి = అయితివి; నక్షత్రాణామ్ = నక్షత్రములకు; త్వమ్ = నీవు; మేథీ = కట్టుకొయ్యవు; అసి = అయితివి; సః = అటువంటి; త్వం = నీవు; మాం = నన్ను; పృతన్యతః = యుద్ధముచేయువారివలన; పాహి = రక్షింపుము.

తా॥ ఓ ధ్రువనక్షత్రమా! నీవు నాశనములేని నివాసము కలదానవును; నాశనములేని కారణము కలదానవునై నీవు నాశనము లేని దానవునగుచు ఇతర నక్షత్రములు స్థిర పదమును పొందుటకు మార్గదర్శివయితివి. నక్షత్రములన్నియు నిన్ను ఆధారము చేసికొని నీచుట్టు తిరుగుచున్నవి. కాబట్టి నీవు మాతో యుద్ధము చేయుటకు ఎవరైన వచ్చిరేని వారివలన మాకు బాధ కలుగకుండునట్లు చేయుము.

అ॥ యత్ = ఎప్పుడు; సప్తఋషయః = ఏడుగురు మునులును; కృత్తికానామ్ = మునులయొక్క యేడుగురు భార్యలలో; అరుంధతీమ్ = వశిష్ఠుని భార్యయగు అరుంధతీదేవిని; ప్రథమామ్ = ముందు గణనచేయదగినదిగాను; ధ్రువతామ్ = నాశరహితురాలనుగాను; నిన్యుః = పొందించిరో అనగా నెంచిరో; తథా = అప్పుడు; షట్కృత్తికాః = అరుంధతిగాక మిగిలిన యాఱుగురును; ముఖ్యయోగమ్ = అరుంధతి యంగ్రగణ్యత్వము; వహంతి = భావించిరి; తథా = ఆప్రకారముగా; ఇయమ్ = ఈ చిన్నది; అస్మాకమ్ = మాకు; అష్టమీ = ఎనిమిదవది యగుచు; ఏధతు = వృద్ధి పొందుగాక.

తా॥ కశ్యపుడు మొదలగు ఏడుగురు మునులును తమ యేడుగురు భార్యలలో అరుంధతీదేవి యగ్రగణ్యురాలనియు మనస్సునందైనను వ్యభిచారాది గుణములు లేనిదగుటచే నిశ్చల మయినదనియు తలచిరి. అందువలన అరుంధతిగాక తక్కిన యాఱుగురు స్త్రీలు అరుంధతిని తమలో నగ్రగణ్యురాలను భావము వహించిరి. అట్లే యీ చిన్నదానిని ఆ యేడుగురికి పిమ్మట ఎనిమిదవదానిగాను పవిత్రమైనదానిగాను తలంచితిమి గాక. ఈ చిన్నది వృద్ధిపొందుగాక. ఇచ్చట భర్త సప్తర్షులకు పిమ్మట తానెనిమిదవ ఋషినని భావించు కొన్నట్లు అర్థాత్తు సిద్ధించుచున్నది.

మూ॥ కశ్యపోఽత్రిర్భరద్వాజో విశ్వామిత్రోఽథ గౌతమః ।
వశిష్ఠో జమదగ్నిశ్చ సప్తైతే ఋషయస్తథా ॥
ప్రజాపతేః కర్దమస్య దేవహూత్యామభూత్సుతా ।
అరుంధతీ వశిష్ఠస్య పత్న్యభూల్లోకపూజితా ॥ – శ్రీమద్భాగవతే ।

మూ॥ అరుంధతీసహిత సప్తఋషి దేవతాభ్యోనమః । ఇదమర్ఘ్యం సమర్పయామి ॥

తా॥ అరుంధతితోగూడిన సప్తర్షి దేవతలకు నమస్కారము. ఈ యర్ఘ్యము సమర్పించుచున్నాను.

అథాశీర్వాదః ॥

ఇతి వివాహప్రవేశహోమస్సమాప్తః ।

## ధ్రువారంధతీ నక్షత్ర దర్శనం

ఈ రెండు నక్షత్రములను చూచునపుడు ధ్రువనక్షత్రమువలె స్థిరమైనదిగాను, అరుంధతీ నక్షత్రము వలె పవిత్రమైనదిగాను వధువు ఉండవలెనని "ధ్రువక్షితి" రిత్యాది రెండు మంత్రములతో కోరుట.

## ఆగ్నేయ స్థాలీపాకము

దీనివలన అగ్నిపరిచర్యకు అనుకూలమైన అగ్నిని సంపాదించుట. ఇదియు వివాహమునకు ప్రధానమైనదిగా చెప్పవలెను. "**స్థాలీపాకాంతో వివాహః**" అని శాస్త్రకారులు చెప్పుచుండిరి. దీనితోగాని ఔపాస నారంభమునకు అధికారము సంభవింపదు.

మూ॥ ప్రాణానాయమ్య ... ... ఓం భూః ... ... ఏవంగుణ ... ... ప్రీత్యర్థమ్ ఏనాం వధూమాగ్నేయ స్థాలీపాకేన యాజయిష్యే ॥ ఇతి సంకల్ప్య ॥

తా॥ ప్రాణాయామము చేసి... ... ఓం భూః... ... ఇట్టి గుణములు గల ... ... ప్రీతికొఱకు ఈ వధువును ఆగ్నేయ స్థాలీపాకముచే యజ్ఞము చేయింతును అని సంకల్పము చేయవలెను. (చేసి)

(సూ॥ అథైనామాగ్నేయ స్థాలీపాకేన యాజయతి పత్న్యవహంతి చరుగ్ం శ్రపయిత్వాఽభిఘార్య ప్రాచీనముదీచీనం వోద్వాస్య ప్రతిష్ఠితమభిఘార్య॥)

తా॥ ధ్రువారంధతీ దర్శనానంతరము ఈ పెండ్లికుమార్తెచేత ఆగ్నేయ స్థాలీపాకము చేయించవలెను. అనగా భార్య పాకమునకు బియ్యము నిమిత్తము ధాన్యము దంపుట చెరగుట కడుగుట చేయవలెను. పాకము మొదలగు తంత్రము ఋత్విక్కువలె వరుడు చేయవలసినదే. అత్తెసరును వైదికాగ్నియందు వండి దాని యందభిఘరించి తూర్పుననైన ఉత్తరమునైన దింపి పిమ్మట సౌకర్యమైన చోట నుంచి యభిఘరించవలెను.

మూ॥ ఆగ్నేరుప సమాధానా ద్యాజ్యభాగాంతేఽన్వారబ్ధాయాగ్ స్థాలీపాకజ్జుహోతి ।

తా॥ '**భూర్భువస్సువరోమ్**' అని అగ్నిని ప్రజ్వలింప జేసినది మొదలు **సోమాయేదం** వఱకు చేసి భార్య తనను స్పృశించి యుండగా హవిస్సును హోమము చేయవలెను. (ఉపస్తరణము మొదలు ప్రధాన హోమమగువఱకు స్పృశించి యుండుట)

మూ॥ సకృదుపస్తరణా 'భిఘారణే' ద్విరవదానమ్ ॥

తా॥ దర్వియందొకమారును, అవదానమైన హవిస్సు నందొకమారును అభిఘరించ వలెను.

మూ॥ దర్వ్యాముపస్తీర్య హవిషో మధ్యాదంగుష్ఠపర్వమాత్రమవదానం తిరశ్చీనమవద్యతి ॥

తా॥ దర్వియందితర దర్వితో నభిఘరించి హవిస్సుయొక్క మధ్యనుండి బొటనవ్రేలి పర్వమునకు తగులునంత హవిస్సును చేతినడ్డము త్రిప్పి దర్వియందుంచు కొనవలెను.

మూ॥ పూర్వార్ధాద్ద్వితీయమసూచీనం పంచావత్తినః పశ్చార్ధాత్ తృతీయమ్ ।

తా॥ అత్తెసరులో మధ్యభాగమునకు తూర్పునుండి రెండవ యవదానము త్రయార్షేయులును, నడుమ భాగమునకు పడమటినుండి మూడవ యవదానము పంచార్షేయులును చేయవలెను.

మూ॥ అభిఘార్య హవిః ప్రత్యభిఘారయతి ।

తా॥ అభిఘరించి స్విష్టకృత్తు నిమిత్తమత్తెసరులో నభిఘరించవలెను.

మూ॥ అగ్నిర్దేవతా స్వాహాకార ప్రదానః । అగ్నయే స్వాహా । ఆఘారసంభేదే జుహోతి । అగ్నయ ఇదం న మమ ॥

తా॥ దీనికగ్ని దేవత (చతుర్థిచేత) స్వాహాకారములో హోమము ఆఘారములు కలిసిన చోట (అనగా మధ్యగా) చేయవలెను.

మూ॥ అపి వా సకృదుపహత్య జుహుయాన్నతు పూర్వవచ్చతురవత్తం పంచావత్తం వా ॥

తా॥ అట్లుకాకున్న నొక్కమారు దర్వితో హవిస్సును తీసికొని హోమము చేసినను సరియె. ఈపక్షమందు త్ర్యార్షేయ, పంచార్షేయ భేదమున్ను ఉపస్తరణావదాన ధర్మములున్ను లేవు.

మూ॥ అగ్నిస్విష్టకృద్ద్వితీయః దర్వ్యాముపస్తీర్య ఉత్తరార్ధాత్సకృత్స్విష్ట కృతేఽవదాయ ద్విరభిఘార్య న హవిః ప్రత్యభిఘారయతి ॥

తా॥ రెండవది అగ్నికి స్విష్టకృద్ధోమము. సృక్కునందుపస్తరణచేసి హవిర్మధ్యభాగమున కుత్తరమునుండి యొక్కమారు స్విష్టకృత్తుకొఱకు అవదానము చేసికొని రెండుసార్లు అభిఘరించవలెను. స్థాలియందభిఘరించనక్కరలేదు.

మూ॥ సకృదుపస్తరణావదానే ద్విరభిఘారణం మధ్యాత్పూర్వస్యావదానం మధ్యే హోమః ఉత్తరార్ధా దుత్తర స్యోత్తరార్ధ పూర్వార్ధే । అగ్నయే స్విష్టకృతే స్వాహా ।

అగ్నయే స్విష్టకృత ఇదం న మమ ॥

తా॥ ఉపస్తరణము, అవదానము ఒక్కసారిన్ని రెండుసార్లభిఘారమున్ను మొదటిహోమమునకు హవిస్సులో మధ్యనుండి యవదానమున్ను, అగ్నిలో మధ్యగా హోమమున్ను రెండవ స్విష్టకృత్తు నకు హవిర్మధ్య కుత్తరమునుండి యవదానము అగ్నిలో నీశాన్యమున హోమము చేయవలెను.

(సూత్రముననుసరించి వ్రాయవలసివచ్చిన విషయమిది క్లుప్తముగా గమనించవలెను.)

మూ॥ దర్వ్యాముపస్తీర్య । చరుమధ్యాద్ద్విరవదాయాభిఘార్య హవిః ప్రత్యభిఘారయతి ॥

తా॥ సృక్కునందుపస్తరణ చేసి హవిర్మధ్యనుండి రేగుపండంత రెండు సార్లుంచుకొని యభిఘరించి హవిస్సులో నభిఘరించవలెను.

మం॥ **అగ్నయే స్వాహా । అగ్నయ ఇదం న మమ ।**

తా॥ అగ్నియందర్పితమగుగాక. అగ్నికిది. నాకు గాదు.

మూ॥ దర్వ్యాముపస్తీర్య । ఉత్తరార్ధాత్సకృత్స్విష్ట కృతేఽవదాయ ద్విరభిఘార్య ।

తా॥ మరల స్రుక్కునందభిఘరించి హవిస్సులో నుత్తరమునుండి ఒక్కమారు స్విష్టకృత్తునిమిత్త మవదానము చేసికొని రెండుసార్లు అభిఘరించవలెను.

మం॥ **అగ్నయే స్విష్టకృతే స్వాహా । అగ్నయే స్విష్టకృత ఇదం న మమ ॥**

తా॥ శుభమయిన ఇష్టమును జేసిన అగ్నికర్పితమగు గాక. శుభమైన ఇష్టమును జేసిన అగ్నికిది. నాకు గాదు.

మూ॥ ఇధ్మసన్నహ నాన్యద్భి స్సగ్గ్స్పృశ్యాగ్నౌ ప్రహరతి రుద్రాయ తంతి చరాయేదమ్ ॥

తా॥ ఇధ్మరజ్జువును విప్పి ఉదకముతో తుడిచి అగ్నియందు పడవేయవలెను.

మూ॥ అప ఉపస్పృశ్య । లేపయోః ప్రస్తరవత్తూష్ణీం బర్హిరక్త్వాఽగ్నౌ ప్రహరతి దర్వ్యా పరధీ ననక్తి ।

తా॥ స్రుక్స్రువముల కంటికొన్న హవిశ్శేషమును శ్రౌత ప్రసిద్ధమైన ప్రస్తరమువలె అమంత్రకముగా పాత్రాసాదన దర్భలకంటించి అప్రస్తరము వలెనే అగ్నియందుంచవలెను. (ఎట్లనగా)

మూ॥ పాత్రప్రయుక్త దర్భాగ్రాణి దర్వ్యామభ్యజ్య । స్రువే మధ్యమూలే అనక్తి ॥

తా॥ పాత్రాసాదన దర్భాగ్రములను స్రుక్కునందు నొక్కి సప్రదక్షణముగా తుడిచి స్రువమందాబర్హిస్సు యొక్క మధ్యభాగమును మొదళ్ళచే నొక్కవలెను.

మూ॥ మూలాంజనే దక్షిణం పాణిమధః కుర్యాత్ ॥ ఏవం త్రిః ॥

తా॥ మొదళ్లను నొక్కునప్పుడు కుడిచేయి క్రిందికుండవలెను. ఇట్లు మూడుసార్లు చేయవలెను.

మూ॥ కించిత్తృణమపాదాయ ప్రజ్ఞాతం నిధాయ పాణిభ్యాం దర్వ్యాం ప్రతిష్ఠాప్య హుతదేవతా ఉద్దిశ్యాగ్నౌ ప్రహృత్య ॥

తా॥ ఆ దర్భలలో ఒక దర్భను తీసికొని జ్ఞాపకముగా నుంచికొని రెండు చేతులతోను ప్రాగగ్రములుగా స్రుక్కునందుంచి హుతదేవతలైన ప్రజాపతి, ఇంద్ర, అగ్ని, సోమ, అగ్నులనుద్దేశించి ఆ దర్భల నగ్నియందు వేసి యీక్రింది త్యాగముల జెప్పవలెను.

మం॥ **యదస్య కర్మణోఽత్యరీరిచం యద్వా న్యూనమిహాకరం అగ్నిష్టత్స్విష్టకృద్విద్వాన్ద్ సర్వగ్గం స్విష్టగ్ం సుహుతం కరోతు స్వాహా,**

అస్య కర్మణః = ఈప్రకృత కర్మయొక్క; యత్ = ఏ అంగమును; అత్యరీరిచమ్ = ఎక్కువగాచేసితినో; ఇహ = ఈ కర్మయందు; న్యూనమ్ = తక్కువను; అకరమ్ = చేసితినో

మూ॥ అస్య కర్మణమ్ హోమప్రతిష్ఠాసిద్ధ్యర్థమృద్ధికామః జయాదివర్జం ప్రజాపత్యహోమం కరిష్యే ॥

తా॥ ఈకర్మకు హోమప్రతిష్ఠ సిద్ధించుటకొఱకు వృద్ధిని కోరువాడనై జయాదులు లేకుండ ప్రాజాపత్యహోమమును చేయుదును.

మం॥ **ప్రజాపతే న త్వదేతాన్యన్యో విశ్వా జాతాని పరి తా బభూవ ।**
**యత్కామాస్తే జుహుమస్తన్నో అస్తు వయం స్యామ పతయో రయీణామ్ ॥**

అ॥ హే ప్రజాపతే = ఓ ప్రజాపతీ! త్వత్ = నీకంటె; అన్యః = మఱియొకడు; ఏతాని = ఇప్పుడుండు; విశ్వా = సమస్తములైన; జాతాని = భూతజాతములను; న పరి బభూవ = వ్యాపించియుండడు. నీవే వీటిని గ్రహించి సృజించుటకు సమర్థుడవగుదువు అని భావము. వయం చ = మేము; యథాకామః = ఏ ఫలమును కోరుదుమో; తే = నీకు; జుహుమః = హవిస్సుల నిచ్చుచున్నామో; తత్ = ఆ ఫలము; నః = మాకు; అస్తు = అవుగాక, తథా = ఆ విధముగా; వయం చ = మేమున్ను; రయీణామ్ = ధనములకు; పతయః = ఈశ్వరులము; స్యామ = కావలయును. ప్రజాపతయే ఇదమ్ = ప్రజాపతికి ఇది.

తా॥ ఓ ప్రజాపతీ! నీవు తప్ప మఱి యెవడును ఈ సర్వభూతములందు వ్యాపించి యుండడు. నీవొక్కడవే వీటిని గ్రహించి సృజించుటకు సమర్థుడవు. మేమే ఫలముకోరుచు నీకు హోమము చేయుచున్నామో ఆ ఫలము మాకగుగాక. అటులనే మేమున్ను ధనేశ్వరుల మగుదుము గాక. ఇది ప్రజాపతికి.

మం॥ **భూస్స్వాహా । అగ్నయ ఇదమ్ ।**

తా॥ భూమి కర్పితమగుగాక. అగ్నికిది.

మం॥ **భువస్స్వాహా । వాయవ ఇదమ్ ।**

తా॥ భువమున కర్పితమగుగాక. వాయువునకిది.

మం॥ **సువస్స్వాహా । సూర్యాయేదమ్ ।**

తా॥ సువమున కర్పితమగుగాక, సూర్యునకిది.

తత్ సర్వం = ఆ ఎక్కువతక్కువైన అంగజాతమును; విద్వాన్ = బాగుగా ఎరిగిన; స్విష్టకృదగ్నిః = స్విష్టకృత్తనెడి అగ్నిదేవుడు; స్విష్టమ్ = బాగుగా చేయబడిన దానిని గాను; సుహుతమ్ = బాగుగా హోమము చేయబడిన దానినిగాను; కరోతు = చేయుగాక. స్వాహా = బాగుగా హుతమగుగాక.

మం॥ **ప్రజాపతయ ఇదం న మమ ।** తా॥ ప్రజాపతికిది, నాకుగాదు.

మం॥ **ఇంద్రాయేదం న మమ ।** తా॥ ఇంద్రునకిది, నాకుగాదు.

మం॥ **అగ్నయ ఇదం న మమ ।** తా॥ అగ్నికిది, నాకుగాదు.

మం॥ **సోమాయేదం న మమ ।** తా॥ సోమునకిది, నాకుగాదు.

మం॥ **అగ్నయ ఇదం న మమ ।** తా॥ అగ్నికిది, నాకు గాదు.

మం॥ **అగ్నయే స్విష్టకృత ఇదం న మమ ॥** తా॥ స్విష్టకృత్తగు అగ్నికిది, నాకుగాదు.

మూ॥ అంజలినా త్రిరుద్రుత్య తృణం ప్రహరతి । త్రిరంగుళ్యా నిర్దిశ్య 'ఏతత్ ఏతత్ ఏతత్' అగ్నిమభి మంత్ర్య భూమిముపస్పృశేత ॥

తా॥ దోసిటితో మూడుసార్లు గెంటి దాచిన దర్భనగ్నిలో వేయవలెను. మూడుసార్లు తర్జనిని చూపి అగ్నినభిమంత్రణచేసి భూమిని ముట్టుకొనవలెను.

మూ॥ మధ్యమ పరిధిం ప్రహృత్య ఇతరౌ యుగపత్ప్రహరన్ ఉత్తరార్ధ్యస్యాగ్రమంగారేషూపోహతి । పరిధీనభిమంత్ర్య ।

తా॥ మధ్యమపరిధిని (పడమటి పరిధిని) అగ్నియందు పడవేసి దక్షిణోత్తర పరిధుల నొకపరి పడవేయ నిశ్చయించినవాడై ఉత్తరపరిధియొక్క కొసను నిప్పులయందు గ్రుచ్చి పరిధుల నభిమంత్రణము చేయవలెను. (చేసి)

మూ॥ అఘారసమిధౌ ప్రహరతి। దర్వ్యామితరదర్వ్యగ్రమవధాయసగ్గ్ స్రావేణాభిజుహోతి। వసుభ్యో రుద్రేభ్య ఆదిత్యేభ్య స్సగ్గ్ స్రావభాగేభ్య ఇదం న మమ। అస్మిన్ ప్రకృతే కర్మణీత్యాది సిద్ధముత్తరం పరిషేచనమ్। తతః ప్రణీతావిమోకోఽపి। తేన సర్పిష్మతా బ్రాహ్మణం భోజయేత్।

తా॥ తూర్పున నుంచిన అఘారసమిధలనగ్ని యందుంచవలెను. స్రుక్స్రువములతో నేతిని పట్టుకొని స్రుక్కునందు స్రువాగ్రమునుంచి ఏకధారగా హోమముచేసి ఈ సంస్రావ హోమభాగార్హులైన అష్టవసువులకు, ఏకాదశరుద్రులకు, ద్వాదశాదిత్యులకున్ను ముట్టుగాక, అనాజ్ఞాతాది ప్రాయశ్చిత్తములును ఉత్తర పరిషేచనము పూర్వము వలెనే. తరువాత పూర్ణపాత్రమార్జన మొ॥నవి సమాప్తము చేసి నేతితో తడిసిన యా హవిశ్శేషమును బ్రాహ్మణునకు పెట్టవలెను.

మూ॥ యోఽస్యాపచితః, తస్మా ఋషభం దదాతి।

తా॥ ఈతనికెవరు పూజ్యులో వానికి వృషభమును ఈయవలెను.

తా॥ అత్ర స్థాలీపాకే = ఇచట స్థాలీపాకమునందు

శ్లో॥ దర్వ్యా మనక్త్యగ్రమథేతరస్యాం మధ్యం సమూలం త్రిరిహాపి వా ద్విః।
పక్షే ద్వితీయే సకృదేవ మూలం ద్వితీయదర్వ్యామితరచ్చ దర్వ్యామ్॥

తా॥ పాత్రాసాదన దర్భాగ్రములచే స్రుక్కునందు తుడుచుట స్రువమందు మధ్యమూలములను నొక్కుట మూడుసార్లుగాని రెండుసార్లుగాని చేయవలెను. రెండవపక్షమందు దర్వియందు కొసనొక్కమారును ఇతర దర్వియందొక్కమారును చేసిన చాలును.

శ్లో॥ అక్ష్యోపనీయాక్త తృణం నిధాయ దర్వ్యాం ప్రతిష్ఠాప్య కరద్వయేన।
నిరస్తసవ్యః ప్రహరేత్ప్రహృత్య త్రిరత్ర చోద్ధృత్య తృణప్రహారః॥

తా॥ పై విధమున సంస్కారము చేసిన దర్భలలో నొకదానిని తీసియుంచుకొని తక్కినవి దోసిలితో ప్రక్కనందుంచి కుడిచేతితో అగ్నియందుంచవలెను.

శ్లో॥ నిర్దేశనం చాగ్న్యభి మంత్రణం చ భూమౌ నివిష్టః పరిధిః ప్రహారః।
సంస్రావహోమాంతమమంత్రకం స్యాత్పాత్రప్రయుక్తం తృణమత్ర బర్హిః॥

తా॥ చూపుడు వేలును చూపుట, అగ్నినభిమంత్రించుట, భూమినిముట్టుట పరిధి ప్రహరణము, సంస్రావహోమమగువఱకు సమంత్రకముగనే జరుగవలెను.

## (విశ్వావసు) గంధర్వస్థాపనము

మూ॥ ప్రాణానాయమ్య ... ప్రీత్యర్థం గంధర్వస్థాపనం కరిష్యే (స్థాలీపాకాదూర్ధ్వం గంధర్వస్థాపనమ్) గంధర్వరాజాయ నమః ధ్యానావాహనాది షోడశోపచార పూజాం కుర్యాత్। (కృత్వా)

తా॥ ప్రాణాయామము చేసి (సంకల్పముచేసి) ... పరమేశ్వర ప్రీతికొఱకు గంధర్వస్థాపన చేయుదును. స్థాలీపాకమైన పిమ్మట ఒక దండమునకు సూత్రమునుగట్టి ప్రాణప్రతిష్ఠచేసి పూజించి క్రింది శ్లోకముచెప్పి దంపతుల నడుమ నుంచుకొని నాల్గురోజులు అగ్నితోబాటు పూజించు చుండవలెను.

మూ॥ శ్లో॥ విశ్వావసోऽత్ర గంధర్వదండే రాత్రిత్రయం వసన్ ।
ఆవయోః ప్రీతిముత్పాద్య రక్షావాం శుభలక్షణః ॥
గంధర్వస్థాపనముహూర్తస్సుముహూర్తోऽస్తు ।

తా॥ విశ్వావసువను ఓ గంధర్వా! ఈ దీక్షలో మూడహోరాత్రము లీదండము నావహించియుండి మమ్మిద్దఱను అన్యోన్య ప్రీతిగలవారిగజేసి మమ్ము రక్షింపుము. నీవు శుభలక్షణములు గలవాడవు.

గంధర్వస్థాపనముహూర్తము సుముహూర్తమగుగాక.

సూ॥ యదహర్భార్యామావహతే త్రిరాత్రముభయోరధశ్శయ్యా బ్రహ్మచర్యం క్షారలవణవర్జనం చ॥

తా॥ స్థాలీపాకము మొదలు మూడహోరాత్రములు నూతనదంపతులధశ్శయనమును, బ్రహ్మచర్యమును (ఉప్పుకారములేని భోజనము) చేయుచుండవలెను.

(గంధర్వో ... గంధర్వేభ్యః – అను మంత్రపఠనము చేయవలెను.)

## దీక్షాదివసములు

"**త్రిరాత్రముభయోరధశయ్యా బ్రహ్మచర్యం క్షారలవణవర్జనం చ**" అను సూత్రప్రకారము సాయంప్రాతః కాలములయందు అగ్ని పరిచర్య చేయుచు అధశయ్యాది బ్రహ్మచర్య నియమములను వధూవరులిద్దఱు మూడురోజులు పాటించుటను దీక్షాదివసములందురు.

సమాప్తము

## నిత్యౌపాసనము

సూ॥ సాయం ప్రాతరత ఊర్ధ్వగ్ం హస్తేనైతే ఆహుతీ స్తండులైర్యవైర్వా జుహుయాత్ ॥
స్థాలీపాకవద్దైవతమ్ ॥

తా॥ స్థాలీపాకానంతరము తొమ్మిదిగడియలకు లోపల సాయమౌపాసనము ప్రారంభించి రెండు పూటల చేతితో నీ యౌపాసనాహుతులను వరిబియ్యముతోగాని యవలతోగాని చేయు చుండవలెను.

స్థాలీపాకములో వలెనే యగ్నిదేవతగా మొదటిహోమము మధ్యమ రెండవది ఈశాన్యమునను చేయవలెను.

మూ॥ సౌరీ పూర్వాహుతిః ప్రాతరిత్యేకే ॥

తా॥ ప్రాతఃకాలమున మొదటిహోమము "సూర్యాయ స్వాహా" యని చేయవలసినదిగా కొందఱి మతము. ఈ మతమే ఆచారమందున్నది.

మూ॥ ఉభయతః పరిషేచనం యథాపురస్తాత్ ॥

తా॥ పూర్వోత్తరపరిషేచనము లిదివఱకువలెనే.

మూ॥ ప్రాణానాయమ్య... ప్రీత్యర్థమ్ ఔపాసనమారప్స్యే తేన యావజ్జీవం హోష్యామీత్యుభయో స్సంకల్పః ।

తా॥ ప్రాణాయామముచేసి (సంకల్పముచేసి) పరమేశ్వర ప్రీతికొఱకు ఔపాసనదీక్షను ప్రారంభించుచున్నాము. అందువలన జీవించి యున్నంతకాలమువఱకు హోమము చేయుచున్నాము అని యిద్దఱును సంకల్పము చేయవలెను.

మూ॥ పునః ప్రాణానాయమ్య । ఓం భూః ... ఏవంగుణ ... ప్రీత్యర్థం సాయమౌపాసనం తండులైర్హోష్యామి ।

తా॥ తిరిగి ప్రాణాయామము చేసి ఓం భూః ... ఇట్టిగుణములుకల ... ప్రీతికొఱకు సాయంకాలమున చేయదగిన ఔపాసనమును బియ్యముతో హోమము చేయవలెను. (హోమము చేయుచున్నాను.)

మూ॥ భూర్భువస్సువరోమ్... పూర్వ పరిషేచనం కృత్వా ।

తా॥ భూర్భువస్సువరోమ్ - - పూర్వపరిషేచనముచేసి.

మూ॥ తండులానాదాయ ద్వేధా విభజ్య అగ్నయే స్వాహా అగ్నయ ఇదం న మమ ॥
అగ్నయే స్విష్టకృతే స్వాహా అగ్నయే స్విష్టకృత ఇదం న మమ ।

తా॥ కడుగుడు బియ్యమును తీసి రెండు చేతులవ్రేళ్లమీద రెండు భాగములు చేసి మొదటిది అగ్నికి మధ్యను రెండవది ఈశాన్యమందు చేయవలెను.

మూ॥ బ్రహ్మాది పంచపాలకపూజాం గౌరీపూజాం చ విధిప్రకారేణ కుర్యాత్ । తతః ఫల ప్రదానాని దద్యాత్ । తతః ఆశీర్వాదః కర్తవ్యః ॥

తా॥ బ్రహ్మాది పంచపాలకుల పూజను గౌరీపూజను విధిప్రకారముగా చేయవలయును. పిమ్మట ఫలప్రదానములు (ఈయవలయును) చేయవలయును. తరువాత ఆశీర్వాదము.

మూ॥ ఉత్తరపరిషేచనమ్ అనేన సాయమౌపాసహోమేన భగవాన్ సర్వాత్మకః శ్రీయజ్ఞేశ్వరస్సుప్రీణాతు ॥ స్వస్తిశ్రద్ధాం - - అహం భో అభివాదయే ॥

తా॥ ఉత్తర పరిషేచనము చేసి ఈ సాయమౌపాసన హోమముచేత సర్వాత్మకుడు భగవంతుడునయిన శ్రీయజ్ఞేశ్వరుడు సంతుష్టి పొందుగాక. స్వస్తి శ్రద్ధాం మొదలు ఆచమనాంతమును చేయవలెను. స్థాలీపాకము సమాప్తము.

## అథ సదస్య ప్రయోగః

మూ॥ ప్రాతస్సంధ్యాది నియమానంతరే ప్రాతః కాలమౌపాసనం కుర్యాతే । తతః బ్రాహ్మణాన్ బంధూంశ్చానీయ । బంధుభిస్సహాఽలంకృత్య । భేరీమృదంగవాద్యఘోషై స్స్వస్తివాచక మంగళ పాఠకపుణ్యాంగనాదిభిరాప్తజనైర్వధూవరైస్సహ కళ్యాణమంటపస్య పశ్చాత్ప్రాఙ్ముఖ ముపవిశ్య । తత్ర నూతనవస్త్రేణ మంటపమాసాద్య । తదుపరి తండులాన్నిధాయ । ఆచమ్య ॥

తా॥ ప్రాతస్సంధ్యాది నియమములయిన పిదమ ప్రొద్దున ఔపాసనము చేయవలయును. బ్రాహ్మణులను, బంధువులను పిలిచి, బంధువులతో సభ నలంకరించి, భేరీ మృదంగ వాద్య ఘోషములచే స్వస్తివాచక మంగళ పాఠక పుణ్యాంగనలతోడను, ఆప్తజనులతోడను, వధూవరులతోను గూడ కళ్యాణమండపమునకు వెనకు తూర్పు ముఖముగా కూర్చుండి, నూతన వస్త్రముచే మంటపము ప్రవేశించి, దానిపైన బియ్యముంచి, ఆచమనము చేసి,

మూ॥ శుక్లాంబరధరం విష్ణుం... ... సర్వేభ్యో మహా జనేభ్యో నమః । ప్రాణానాయమ్య .... ఏవం గుణ ... శుభతిథౌ । దంపత్యో ఆయుర్వర్చో యశో బలాభివృద్ధ్యర్థం మహదాశీర్వచనసమయే ఇంద్రాద్యష్టదిక్పాలకసహితసరస్వతీపూజాం కరిష్యే ఆదౌ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం శ్రీమహాగణాధిపతి పూజాం కరిష్యే । గణాధిపతి పూజాం కృత్వా ॥ ఓం భూః... ర్థమ్ ఇంద్రాద్యష్ట దిక్పాలకసహితసరస్వతీ పూజాంకరిష్యే ॥

తా॥ శుక్లాంబరధరుడు, సర్వవ్యాపియు ... గణపతికి నమస్కారము. మహాజనులకందఱకును నమస్కారము, ప్రాణాయామము చేసి ఇట్టి గుణములు గల... శుభతిథియందు దంపతులకు ఆయువు, వర్చస్సు, యశస్సు, బలము అభివృద్ధి పొందుటకు మహదాశీర్వచన సమయమందు ఇంద్రాద్యష్టదిక్పాలకులతో గూడిన మహాసరస్వతిని పూజించెదను. మొదట నిర్విఘ్నముగా సమాప్తి పొందుటకు శ్రీమహాగణాధిపతిని పూజించెదను. గణాధిపతి పూజచేసి ఓం భూః ... ... శ్రీపరమేశ్వర ప్రీతికొఱకు ఇంద్రాద్యష్టదిక్పాలకసహితసరస్వతీపూజ చేయుదును.

మం॥ **ప్రణో దేవీ సరస్వతీ వాజేభిర్వాజినీవతీ । ధీనామవిత్ర్యవతు ॥**

అ॥ దేవీ = దానాది గుణములతో గూడినదియు; వాజినీవతీ = వాజమనగా అన్నము, అది ఏక్రియయందు కలదో అది వాజిని, దానితోగూడినదియు; ధీనామ్ = ధ్యాతలను స్తోతలను; అవిత్రీ = రక్షించునదియును అగు; సరస్వతీ = సరస్వతీదేవి; వాజేభిః = అన్నములతో, నః = మమ్ములను; ప్ర + అవతు = ప్రకర్షతో తృప్తిపఱచుగాక;

తా॥ పైదాని దండాన్వయమే తాత్పర్యము.

మూ॥ మహాసరస్వతీమావాహయామి ।

తా॥ మహాసరస్వతీదేవిని ఆవాహనము చేయుదును.

మూ॥ తతః అష్టసు దిక్షు దిక్పాలకానావాహ్య । తతః మంత్రాః పూర్వోక్తాః ।

తా॥ పిమ్మట ఎనిమిది దిక్కులందు దిక్పాలకులను ఆవాహనము చేసి, అందు మంత్రములు పూర్వోక్తములు.

మూ॥ షోడశోపచారపూజాం కృత్వా । (షోడశోపచారై రభ్యర్చ్య । వస్త్రగంధపుష్పతాంబూల హిరణ్యాదిక మాచార్యాయ దద్యాత్ । తతస్సభాపూజా ।)

తా॥ షోడశోపచారపూజ చేసి షోడశోపచారములతో అర్చించి, వస్త్రములు, గంధము, తాంబూలము, బంగారు మొ॥వి ఆచార్యునకు ఈయవలయును. రెండు వైపులవారు ఈయవలయును. పిమ్మట సర్వులకు సభాపూజ–

మూ॥ సర్వేషాం మహాజనానాం శ్రీమహావిష్ణుస్వరూపాణాం బ్రాహ్మణానాం సర్వత్ర ఇమాన్యాసనాని – ఇతి కర్తృవాక్యమ్ ।

తా॥ ఈవేదికపైనున్న మహాజనులు శ్రీమహావిష్ణు స్వరూపులునగు బ్రాహ్మణులకు అంతటను ఇవి ఆసనములు అని కర్తవాక్యములు.

మూ॥ సుఖాసనాని ఇతి సభావాక్యమ్ ।

తా॥ సుఖాసనములు అని సభలోనివారు పల్కిన వాక్యము.

మూ॥ సర్వై ర్దైవేక్షణః క్రియతామ్. ఓం తథా (కర్తృవాక్యమ్) ప్రాప్నువంతు భవంతః ।

తా॥ అందఱును దైవదృష్టి చేయుదురుగాక. ఓం తథా. అటులనే మీరులు ప్రాప్తిగల్గియుందురుగాక. అని కర్తవాక్యము.

మూ॥ ప్రాప్నువామ. తా॥ ప్రాప్తి గల్గియుందుము.

మం॥ **అర్చత ప్రార్చత ప్రియమేధాసో అర్చత । అర్చంతు పుత్రకా ఉత పురం న ధృష్ణ్వర్చత ।**

అ॥ ఓమ్ అధ్వర్యువు మొదలగు వారలారా! యూయమ్ = మీరు, ఇంద్రమ్ = ఇంద్రుని; అర్చత = స్తుతితో పూజింపుడు. ప్రార్చత = ప్రకర్షతో ఇంద్రునే పూజింపుడు. హే ప్రియమేధాసః= ప్రియమేధ సంబంధము, ఆగోత్రముగల వారలారా! యూయమ్ ఇంద్రమ్ అర్చత = మీరు ఇంద్రుని అర్చింపుడు. పుత్రకాః = పుత్రులుకూడ, ఇంద్రమ్ = ఇంద్రుని; అర్చంతు = పూజింతురుగాక; ఉత = మఱియు; పురం న ధృష్ణు = ఎట్లు ధర్షణశీలమగు పురమును అర్చింతురో; అర్చత = అట్టి యింద్రుని పూజింపుడు. తా॥ స్పష్టము.

మం॥ **గంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్ ।**
**ఈశ్వరీగ్ం సర్వభూతానాం తామిహోపహ్వయే శ్రియమ్ ॥**

తా॥ గంధద్వారామ్ = గంధము లక్షణముగా గలదియు; దురాధర్షామ్ = ఎవనిచేతను అజ్ఞానముచే పొందశక్యము కానిదియు, నిత్యపుష్టామ్ = సదా సస్యాదులతో సమృద్ధి గలదియు; కరీషిణీం = శుష్కగోమయాదులు గలదియు; (గవాశ్వాది పశుసమృద్ధి గలది యని భావము). సర్వభూతానామ్ = సకల ప్రాణులకు; ఈశ్వరీం = ఆధారమైనదియు (ఈశ్వరియైనదియు) తామ్ = అగు అట్టి భూరూపయగు; శ్రియమ్ = శ్రీదేవిని లక్ష్మిని; ఇహ = ఇక్కడకు; ఉపహ్వయే = పిలుచుచున్నాను. తా॥ దండాన్వయము తాత్పర్యమే.

మం॥ **ఓం హిరణ్యరూపస్స హిరణ్యసందృగపాన్న పాత్సేదు హిరణ్యవర్ణః ।**
**హిరణ్యయాత్పరి యోనేర్నిషద్యా । హిరణ్యదా దదత్యన్నమస్మై ॥**

అ॥ సః అపాం నపాత్ = అగ్ని; హిరణ్యరూపః = రూప్యతే ఇతి రూపమ్ = శరీరము; సువర్ణమయ శరీరముగలవాడు; హితరమణీయ శరీరముగలవాడు గాని; హిరణ్యసందృక్ = (సమ్యక్ వశ్యంతీతి సందృశ ఇంద్రియాణి) సువర్ణమయములైన ఇంద్రియములు గలవాడు. హితరమణీయములైన ఇంద్రియములు గలవాడుగాని; ఆ అపాం నపాత్సంజ్ఞ గలిగిన అగ్ని; హిరణ్యవర్ణః = హిరణ్యసదృశకాంతులతోగూడినవాడు; ఇటువంటివాడై; హిరణ్యయాత్ = సువర్ణమయమయిన; యోనేః = స్థానమునకు; పరి = పైన; నిషద్య = కూర్చుండి; (ప్రకాశించు చున్నాడు.) అస్మై = ఇటువంటి అగ్నికి; హిరణ్యదాః = దక్షిణారూపమైన సువర్ణమును ఇచ్చునట్టి యజమానులు (యజ్ఞము చేయువారలు) అన్నమ్ = హవిర్లక్షణమైనదానిని; దదతి = ఇచ్చుచున్నారు. తా॥ దండాన్వయమే తాత్పర్యము.

మూ॥ అత్ర వేదికాస్థితాశే విద్వన్మహాజనేభ్యః అనేక సువర్ణపుష్పాణి (కర్తృవాక్యమ్)

తా॥ ఇచట వేదికపైనున్న సమస్త విద్వన్మహాజనులకును అనేక సువర్ణపుష్పములు.

మూ॥ సుపుష్పాణి । (సభావాక్యమ్) తా॥ మంచి పుష్పములు.

మూ॥ సకలారాధనైశ్శోభనమస్తు । తా॥ సకలపూజలతోను శుభమగుగాక.

మూ॥ శిష్టాచార్యక్రమేణ మహదాశీర్వచనం కుర్యాత్ ॥

తా॥ శిష్టుల ఆచారమునుబట్టి మహదాశీర్వచనము (గొప్పవారి ఆశీర్వచనము లేక గొప్ప ఆశీర్వచనము) చేయవలయును.

## సదస్యము – సభాసంబంధము

సభాతాంబూలమును పళ్లెమునునుంచుకొని పురోహితుడు లేచి యజమాని తరపున సభవారలకీ క్రిందివిధముగా మర్యాద చేయవలెను. మాధవశర్మ తనకుమారుని మహదాశీర్వచన సమయమందు ఇక్కడనున్న అనేక విద్వజ్జన మహాశయులకు వేయిన్నూట (పదహారు) పదియారు సువర్ణమంత్రపుష్పములు సమర్పించడమయినది.

తరువాత పెండ్లికుమారుని తండ్రి సభాపతిని చందనాది సుగంధాదులచే నలంకరించి సభాకట్నమీయవలెను. నూత్నవధూవరుల కన్యోన్య బహుమానములు, తరువాత ఉభయ పురోహితులకు అన్యోన్య సత్కారములు, స్వస్తులు, విద్యాప్రసంగములు, పండిత సత్కారములు, మహదాశీర్వాదములు, ఫలప్రదానములు, మంగళహారతి, తరువాత లేచి సభావందనము.

మం॥ **నమో మహద్భ్యో నమో అర్భకేభ్యో నమో యువభ్యో నమ ఆశినేభ్యః ।**
**యజామ దేవాన్యది శక్నవామ మా జ్యాయసః శంసమా వృక్షి దేవాః ॥**

అ॥ అగ్నిచే ప్రేరేపించబడి శునఃశేపుడు సర్వదేవతలను ఈ శ్రుతితో స్తుతించెను. మహద్భ్యః = గుణములచే ఆధిక్యముగల వారికిని; నమః అస్తు = నమస్కారము అగుగాక; అర్భకేభ్యః = గుణములచే అల్పత్వముగలవారికి; నమః అస్తు = నమస్కారము అగుగాక; యువభ్యః =

తరుణులకు; నమః = నమస్కారమగుగాక; ఆశినేభ్యః = వయోవృద్ధులకు; నమః = నమస్కారము పైనచెప్పిన నాల్గువిధాల దేహాలుగల దేవతలకు నమస్కారమగుగాక; యది శక్నవామ = ఎట్లయిన ధనాది సంపదలతో సమృద్ధుల మయినయెడల; దేవాన్ = దేవతలను; యజామ = భజించెదము; హే దేవాః = ఓ దేవతలారా! జ్యాయసః = జ్యేష్ఠుడయిన దేవతావిశేషముయొక్క; ఆ = అంతటను ప్రసరించిన; శంసం = స్తోత్రమును; మా వృక్షి = నేను విచ్ఛిన్నముగా చేయకుందును. తా॥ దండాన్వయమే తాత్పర్యము.

సదస్య ప్రయోగము సమాప్తము.

## శేషహోమము

వివాహమైన నాల్గవరోజున అపరరాత్రియందు కొన్ని మంత్రములతో హోమముచేయుట. దీనివలన దీక్షావిసర్జనము మఱియు సాముద్రిక శాస్త్రప్రకారము నూతన వధువునందు భర్తృ, సంతాన, పశు, ఐశ్వర్యాదులను నష్టపరిచెడి ఏపాణిరేఖగలదో, ఆరేఖవలన నష్టము లేకుండునట్లు అనుగ్రహించుమని అగ్నిదేవతను కోరుట.

ఈ పై నుదాహరింపబడిన కలాపములో కొన్ని కర్మలు వివాహమునకు ప్రధానభూతములును, కొన్ని అంగభూతములుగను ఉన్నవి. వీనిలో కొన్నింటికి దృష్ట ప్రయోజనములు, కొన్నింటికి అదృష్ట ప్రయోజనములు గలవు. దృష్టప్రయోజనములు గలవైనను నియమమునకు నియమాదృష్ట ప్రయోజనముండునని శాస్త్రకారులు చెప్పిరి. కాన ఇట్టి దృష్టాదృష్టప్రయోజనములతోగూడిన అంగ ప్రధానకర్మ సముదాయమంతయు కలసిన దానికి వివాహమని పేరు.

## శేషహోమప్రయోగః

(వివాహమైన పిదప స్థాలీపాకము మొదలు దంపతులు మూడు దినములవఱకు నేలమీద పరుండవలయును. మైథునరహితమగు బ్రహ్మచర్యము చేయవలయును. క్షారలవణములను మధు మాంసాదులను వర్జింపవలయును. ఆ దంపతులు మూడు రాత్రులవఱకు ఒకేచోట పరుండవలయును. వారిద్దరు పండుకొను స్థలము నడుమ ఆ మూడురాత్రులు గంధపుష్పాదులచే అలంకరింపబడిన వస్త్రముచేగాని,దారముచేగాని చుట్టబడిన దండమును స్థాపింపవలయును. ఈ దండము ఉత్తిదిగాని రాగిదికాని కావలయును.

మూ॥ తం చతుర్థ్యామపరరాత్రౌ ఉత్తరాభ్యాముత్థాప్య ప్రక్షాళ్య నిధాయ ।

తా॥ నాల్గవదినమున అపరరాత్రివేళ అనగా రాత్రి మూడవజామున క్రింది రెండు మంత్రములచే ఆ దండమునెత్తి నీటితో కడిగి యుంచవలయును.

మం॥ **ఉదీర్ష్వాతో విశ్వావసో! నమసే ళామహేత్వా । అన్యామిచ్ఛ ప్రఫర్వ్యగ్ం సం జాయాం పత్యాసృజ॥ ఉదీర్ష్వాతః పతివతీహ్యేషా విశ్వావసుం నమసా । గీర్భిరీళే। అన్యామిచ్ఛ పితృషదం వ్యక్తాగ్ం స తే భాగో జనుషా తస్య విద్ధి ॥**

అ॥ విశ్వావసో! = విశ్వావసువను ఓ గంధర్వుడా! అతః = ఈ దండమునుండి, ఉదీర్ష్వ = లెమ్ము; త్వా = నిన్ను; నమసా = నమస్కారముచేత; ఈళామహే = యాచించుచున్నాను. ప్రఫర్వ్యమ్ = నూతన వయస్సుగల; అన్యామ్ = మఱియొక చిన్నదానిని; ఇచ్ఛ = కోరుము; పత్యా = పెనిమిటియైన నాతోగూడ; జాయామ్ = భార్యనుగా, సంసృజ్య = కూర్చుము; అతః = ఇక్కడనుండి; ఉదీర్ష్వ = లెమ్ము; ఏషా = ఈ చిన్నది; పతివతీ హి = పతిగలదైనది గదా! నమసా = నమస్కారముచేత; గీర్భిః = స్తోత్రములచేత; త్వాం = నిన్ను; ఈళే = యాచించుచున్నాను; పితృషదమ్ = వివాహముకానిదగుటచే తండ్రి గృహమునందున్నదియు; వ్యక్తామ్ = వివాహముచేయుటకు ఆవిర్భావమగుచున్న యౌవనము కలదియునగు; అన్యామ్ = మరియొకస్త్రీని; ఇచ్ఛ = కోరుము; సః = అది, తే = నీయొక్క; జనుషా = జన్మముచే; భాగః = భాగమైనది; తస్య = దానని; విద్ధి = పొందుము.

తా॥ విశ్వావసువనెడి యోగంధర్వుడా! ఇక్కడనుండి లేచి వెళ్ళుము. నీకొఱకు నమస్కారముచేసి నిన్నొకటి యాచించుచున్నాను. అది యేమనగా ఈ చిన్నదానిని నాకు భార్యగా విడిచిపెట్టి నీవు యౌవనావిర్భావమగుచున్న మఱియొక చిన్నదానిని వహింపుము.

ఓ గంధర్వుడా! ఇక్కడనుండి లెమ్ము. ఈ చిన్నది నన్ను వివాహము చేసికొనినదగుటచే పతిగలదైనది. కాబట్టి విశ్వావసువను పేరుగల నీకు నమస్కారస్తోత్రములనుచేసి వేడునదేమనగా వివాహము కానిదియగుటచే తండ్రిగృహమునందే యున్నదియు వివాహము చేయుట కావిర్భవించుచున్న యౌవనము గలదియునగు మఱియొక స్త్రీని కోరుము. అట్టి స్త్రీలు నీకు భాగలబ్ధలై యుండిరి. కాబట్టి అట్టి స్త్రీని పొందుము.

మూ॥ (గంధర్వం ప్రక్షాళ్య) శయనాదన్యత్ర నిదధాతి । పత్న్యా సహ ఆచమ్య (ప్రాణానాయమ్య) ... ఏవంగుణ ... శుభతిథౌ అనయా నవోఢయా వధ్వా సహ ఆయుష్యాభి వృద్ధ్యర్థం వివాహ శేషహోమం కరిష్యే । (ఉత్తరోవరః । ఓం భూర్భువస్సువరోమ్ । చత్వారి శృంగా ... షట్పాత్ర ప్రయోగం కుర్యాత్ ।) అగ్నేరుప సమాధానాద్యాజ్య భాగాంతేఽన్వారబ్ధాయా ముత్తరా ఆహుతీర్హుత్వా ఏకం – ద్వే – త్రీణి – చత్వారి ఇత్యాజ్యం గృహీత్వా । (పంచ)

తా॥ (గంధర్వుని ప్రక్షాళనచేసి) శయన స్థలమునుండి మరొకచోట నుంచుము. పత్నితోగూడ ఆచమనము చేసి (ప్రాణాయామముచేసి ఇటువంటి గుణములుగల... శుభతిథియందు ఈ క్రొత్తగా పెండ్లి అయిన వధువుతోగూడ ఆయువు వర్ధిల్లుటకు వివాహశేష హోమము చేయుదును. (వరుడుత్తరముగా కూర్చుండవలెను. ఓం భూర్భువస్సువరోమ్... చత్వారి శృంగా... ... షట్పాత్ర ప్రయోగమును చేయవలెను.

ఇది పూర్వోక్తము.

ఒకటి – రెండు – మూడు – నాలుగు (ఐదు) అని నేయి తీసికొని

మం॥ **అగ్నే! ప్రాయశ్చిత్తే త్వం దేవానాం ప్రాయశ్చిత్తిరసి బ్రాహ్మణస్త్వా నాథకామః ప్రపద్యే యాఽ**

**స్యాం పతిఘ్నీ తనూః ప్రజాఘ్నీ పశుఘ్నీ లక్ష్మీఘ్నీ జారఘ్నీమస్యైతాం కృణోమి స్వాహా ॥ అగ్నయ ఇదమ్ ।**

అ॥ ప్రాయశ్చిత్తే = నశించిన కర్మల ననుసంధానము చేయునట్టి; అగ్నే ! = ఓ అగ్నిదేవుడా! త్వమ్ = నీవు; దేవానామ్ = దేవతలలో; ప్రాయశ్చిత్తిః = నశించిన కర్మలను అనుసంధానము చేయువాడవు; అసి = అయితివి. బ్రాహ్మణః = బ్రాహ్మణుడైనను; అహం = నేను; నాథకామః = ప్రభువును గోరిన వాడనై; త్వా = నిన్ను; ప్రపద్యే = పొందితిని; అస్యాం = ఈస్త్రీయందు; పతిఘ్నీ = పతిని నశింపజేయునట్టిదియు; ప్రజాఘ్నీ = సంతానమును నశింపజేయునట్టిదియు; పశుఘ్నీ = పశువులను నశింపజేయునట్టిదియు; లక్ష్మీఘ్నీ = సంపత్తును నశింపజేయునట్టిదియు అగు; యా = ఏ; తనూః = శరీరముగలదో; అస్యై = ఈస్త్రీయొక్క; తామ్ = ఆ శరీరమును; జారఘ్నీమ్ = ఉపపతిని నశింపజేయునదిగా; కృణోమి = చేయుచున్నాను అని; స్వాహా = హోమము చేయుచున్నాను. అగ్నయే ఇదమ్ = అగ్నికి ఇది.

తా॥ కర్మభ్రష్టులను తిరిగి కర్మములయందధికారము కలవారిగా జేయువాడా! నీవు దేవతలలో నశింపజేయబడిన కర్మలను తిరిగి చేయించువాడవైతివి. బ్రాహ్మణుడనైన నేను, నిన్ను ప్రభువుగా గోరి యాశ్రయించితిని, పతిని చంపునట్టిదియు, పశువులను చంపునట్టిదియు, సంపత్తును నశింపజేయునట్టిదియునగు అమంగళకరమగు రేఖలు గాని అవయవ లోపములుగాని ఏవి యీస్త్రీయందు గలవో, అవి యన్నియు ఈ చిన్నదానికి విటుడున్నయెడల వానిని నశింప జేయునవిగా జేయును. చక్కగా హుతమగుగాక. అగ్నికిది.

మం॥ **వాయో ప్రాయశ్చిత్తేత్వం... కృణోమి స్వాహా వాయవ ఇదమ్ ॥**

తా॥ వాయువా! మిగిలినది 4వ మంత్రములోనిదే. వాయువునకిది.

మం॥ **ఆదిత్య! ప్రాయశ్చిత్తేత్వ ... కృణోమి స్వాహా ఆదిత్యాయేదమ్ ॥**

తా॥ ఓ ఆదిత్యుడా! (4వలోనిది) ఆదిత్యునకిది.

మం॥ **ప్రజాపతే! ప్రాయశ్చిత్తే త్వం... కృణోమి స్వాహా ॥ ప్రజాపతయ ఇదమ్ ॥**

తా॥ ప్రజాపతీ! (4వలోనిది) ప్రజాపతికిది.

మం॥ **ప్రసవశ్చోపయామశ్చ కాటశ్చార్ణవశ్చ ధర్ణసిశ్చ ద్రవిణం చ భగశ్చాంతరిక్షం చ సింధుశ్చ సముద్రశ్చ సరస్వాగ్శ్చ విశ్వవ్యచాశ్చ తేయం ద్విష్మో యశ్చ నో ద్వేష్టి తమేషాం జంభే దధ్మ స్వాహా ॥ ప్రసవాదిభ్యో దేవతాభ్య ఇదమ్ ॥**

అ॥ ప్రసవశ్చ = అనుజ్ఞయు; ఉపయామశ్చ = పృథివియు; కాటశ్చ = లింగరూపుడగు రుద్రుడును; అర్ణవశ్చ = మడుగు; ధర్ణసిశ్చ = ధర్ణసి అను పేరుగల గ్రహము; ద్రవిణం చ = ధనము; భగశ్చ = భగుడను సూర్యుడు; అంతరిక్షం చ = ఆకాశము; సింధుశ్చ = సింధువను నదియు; సరస్వాన్ = సరస్వత్తను దేవత; విశ్వవ్యచాశ్చ = దేవేంద్రుడు; తే = అనబడు ప్రసిద్ధులగు

ఏదేవతలు గలరో వారు; వయమ్ = మేము, యమ్ = ఎవనిని; ద్విష్మః = ద్వేషించుచున్నామో; యశ్చ = ఎవడు; నః = మమ్ములను; ద్వేష్టి = ద్వేషించుచున్నాడో; తమ్ = వానిని; ఏషామ్ = ఈ దేవతలయొక్క; జంభే = దంతములయందు; దధ్మః = ఉంచుచున్నాము; స్వాహా = చక్కగా హుతమగుగాక. ప్రసవాదిభ్య ః దేవతాభ్యః ఇదమ్ । = ప్రసవాది దేవతలకిది.

తా॥ అనుజ్ఞ, భూమి, రుద్రుడు, మడుగు, ధర్ణసి అనుగ్రహము, ధనము, భగుడను సూర్యుడు, ఆకాశము, సింధువను నది, సముద్రము, సరస్వత్తు అను దేవత, ఇంద్రుడు అనబడెడి ఏదేవతలు కలరో ఆ దేవతలచే మమ్ములనెవడు దూషించుచున్నాడో వానిని, మేమెవ్వని దూషించుచున్నామో వానిని భక్షింపజేయుచున్నాను. చక్కగా హుతమగు గాక. ప్రసవాది దేవతలకిది.

మం॥ **మధుశ్చ మాధవశ్చ శుక్రశ్చ శుచిశ్చ నభశ్చ నభస్యశ్చేషశ్చోర్జశ్చ సహశ్చ సహస్యశ్చ తపశ్చ తపస్యశ్చ తే యం ద్విష్మో యశ్చ న ద్వేష్టి తమేషాం జంభే దధ్మస్స్వాహా ॥ మధ్వాదిభ్యో దేవతాభ్య ఇదమ్ ॥**

అ॥ మధుః = చైత్రమాసము; మాధవః = వైశాఖమాసము; శుక్రః = జ్యేష్ఠమాసము; శుచిః = ఆషాఢమాసము; నభః = శ్రావణమాసము; నభస్యః = భాద్రపదమాసము; ఇషః = ఆశ్వయుజమాసము; ఊర్జః = కార్తికమాసము; సహః = మార్గశిరమాసము; సహస్యః = పుష్యమాసము; తపః = మాఘమాసము; తపస్యః = ఫాల్గుణ మాసము అను; తే = ప్రసిద్ధమైన ఏ మాసములు గలవో; ఏషాం = ఈమాసాధిదేవతలయొక్క; జంభే = దంతములయందు; వయమ్ = మేము; యమ్ = ఎవనిని (ఎవరిని); ద్విష్మః = ద్వేషించుచున్నామో; తమ్ = వానిని; (అధ్యాహారము) భక్షణాయ = భక్షించుటకొఱకు; దధ్మః = ఉంచుచున్నాము. స్వాహా = చక్కగా హుతమగుగాక. మధ్వాదిభ్యః దేవతాభ్యః ఇదమ్ = మధ్వాది దేవతలకిది.

తా॥ చైత్రము, వైశాఖము, జ్యేష్ఠము, ఆషాఢము, శ్రావణము, భాద్రపదము, ఆశ్వయుజము, కార్తికము, మార్గశీర్షము, పుష్యము, మాఘము, ఫాల్గుణము అను ప్రసిద్ధములయిన ఏ మాసములు గలవో ఆ మాసములు భక్షించుటకొఱకు మమ్ములను దూషించువానిని, మేము దూషించువానిని ఆ మాసాది దేవతల దంతములలో నుంచుచున్నాము. చక్కగా హుతమగుగాక. మధ్వాది దేవతలకిది.

మం॥ **చిత్తం చ చిత్తిశ్చాకూతం చాకూతిశ్చాధీతం చాధితిశ్చ విజ్ఞాతం విజ్ఞానం చ నామ చక్రతుశ్చ దర్శశ్చ పూర్ణమాసశ్చ తే యం ద్విష్మో యశ్చ నో ద్వేష్టి తమేషాం జంభే దధ్మస్స్వాహా ॥ చిత్తాదిభ్యో దేవతాభ్య ఇదమ్ ॥**

అ॥ చిత్తం చ = అంతఃకరణమున్ను; చిత్తిః చ = అంతఃకరణవ్యాపారమున్ను; ఆకూతం చ = అభిప్రాయమును పొందిన పదార్థమును; అకూతిః చ = అభిప్రాయమును; అధీతం చ = చదువబడు విద్యయును; అధీతిశ్చ = చదువుటయును; విజ్ఞాతం చ = తెలిసికొనబడిన విషయమును; విజ్ఞానం చ = తెలిసికొను జ్ఞానమును; నామ చ = పేరును; క్రతుః చ =

రూపమును; దర్శః చ = ఇష్టివిశేషమును; పూర్ణమాసః = పూర్ణిమయందు చేయబడునట్టి ఇష్టియను; తే = ఆ ప్రసిద్ధమైనవి యేవి గలవో; ఏషాం = వీనియొక్క; జంభే = దంతములయందు; వయమ్ = మేము, యమ్ = ఎవనిని; ద్విష్మః = ద్వేషించుచున్నామో; యః = ఎవడు; నః = మమ్ములను; ద్వేష్టి = ద్వేషించుచున్నాడో; తమ్ = వానిని; దధ్మః = ఉంచుచున్నాము. స్వాహా = చక్కగా హుతమవుగాక. చిత్త్యాదిభ్యః దేవతాభ్యః ఇదమ్ = చిత్తాది దేవతలకిది.

తా॥ అంతఃకరణ, అంతఃకరణవ్యాపారము, అభిప్రాయము, అభిప్రాయముగల పదార్థము, చదువుట, చదువబడిన విద్య, తెలిసికొనుట, తెలిసికొనబడిన విషయము, నామము – రూపము, దర్శపూర్ణ మాసేష్టులనబడినవి యేవి గలవో వానియొక్క అధిదేవతలెవరు గలరో వారు మాకు విరోధులైనవారిని భక్షించుటకొఱ కాదేవతల దంతములయందుంచుచున్నాము. చక్కగా హుతమగుగాక. చిత్తాదిదేవతలకిది.

మూ॥ ఇధ్మ సన్నహనం జయాది ప్రతిపద్యతే అహం భో అభివాదయే ॥ ఆచమ్య ।

తా॥ ఇధ్మసన్నహనం జయాదికమున్ను పొందబడుచున్నది. "**అహం భో అభివాదయే**" అని పిమ్మట ఆచమనము చేయవలెను. (చేసి)

సూ॥ అపరేణాగ్నిం ప్రాచీముపవేశ్య తస్యాశ్శిరస్యాజ్యశేషాత్ ।
కించిద్ధస్తేనాదాయ వ్యాహృతిభిరోంకారచతుర్థాభిరానీయ ॥

తా॥ అగ్నికి పడమరగా వధువును తూర్పుమొగముగా కూర్చుండబెట్టి హోమము చేయగా మిగిలిన నేతిని చేతితో ఎత్తికొని ఓంకారము నాల్గవదిగాగల క్రింద చెప్పఁబోవు వ్యాహృతులు పలికి వధువు తల మీద తాకింపవలయును.

మం॥ **ఓం భూస్స్వాహా, భువస్స్వాహా, సువస్స్వాహా, ఓగ్ం స్వాహా । సర్వేషామంతే సకృదానయతి । కేచిత్ప్రతిమంత్రమ్ । ఉత్తరాభ్యాం యథాలింగం మిథస్సమీక్ష్య ।**

అ॥ భూః = భూర్లోకము; భువః = భువర్లోకము; సువః = సువర్లోకము; ఓం = బ్రహ్మ; ఏతే = వీరు, తృప్యతు = నేను చేయు కర్మమువలన సంతోషమును పొందుదురు గాక. అని స్వాహా = హోమము చేయుచున్నాడు.

తా॥ నే చేయు కర్మమువలన భూలోక భువర్లోక సువర్లోక బ్రహ్మలు సంతోషించుగాక యని చేయుచున్నాడు. అన్నిటి చివర ఒక్కసారి చేయుచున్నాడు. కొందఱు ప్రతిమంత్రమునకు నందురు. క్రింది యీ రెండు మంత్రములు చెప్పి మంత్రలింగముననుసరించి అన్యోన్యము చూచుకొనవలెను.

మం॥ **అపశ్యం త్వా మనసా చేకితానం తపసో జాతం తపసో విభూతమ్ ।**
**ఇహ ప్రజామిహ రయిగ్ం రరాణః ప్రజాయస్వ ప్రజయా పుత్రకామ! ॥ వధూర్వరమీక్షేత॥**

అ॥ త్వా = నిన్ను; చేకితానమ్ = నా యభిప్రాయమును గుర్తెఱిగినవానిగాను; తపసః = గర్భాదానము మొదులగాగల షోడశకర్మములనెడు తపస్సువలన; జాతమ్ = పుట్టిన వానిగాను; తపసః = భిక్షాచర్యము మొ॥ తపస్సుచే; విభూతమ్ = ఐశ్వర్యముగలవానిగాను; మనసా = మనస్సుచే; అపశ్యమ్ = చూచితిని. పుత్రకామ = పుత్రులయందు కోరికగలవాడా! ఇహ = ఈ గృహమునందే; ప్రజామ్ = సంతానమును; రయిమ్ = ధనమునున్ను; రరాణః = ఇచ్చువాడవై; ప్రజయా = సంతోషముచేత; ప్రజాయస్వ = పుట్టుము.

తా॥ నాయభిప్రాయమును దెలిసిన వానిగాను, వేదోక్త షోడశకర్మలతో సంస్కరింపబడుటచే తపస్సువలన బుట్టినవానినిగాను, భిక్షాచర్య మొ॥ వానిజేసి వేదాభ్యాసము చేయుటచే ఐశ్వర్యము గలవానిగాను, అనగా బ్రాహ్మణునకు వేదమే సంపద యను అభిప్రాయమును మనస్సుచే జూచితిని అనగా గ్రహించితిని. సంతానాపేక్ష గల్గియున్న నీవు నాయందు సంతానమును బుట్టించి ఐశ్వర్యమును గలుగజేయుము అని భార్య భర్తతో చెప్పుచున్నది.

మం॥ **అపశ్యం త్వా మనసా ధీధ్యానాగ్ స్వాయాం తనూగ్ం ఋత్వియే నాధమానామ్ ।**
**ఉప మాముచ్చా యువతిర్బభూయాః ప్రజాయస్వ ప్రజయా పుత్రకామే ॥**
**వరోవధూమీక్షేత ।**

అ॥ త్వాం = నిన్ను; దీధ్యానామ్ = నాయందలి భక్తిచే నన్ను ధ్యానించుదానవుగాను; స్వాయాం తనూమ్ = నీ శరీరమందు; ఋత్వియే = ఋతుకాలమందైన గర్భమందు; నాధమానామ్ = కోరికగలదానినిగాను; మనసా = మనస్సుచేత; అపశ్యమ్ = చూచితిని. యువతిః = యౌవనము గల నీవు; మామ్ = నన్ను; ఉచ్చా = సంభోగకాలమందు పైనున్నవానిగా; ఉపబభూయాః = అనుభవింపుము. పుత్రకామే ! = పుత్రులనుగోరుదానా! ప్రజయా = సంతానముచేత; ప్రజాయస్వ = పుట్టుము.

తా॥ నాయందలి భక్తిచే నన్ను ధ్యానించుదానవుగాను, ఋతుకాలమందేర్పడు గర్భధారణ మందపేక్షగలదానవుగాను, నిన్ను నే దెలిసికొంటిని. యౌవనముగల నీవు నాతో సంభోగించితి వేని నీకు సంతానము గలుగును. వరుడు వధువును చూడవలెను. (మాతా పితృ శుక్ల శోణిత సంబంధము గల్గి యుండుటచే పుత్రరూపముగా జననముభయులయందు వర్తించు చున్నది.)

సూ॥ ఉత్తరయాఽఽజ్యశేషేణ హృదయదేశౌ సమ్మృజ్య ।

తా॥ క్రింది ఋక్కుచెప్పి మిగిలిన ఆజ్యములో వరుడు అంగుష్ఠానామికల ముంచి తమ రెండుపక్షముల నొక్కమారు తుడువవలెను. (సమం జంతు అనుమంత్రముతో మిగిలిన నేతితో ఒండొరుల హృదయదేశముల దాకవలెను.)

మం॥ **సమంజంతు విశ్వేదేవాస్సమాపో హృదయాని నౌ । సంమాతరిశ్వా సం ధాతా సముదేష్ట్రీ దిదేష్టు నౌ ॥**

అ॥ విశ్వే దేవాః = విశ్వే దేవతలు; నౌ = మనయిద్దరియొక్కయు; హృదయాని = హృదయములను; ఆపః = ఉదకములు; సమంజంతు = స్నేహముగలవిగాజేయుగాక; మాతరిశ్వా = వాయువు; సమనక్తు = స్నేహముగలవిగాజేయుగాక; ధాతా = బ్రహ్మ; సమనక్తు = స్నేహముగలవిగాజేయు గాక; దేష్ట్రీ = సంభాషణము చేయించు సరస్వతి; నౌ = మనయిద్దఱను; సందిదేష్టు = సంభోగకాలమందనుకూలమయిన సంభాషణ గల వారినిగా మనలను జేయుదురు గాక యని యర్థము.

తా॥ విశ్వేదేవతలు, జలములు, వాయువు, బ్రహ్మ వీరు మన మనస్సులను స్నేహముతో గూడినవిగా జేయుదురుగాక. సరస్వతి మనలను అనుకూలమయిన భాషణగలవారినిగాఁజేయుగాక.

మూ॥ ఉత్తరాస్తిస్రో జపిత్వా ।

తా॥ క్రింది మూడు ఋక్కులను జపము చేయవలెను.

మం॥ **ప్రజాపతే! తన్వం మే జుషస్వ త్వష్టర్దేవేభిస్సహాసామ ఇంద్ర! విశ్వైర్దేవై రాతిభిస్సగ్ంరరాణః పుగ్ంసాం బహూనాం మాతరస్స్యామ ॥**

మం॥ **అనః ప్రజాం జనయతి ప్రజాపతిరాజరసాయ సమనక్త్వర్యమా । అదుర్మంగలీః పతిలోక మావిశ శం నో భవ ద్విపదే శం చతుష్పదే ॥**

మం॥ **తాం పూషఞ్ఛివతమామేరయస్వ యస్యాం బీజం మనుష్యా వపంతి । యాన ఊరూ ఉశతీ విశ్రయాతై యస్యాముశంతః ప్రహరేమ శేఫమ్ ॥**

అ॥ ప్రజాపతే ! = ఓ బ్రహ్మ!; మే = నాయొక్క; తన్వమ్ = శరీరమును; జుషస్వ = ప్రవేశించుము. త్వష్టః = ఓ ప్రజాపతీ! సహాసామః = రూపనిర్మాణమందు సమర్థుడవైన; త్వమ్ = నీవు; దేవైః = దేవతలతో గూడ; మే = నా యొక్క; తన్వమ్ = శరీరమును; జుషస్వ = ప్రవేశింపుము. ఇంద్ర! = ఓ యింద్రుడా! రాతిభిః = నీకు మిత్రులయిన; విశ్వైః = సమస్తమైన; దేవైః = దేవతలతో గూడ; మే = నాయొక్క; తన్వమ్ = శరీరమును; ప్రవిశ్య = ప్రవేశించి; సంరరాణః = మాయొక్క కోర్కెలనిమ్ము. ఆవామ్ = మేమిద్దఱము; బహూనామ్ = అనేకులయిన; పుంసామ్ = పురుషులకు; మాతరః = తల్లిదండ్రులము; స్యామ = అయ్యెదము.

అ॥ ప్రజాపతిః = బ్రహ్మ; నః = మా యిద్దఱకు; ప్రజామ్ = సంతానమును, జనయతి = పుట్టించుగాక. అర్యమా = సూర్యుడు; ఆజరసాయ = ముదిమి పర్యంతము; ఆవామ్ = మమ్ములను; సమనక్తు = స్నేహము గలవారినిగా జేయుగాక. త్వమ్ = నీవు; అదుర్మంగలీః = అమంగళములు లేనిదానవగుచు అనగా సువాసినిగా ఉన్నదానవగుచు; పతిలోకమ్ = పతియైన నాయొక్క గృహమును; ఆవిశ = నివసించి యుండుము. నః = మాకొఱకు; శమ్ = సుఖమును; ద్విపదే = రెండు పాదములు గల మనుష్యులు మొ॥ వానికొఱకు; శమ్ = సుఖమును; ఏధి = వృద్ధి పొందించుము.

అ॥ పూషన్ = ఓ సూర్యుడా! తామ్ = ఆ పూర్వోక్తమైన నా భార్యను; శివతమామ్ = అనుకూలమైన దానినిగా; కృత్వా = చేసి; ఏరయస్వ = నా వద్దకు ప్రేరేపింపుము. మనుష్యాః = మనుష్యులు; యస్యామ్ = ఏ స్త్రీయందు; బీజమ్ = వీర్యమును; వపంతి = ఉంచుచున్నారో; యా = ఏ స్త్రీ; ఉశతీ = కోరుచున్నదై; ఊరూ = తొడలను; విశ్రయాతై = విడునట్లు చేయుచున్నదో; వయమ్ = మేము; ఉశంతః = కోరుచున్నవారమై; యస్యామ్ = దేనియందు; శేఫం = శిశ్నమును; ప్రహరేమ = ప్రయోగించుచున్నామో అని వెనుకకన్వయము.

తా॥ ఓ ప్రజాపతీ! త్వష్ట అనబడెడి యో బ్రహ్మా! ఇంద్రుడా! మీరందఱును మీకు స్నేహితులైన సమస్తమైన దేవతలతోగూడ నా శరీరమందు ప్రవేశించి నాకు బలమును గలిగింపుడు. నాకోర్కెలన్నియు నొసగుడు. మాకనేకులయిన తనయులు జనియించు నట్లు చేయుడు.

తా॥ బ్రహ్మ మాకు సంతానమును గల్గించుగాక. సూర్యుడు మేము బ్రతికియుండునంత పర్యంతము మమ్ములను స్నేహముగల వారినిగా జేయుగాక. నీవు చిరకాలము సువాసినిగా నుండి మాకును ఇతరులైన మనుష్యులకును పశువులు మొదలగు వానికిని సుఖము గలుగ జేయుచుండుము.

తా॥ ఓ సూర్యుడా! స్త్రీలయందు పురుషులు శుక్లమును విడిచి పెట్టుటచే సంతానము గలుగును. కాబట్టి యే స్త్రీ ఆపేక్షగలదై సంభోగాదులకు దగిన ప్రయత్నసన్నాహములను జేయుచుండునో అట్టి నా భార్యను నాకనుకూలమైన దానినిగా జేసి నావద్దకు పంపించుము.

సూ॥ శేషగ్ం సమావేశనే జపేత్ ॥

తా॥ మిగిలిన ఆరోహోరుమ్ అనుదానిని సమావేశన కర్మయందు జపించవలెను.

ఇది మొదలు ప్రతిసంకల్పమును ఈక్రింది విధమున ధర్మపత్నీ సమేతముగా జేయుచుండవలెను.

మూ॥ ఆచమ్య । శుభతిథౌ ... శ్రీమాన్ ... గోత్రః ... నామధేయః ధర్మపత్నీతోసమేతోఽహం, శ్రీమతః ... గోత్రస్య ... నామధేయస్య ధర్మపత్నీ సమేతస్య మమోపాత్తదురితక్షయద్వారా శ్రీ పరమేశ్వరప్రీత్యర్థం సమావేశన జపం

తా॥ కరిష్యే । అని పైవిధముగా సంకల్పము చేసి ఒకపళ్లెములో సఫల దక్షిణాయుక్త తాంబూలము లుంచి యిద్దఱును పట్టుకొని క్రింది అనువాక శేషమును జపింపవలెను.

మం॥ **ఆరోహోరుముపబర్హస్వ బాహుం పరిష్వజస్వ జాయాగ్ం సుమనస్యమానః ।**
**తస్యాం పుష్యతం మిథునౌ సయోనీ బహ్వీం ప్రజాం జనయంతౌ సరేతసా ॥**

అ॥ ఆత్మన్ ! = ఓ ఆత్మా! ఊరుమ్ = తొడను; ఆరోహ = అధిష్ఠించుము. బాహుం = హస్తమును; ఉపబర్హస్వ = చూపుము. తస్యామ్ = దానియందు; సుమనస్యమానః = ప్రేమగలవాడవై; జాయామ్ = భార్యను; పరిష్వజస్వ = ఆలింగనము చేసికొనుము. పుష్యతమ్ = (మీరిద్దరు) పుష్టిగల్గియుండుడు; మిథునౌ = మీరు దంపతులై; సయోనీ = కలిసికొనిన యుపస్థేంద్రియమును

గలవారై; సరేతసా = వీర్యముతోగూడిన వారలగుచు; బహ్వీమ్ = విశేషమయిన; ప్రజాం = సంతానమును; జనయంతౌ = పుట్టించుచుండుడు.

తా॥ పురుషుడు తన ఆత్మతో చెప్పుచున్నాడు. ఓ ఆత్మా ! భార్య యందు ప్రేమగలవాడవై కటిప్రదేశము నధిష్ఠించి బాహువులను జూచి భార్యను ఆలింగనము చేసికొనుము. ఇప్పుడు తమ యిద్దఱిని గూర్చి చెప్పుచున్నాడు. మీరిద్దఱు దంపతులై పుష్టిగల వారగుచు సంభోగించి వీర్యమును గ్రహించిన వారలై సంతానమును బుట్టించు చుండుడు.

మం॥ **ఆర్ద్రయారణ్యా యత్రామంథత్పురుషం పురుషేణ శక్రః ।**
**తదేతౌ మిథునౌ సయోనీ ప్రజయాఽమృతేనేహ గచ్ఛతమ్ ॥**

అ॥ ఆర్ద్రయా = నేతితోఁ దడపబడిన; ఆరణ్యా = ఆరణిచేత; అగ్నిమ్ = అగ్నిని; యత్ర = ఏ ప్రకారము; అమంథత్ = మథించెనో; శక్రః = దేవేంద్రుడు; పురుషేణ = పురుషరూప మేఢ్రముచేత; పురుషమ్ = పురుషుడగు గర్భస్థజంతువును; అమంథత్ = తరిచెనో; తత్ = ఆ ప్రకారముగా; మిథునౌ = దంపతులయిన; ఏతౌ = ఈ మీరిద్దఱు; సయోనీ = కలిసికొనిన వారలై; ప్రజయా = సంతానమును; అమృతేన = అమృతముచేత; ఇహ = ఇక్కడను; గచ్ఛతమ్ = పొందుడు.

తా॥ మా ఆత్మలారా! యజ్ఞాదికమునందరణిచే మథించి యగ్నినెట్లు పుట్టించెదరో యాతీరున దేవేంద్రుడు సంతానమును గలుగజేయుటకు రతి వ్యాపారములనుగురించి ప్రోత్సాహపఱచు చున్నాడు. గాన దంపతులయిన మీరిద్దఱును సంభోగించుటకు గలిసి కొనినవారలై అమృతమువలెనే శ్రేయస్కరమగు సంతానమును పొందుదురుగాక.

మం॥ **అహం గర్భమదధా మోషధీష్వహం విశ్వేషు భువనేష్వంతః । అహం ప్రజా అజనయం "పితౄణా మహం జనిభ్యో అ వరీషు పుత్రాన్" ॥**

అ॥ అహమ్ = నేను; ఓషధీషు = ఓషధులయందు; గర్భమ్ = బీజమును; అదధామ్ = ధరించితిని. అహమ్ = నేను; విశ్వేషు = సమస్తములయిన; భువనేషు = లోకములయందు; అంతః = లోపలను; స్థితః = ఉంటిని. అహమ్ = నేను; పితౄణామ్ = పితృదేవతలయొక్క; అధ్యాహారము అర్థాయ = ప్రయోజనము కొఱకు; ప్రజాః = సంతానమును; అజనయమ్ = పుట్టించుచున్నాను. అహమ్ = నేను; జనిభ్యః = ఈ నా భార్యవలనను; అవరీషు = ఇతరులైన కోడండ్రు మొదలగు వారియందును; పుత్రాన్ = పుత్రులను; అజనయమ్ = పుట్టించుచున్నాను.

తా॥ శ్రౌతస్మార్త కర్మములందియ్యబడిన హవిస్సువలన క్రమముగా ఓషధులయందు ప్రవేశించుటచే ఓషధులయొక్క గర్భమునకు నేనే కారణమయిన వాడను. అనగా అగ్నియందుంచబడిన హవిస్సులు సూర్యునిం జేరి సృష్టిరూపముగా ఓషధులం బ్రవేశించును. అంతరాత్మగా సమస్త భూతములయందును నేనే నిండియున్న వాడను, పితృదేవతల ఋణమును దీర్చుకొనుటకు

నేనే సంతానమును బుట్టించుచున్నాను. ఈ నా భార్యయందు నేనే సంతానమును బుట్టించు చున్నాను. నా తనయులవలన కోడండ్రయందు సంతానము గల్గుటచే దానికి కారణమయిన వాడను నేను.

మం॥ **పుత్రిణేమా కుమారిణా విశ్వమాయుర్వ్యశ్నుతమ్ । ఉభా హిరణ్య పేశసా వీతిహోత్రా కృతద్వసూ॥**

అ॥ ఇమాః ఇమౌ = ఈ; ఉభౌ = దంపతులు; పుత్రిణాః = కుమారులు గలవారై; కుమారిణాః = కుమార్తెలు గలవారై; హిరణ్యపేశసాః = బంగారువంటి రూపముగలవారై; వీతిహోత్రాః = హవిస్సుచే హోమము చేయువారై; కృతద్వసూః = సంపాదింపబడిన ధనముగలవారై; విశ్వమ్ = విశేషమయిన; ఆయుః = ఆయుస్సును; వ్యశ్నుతమ్ = పొందుదురుగాక.

తా॥ ఓ ఆత్మా । ఈ దంపతులిద్దఱును కుమారులు. కుమారికలు గలవారై బంగారు కాంతి గలవారై యజ్ఞము మొ॥ కర్మములను జేయువారై, ధనమును సంపాదించినవారై పరమాయుర్దాయమయిన నూటపదియాఱు సం॥రముల పర్యంతము జీవింతురుగాక.

మం॥ **దశస్యం త్వామృతాయకం శమూథో రోమశగ్ం హథో దేవేషు కృణుతో దువః ॥**

అ॥ దశస్యం త్వా = యాచకుల కోర్కులనిచ్చుచు; అమృతాయకమ్ = దేవత్వమును పొందుటకొఱకు; రోమశమ్ = రోమములచే వ్యాప్తమైన; ఊధః = ఉపస్థేంద్రియమును; శం హథః = కలిసికొనినట్లు చేయుడు. దేవేషు = దేవతల విషయమై; దువః = పరిచర్యను; కృణుతః = చేయుదురుగాక. **రోమములు రాకపూర్వము ఉపస్థ భోగయోగ్యము కాదని యభిప్రాయము.**

తా॥ ఓ దంపతులారా! యాచకుల కోర్కెల దీర్చుచు పితృఋణమును దీర్చి స్వర్గలోకంబున స్థిరముగా నుండుకొఱకు సంతానమును బడయుటకై సంభోగింపుడు, పిమ్మట సంతానముగలవారై స్వర్గలోకంబున నుండి దేవతల సేవింపుచుండుడు.

మూ॥ సమావేశన ముహూర్తస్సుముహూర్తోఽస్తు ॥

తా॥ సమావేశనముహూర్తము సుముహూర్తము అవుగాక.

ఆశీర్వాద ః । ఇతి శేషహోమః । తతో నాకబలిం కుర్యాత్ । నీలలోహితధారణం కుర్యాత్ । కంకణవిమోచనం కుర్యాత్ ॥

## ధర్మశాస్త్రవిషయములు

మూ॥ సంకల్పానంతరం తస్య ముఖ్యకాల ఇతి స్మృతః ।
హస్తగ్రహణకాలో వా చతుర్థ్యాం నిశి మోచయేత్ ॥

తా॥ రక్షాబంధనము సంకల్పము కాగానే కట్టుకోవలెను. పాణిగ్రహణ కాలమందైనను సరియే, శేషహోమముకాగానే విప్పివేయవలెను. ( ఈ రక్షను కట్టుకొనుట, శిష్టాచారమువలన హస్తగ్రహణకాలమందే జరుగుచున్నది.)

మూ॥ శ్లో॥ పూజనే మధుపర్కే చ కన్యాదానే తథైవ చ ।
కర్మ స్వేతేషు వై భార్యా దక్షిణే తూపవేశయేత్ ॥

తా॥ వరుని పూజించునప్పుడును మధుపర్క మిచ్చునప్పుడును కన్యాదానమప్పుడును, దాతభార్య తనకు దక్షిణమున నుండవలెను.

మూ॥ శ్లో॥ భోజనే వాహనేకాలే ఉపహారే విశేషతః ।
మధుపర్కప్రదానేతు ద్విర్ద్విరాచమనం భవేత్ ॥

తా॥ భోజనానంతరమును, వాహనము దిగినప్పుడును, అల్పాహారము చేసినప్పుడును, మధుపర్క ప్రాశనకాలమందును రెండేసిసార్లు ఆచమించవలెను.

మూ॥ యోక్త్రావేష్టనే కాలేతు భ్రువోస్సంమార్జనే తథా ।
వధూతండులనిక్షేపే వరో వారుణదిఙ్ముఖః ॥

తా॥ యోక్త్రము కట్టునప్పుడును, భ్రూసంమార్జనమప్పుడును, తలంబ్రాల సమయమునను వరుడు వధువునకెదుర పడమటి ముఖముగా నుండవలెను.

మూ॥ కిం తు వైవాహికాదేవ పితృగోత్రం న ముంచతి ।
స్వగోత్రాద్భ్రశ్యతే నారీ క్రమణాత్సప్త మే పదే ॥

తా॥ పాణిగ్రహణమైనంత మాత్రమున వధువు తండ్రి గోత్రమును విడువదు. సప్తపదియైన పిమ్మట పితృగోత్రమును వీడి భర్తగోత్రమును పొందును.

మూ॥ ప్రధానహోమే యదృదాదిహోమే ప్రవేశహోమే చ వివాహశేషే ।
సీమంతహోమే సువనే చ కర్మణ్యే తేషు హోమేషు చ దక్షిణా స్త్రీ ॥

తా॥ ప్రధాన యదృదాది ప్రవేశ శేష సీమంత పుంసువన హోమముల యందు వధువు దక్షిణమున ఉండవలెను. (ఆగ్నేయ స్థాలీపాకము, వధూసంబంధముగాన దాని యందును దక్షిణ వధువే.)

మూ॥ సంస్కారః పురుషో వాపి స్త్రీ వా దక్షిణతో భవేత్ ।
సంస్కారకస్తు సర్వత్ర తిష్ఠేదుత్తరతస్సదా ।

తా॥ సంస్కరింపబడెడువారు పురుషుడైనను స్త్రీ యైనను దక్షిణమున నుండవలెను. సంస్కరించు వారెప్పుడు నుత్తరమున నుండవలెను.

శ్లో॥ వివాహహోమే ప్రక్రాంతే యది కన్యా రజస్వలా ।
త్రిరాత్రం దంపతీ స్యాతాం పృథక్ఛయ్యాసనాశనౌ ॥
చతుర్థేఽహని సంస్నాతా తస్మిన్నగ్నౌ యథావిధి ।
వివాహహోమం కుర్యాతామిత్యాది స్మృతి సంగ్రహః ॥

తా॥ ప్రధానహోమకాలము సమీపించగా కన్య రజస్వలయైనచో ఆ మూడు రోజులును దంపతులు కూర్చుండుట, శయనించుట, భుజించుటలను వేరువేరుగా జేసి నాల్గవ రోజున స్నానాభ్యంగనములు చేయించి యాగృహ్యాగ్నియందు యథావిధిగా ప్రధానహోమాదికము గర్భాదానాంతము చేయవలెను.

మూ॥ ఆచతుర్థీ వ్రతం వృద్ధనిర్దిష్టం నియతశ్చరేత్
ఏకపాత్రే సమం వధ్వా భుంజీత పయసా వరః
తత్పంక్తావపి భుంజీరన్ సువాసిన్యః కులస్త్రియః ।
మాతా స్వసా భగినీ మాతులానీ వరస్య తు ॥
గౌర్యా లక్ష్మ్యాస్తథేంద్రాణ్యాః ప్రీతయే మంగళాయ చ ॥

తా॥ వివాహదీక్ష నాల్గురోజులును పెద్దలు చెప్పిన యాచారము తప్పక పాటించవలెను. ఒకపాత్రయందే దంపతులు పాలతో భుజింపవలెను. కులములోని పెద్ద ముత్తైదువలా పంక్తిని భుజింపవలెను. వరుని తల్లి, యత్త, తోబుట్టువులు, వదినె, మరదంద్రు దగ్గరగా కూర్చుని భుజించుటవలన పార్వతీ లక్ష్మీ శచీదేవులు సంతసించి మంగళాచరణ మాచరింతురు.

## గమనింప వలసిన కొన్ని విషయములు

### పాకెన తగవు

సదస్యము రోజున మధ్యాహ్నానంతరము మంగళ వాద్యములతో ఫలహార వస్తువులను విడిదెకు గొనిపోయి యిచ్చుట.

### చతుర్థ తగవు

ఇది నాల్గవ రోజున సాయంత్రము మంగళఘోషములతో అభ్యంగనమునకు వలయు సామగ్రిని విడిదెకు గొనిపోయి యిచ్చుట. ఈ తగవు ఐదవరోజున వెంటనే కంథ తగవుగా ఫిరాయించుటకుగాను చేయుదురు. అది సులువున్నూ సందర్భమున్నూ కూడా కాదు.

### కంథ

మగపెండ్లివారు పెండ్లికుమార్తెచేత గౌరీపూజ చేయించు నిమిత్తము తెచ్చు ఫలాదులు.

### కొట్నాలు

రెండు బుట్టలతో ధాన్యమును నూతన వధూవరుల ముందిడి ముత్తైదువులు దంచి ఆ ఊకను వధూవరుల శిరమున పళ్లెరములతో చెరగుదురు తరువాత తలలకు చమురు పెట్టుదురు. తరువాత అన్యవస్త్రములను ధరించి మధుపర్కములను చాకలికి వేసి బహుశీఘ్రముగా నారవేసి తీసుకువచ్చు నేర్పాటు చేయవలెను. అభ్యంగనమైన తరువాత ప్రాతరౌపాసము చేసి “అగ్నే నయ” మొదలగు మంత్రములచేతను శ్లోకములచేతను ప్రదక్షిణము చేసి అగ్న్యుద్వాసనము చేయవలెను.

శ్లో॥ ఫలం మనోరథఫలం పుత్ర పౌత్ర ప్రవర్ధనమ్ ।
యస్మాత్తస్మాచ్ఛివం మే స్యాదత శ్శాంతిం ప్రయచ్ఛ మే ॥
ఫలదానకల్పోక్తసంపూర్ణసకలఫలావాప్తిరస్తు ॥
సంతత శ్రీరస్తు । సమస్తసన్మంగళాని భవంతు ।
నిత్య శ్రీరస్తు । నిత్యమంగళాని భవంతు ॥

శ్లో॥ మత్కర్మ కుర్వతాం పుంసాం కర్మలోపో భవేద్యది ।
తత్కర్మ సఫలం కుర్యుస్త్రిస్రః కోట్యో మహర్షయః ॥
యత్కరోమి యదశ్నామి యజ్జుహోమి దదామి యత్ ।
యత్తపస్యామి శ్రీవిష్ణో తత్కరోమి త్వదర్పణమ్ ॥

అనేన మయా కృతేన ప్రాతరౌపాసనహోమేన భగవాన్ సర్వాత్మకః శ్రీయజ్ఞేశ్వరస్సుప్రీణాతు । యజ్ఞేశ్వరార్పణమస్తు ।

(పిమ్మట నాకబలి తంతును ముత్తైదువుల నడిగి చేయవలెనని భాష్యకారులు వ్రాసియున్నారు.)

**ఇదియొక క్రమము.**

తరువాత విడిదెకు వెళ్లి ఆరనిచ్చి తెచ్చిన మధుపర్కముల ధరించి పాన్పుమీద అలక సాగించ వలెను.

తరువాత తోడల్లునకు మరదలు మాడకట్నము చెల్లించి పెండ్లికుమార్తెను వెంటబెట్టుకొని అంతకు ముందే సిద్ధము చేసి యుంచిన ప్రోలువద్దకు వచ్చి ముందు ముప్పదిమూడు జోతుల పళ్లెములు రెండుపట్టుకొని ముత్తైదువలు నలుగురు నడుచుచుండగా అందరికంటె ముందు పురోహితుడు "వాతో దేవతా" అను మంత్రము చెప్పుచు వసంతముతో దారి చూపుచుండగా ప్రోలునకు మూడు ప్రదక్షిణములు చేయవలెను.

తరువాత ఆర్గురును తూర్పుముఖముగగాని యుత్తరముఖముగ గాని నిలిచి "త్రింశత్కోటి దేవతాభ్యో నమః ఇదమర్ఘ్యం సమర్పయామి" అని వసంతముతో అర్ఘ్యము మూడు సార్లు ఆ ప్రోలునందు విడువ వలెను. తరువాత ఆ నూతన దంపతులు చేతులు కడుగుకొని కండ్లు తుడుచుకొని అక్కడనే పీటలమీద కూర్చుని విఘ్నేశ్వరపూజ చేసి నీలలోహితపూజ, గౌరీపూజయు చేయవలెను. కృసరాన్నము (పులగం) నివేదన చేయవలెను. పిమ్మట వధువున కభిముఖుడై వరుడు "నీలలోహితే" అను మంత్రము చెప్పి నీలలోహితమును కట్టవలెను.

**"నీలలోహితధారణముహూర్తస్సుముహూర్తోఽస్తు"**

ఆ తరువాత రెండు నీళ్లబిందెలయందుంచి ఒక స్వర్ణాభరణము ఒక రజతాభరణమును ఆ బిందెలయందు వైచి దంపతుల నిద్దరిని ఒక్కమారు తీయమని ఆ తీసిన వస్తువులను పురోహితుడు పుచ్చుకొని "ఇయం వైరజితా" అను మంత్రముతో నాయాభరణముల నంటిన యుదకము నా దంపతుల శిరములఁ జల్లవలెను. ఇట్లు మూడుసార్లు చేయవలెను.

పిమ్మట దండాడింపు, వప్పగింతలు.

శ్లో॥ అష్టవర్షా భవేత్కన్యా పుత్రవత్పాలితా మయా ।
ఇదానీం తవ దాస్యామి దత్తా స్నేహేన పాల్యతామ్ ॥

(తవ పుత్రస్య తవ చ భ్రాతుః, తవ పౌత్రస్య ॥) విడిది గృహప్రవేశము, ఆశీర్వచనము.

కంకణ విమోచనము, మిథున విడియ ఉపహారాదులు ఆచార్య సంభావనము, బృహస్పతి సంభావనము. దీక్షిత సంభావనము, విద్వత్సంభావనము మొ॥నవి.

సమాప్తము.